రంగాచార్యులు, కిళాంబి

# జాతక కథలు

జయనగరము, 1927

Record no. 462

Raṅgācāryulu, Kiḷāmbi

Jātaka kathalu

Vijayanagaramu, 1927

Record no. 462

## Bibliographic Record Target

రంగాచార్యులు, కిళాంబి.

జాతక కథలు : పాళీ జాతకకథల కనువాదము / కిళాంబి రంగాచార్యుఁడు. - 2. కూర్పు.- విజయనగరము : శ్రీరామానుజ విలాస ముద్రాక్షరశాల, 1927.

xiii, 128 p. ;21 cm.

Record no. 462

Raṅgācāryulu, Kiḷāmbi.

Jātaka kathalu : Pāḷī jātakakathala kanuvādamu / Kiḷāmbi Raṅgācāryum̐ḍu. - 2. kūrpu.- Vijayanagaramu : Śrīrāmānuja vilāsa Mudrākṣaraśāla, 1927.

xiii, 128 p. ;21 cm.

Record no. 462

# జాతకకథలు

(పాళీ జాతకకథల కనువాదము.)


కిళాంబి రంగాచార్యుఁడు

ఎం. ఏ. బి. ఎల్





2వ, కూర్పు.

విజయనగరము

శ్రీరామానుజ విలాస ముద్రాక్షరశాలయందు

ముద్రింపబడియె.

1927

# విషయసూచిక

# ఉపోద్ఘాతము.



పాళీవాఙ్మయమున జాతకనామమున విఖ్యాతిఁజెందిన యుద్గ్రంథమైదువందల యేబది కథలుకలదై యున్నది. ఈకథలిరువది రెండు నిపాతములు (భాగములు) గ విభజింపఁబడియున్నవి. ఇందులో నొక్కొక్కకథయు బుద్ధుఁడవతారమెత్తకపూర్వము బోధిసత్త్వుఁడై యవతరించిన యైదువందలయేబదియగు పూర్వజన్మములయందలి యొక్కొక్కజన్మయందైన వృత్తాంతములంగూర్చి చెప్పుచున్నది. ప్రతికథయు పచ్చుప్పన్నవత్థుతోఁ (వర్తమానవృత్తాంతముతోఁ) బ్రారంభించుచున్నది. బుద్ధుఁడు తానవతారమెత్తిన దశలోఁ దనకుఁ బ్రాప్తించిన సంభవములఁగూర్చియే యీకథల నొక్కొక్కదానిని చెప్పినట్లీకథలు వ్రాయఁబడినవి. అట్లొక్కొక్క కథాసంకథనమునకుఁగారణములైన సంభవములే "పచ్చుప్పన్నవత్థు" లేక వర్తమాన వృత్తాంతము అని చెప్పఁబడుచున్నది. ఒక్కొక్క కథాంతమునను బుద్ధుఁడు కథలలోని పాత్రలను దనసమకాలీనులైనతనతో బౌద్ధమతవృద్ధింగూర్చి పాటుపడుచుండిన పండితులతోఁ బోల్చి చెప్పుచున్నట్లీకథలయందు నిరూపింపఁబడినది.

ప్రతికథయు బుద్ధుఁడు బోధిసత్త్వుఁడైయున్నపుడు వానిచేఁ జెప్పఁబడిన గాథయనఁబడు నొక్కొక్కపద్యముతోఁగూడియున్నది. వీనిలోఁ గొన్నిశ్లోకములు ధమ్మపదంబనంబడుపుస్తకములోఁ గనఁబడుచున్నవి. మఱియు నీకథలలోఁ గొన్నికొన్నిమార్పులతోఁ ధమ్మపదవ్యాఖ్యానమునఁ జెప్పఁబడినవి. ఈగాథలయొక్క భాష కథలయొక్కభాషకంటెఁ బురాతనమని విద్వాంసులూహించుచున్నారు. మఱియు నీగాథలే జాతకములకు మూలములై "చరియపిటకము" వలె నీజాతకకథలు మొట్టమొదట గాథారూపములతోనుండెనని బౌద్ధవాఙ్మయ జ్ఞానసంపన్నులగు విద్వాంసులూహించుచున్నారు.

గాథలే జాతకములకాదిరూపములనియు నీగాథలకువ్యాఖ్యానముగ సింహళభాషయందీకథలు వ్రాయఁబడెనని సింహళద్వీపమున నొకయైతిహ్యముగలదు. సింహళభాషనుండి క్రీ॥ శ॥ 430 వ సంవత్సరములో బుద్ధఘోషుండను విఖ్యాతవ్యాఖ్యాతచేఁ బాళీభాషలోనికిఁ నియ్యవి పరివర్తనము కావింపఁబడినవనియుఁ బిమ్మట సింహళభాషయందలి మాతృకలు నశించినవనియుఁ బైఁజెప్పఁబడిన యైతిహ్యము నుడువుచున్నది. ఈయంశ పాళీభాషాచరిత్రమునకుఁగాని మఱిదేనికి నంతముఖ్యమైన విషయముకాదు.

ఈజాతకకథలు వ్రాయఁబడినకాలమునిర్ణయించుట యత్యావశ్యకము. కాని కాలనిర్ణయము మాత్రమంతసులభముకాదు. ఈజాతకకథలన్నియును నొక్కప్యాయము కాని యొక్కనిచేఁగాని వ్రాయఁబడియుండలేదనిమాత్రము నిశ్చయింపఁబడినది. ఒక్కొక్కకథ కొక్కొక్కచారిత్రమున్నది. జాతకకథలలోఁ గొన్ని బౌద్ధస్తూపచైత్యాది శిలాఫలకములపైఁ జెక్కఁబడి విద్వాంసులచేఁ గన్గొనఁబడినవి. ఇందులకుదాహరణముగ బార్హూతస్తూపముపైని జెక్కఁబడిన నిగ్రోధమిగజాతకముఁజెప్పవచ్చును. బార్హూతస్తూపకాలము క్రీస్తుశకమునకు మూఁడుశతాబ్దములు పూర్వమని విద్వాంసులుచెప్పుచున్నారు. జాతకకథలలో నవీనముగఁ బరిగణింపబడుచున్న కొన్ని, క్రీస్తుజననమునకు మూఁడుశతాబ్దములు పూర్వమేయున్నటుల బౌద్ధస్తూపచైత్యాదులవలన నిర్ణయింపఁబడినది. ఈవిషయములంబట్టిచూడఁగ జాతకకథలలోఁ జాలభాగమిరువదిమూఁడు శతాబ్దములకుఁబూర్వమే దేశముననున్నట్లు స్పష్టమగుచున్నది. ఈజాతకకథలఁగూర్చి వ్రాయుచు విఖ్యాతిఁజెందిన హోఫురాతుబ్యూహాలరు **(Hofrath Buhler)** అను పాశ్చాత్యవిద్వత్పుంగవుండీరీతిగవ్రాయుచున్నాడు. “బౌద్ధభిక్షులీకథలను సంగ్రహించుటలో విస్తారముగ మార్పులనుగావించుచు బౌద్ధమతము భరతవర్షమున మతములన్నిటిలో వృత్కృష్టపదవిని బొందినపుడు దేశముననున్న సంఘపరిస్థితు



లకనుగుణముగ దేశీయులజీవితము విషయమైన యంశములను మార్చియుండిరా యనునదిమనము చర్చింపవలసినవానిలో ముఖ్యాంశమైయున్నది. ఈకథలలో బౌద్ధమతసంబంధమైన విషయములతిస్వల్పముగనున్నవనియును, క్రీస్తుజననమునకుఁ బూర్వము మూఁడునాల్గుశతాబ్దములనాటికంటెఁ బురాతనమై భారతవర్షసంఘపరిస్థితులను దెలియఁజేయుచున్నవని పైయంశమునకుత్తరమైయున్నది.

“రాజకీయమతసాంఘిక పరిస్థితుల నిరూపణములు నందమౌర్యవంశములుద్భవించుటకుఁ బూర్వమును, పాటలీపుత్రము భరతవర్షమునకు రాజధానియగుటకుఁ బూర్వమును, దేశమువందుండినపరిస్థితులను దెల్పుచున్నవి. నందులయొక్కగాని, మౌర్యులయొక్కగాని, వంశములను జాతకకథలునుడువక, భారతవర్షమునందంతటనుగాని యందధికభాగమునందుఁగాని వ్యాపించియుండిన సామ్రాజ్యములనయ్యవిపేర్కొనవు. జాతకకథలలో ముఖ్యపాత్రలుగఁ గనుపించురాజులు పరిపాలించుచున్న దేశములసంఖ్య మిక్కుటముగనున్నది. మద్ర, పాంచాలద్వయంబు, కోసల, విదేహ, కాశి, విదర్భదేశనామములు పైఁజెప్పఁబడిన వానిలో ముఖ్యములై వైదికవాఙ్మయమునఁ జెప్పఁబడిన నామములతో సరిపోవుచున్నవి. కళింగ, అస్సక, అనుదేశములు బ్రాహ్మణవాఙ్మయములోఁ బురాణములలోను, పాణినీయసూత్రములలోను పేర్కొనఁబడినవి. ఆంధ్రపాండ్యకేరళనామంబులు మాత్రము చెప్పఁబడియుండలేదు”.

“రాజకీయవ్యవహారములకు ముఖ్యప్రదేశముగ నొక్కస్థానమెద్దియుఁ బేర్కొనఁబడకుండినను బ్రాహ్మణరాజన్యాది యువకుల విద్యాభ్యాసముఁగూర్చి యతివిస్తారముగఁ జెప్పఁబడుటచే దూరస్థగాంధారదేశరాజధానియగు తక్కశిలానగరంబు విద్యాదులకు ముఖ్యస్థానమైయున్నట్లు కానుపించుచున్నది. పాణినికి జన్మస్థానమైన గాంధారదేశము క్రీస్తుజననమునకుఁ బూర్వము మూఁడునాల్గుశతాబ్దములనాటికైనను బ్రాహ్మణవిద్యలకు వాసస్థానమైయున్నట్లు

నిశ్చయముగ మనము పరిగణింపవచ్చును. హిందూదేశపు మతపరిస్థితుల నిరూపణములీ ప్రాతనకాలమునే నిర్ణయించుచున్నవి. వేదత్రయ మెట్లువ్యర్థకృష్టశిక్షకు మూలముగఁ బరిగణింపఁ బడుచుండెడిదో యట్టులనే మతవిషయములఁగూడ వాజపేయరాజసూయాది శ్రౌత కర్మలే ముఖ్యముగఁ జేర్కొనఁబడుచున్నవి. వీనిలోఁగూడ సామాన్యోత్సవములు, శిలావృక్షాదిపూజలు, నక్షత్రప్రకటనమైనపుడు జరుపుసురాపానాద్యానందోత్సవములును నీకథలతిపురాతనములని కనుపఱచుచున్నవి. వనవాసులగుమునులును, నెల్లెడలఁ బరిభ్రమించు సన్న్యాసులును నీకథలలోఁ గానుపింపకపోరు. ఈకథలలో నిరూపింపఁబడిన పూర్వపుదేశౌన్నత్యము మిక్కిలి పురాతనమై కనిపించుచున్నది. క్రీస్తుజననమునకు మూఁడు శతాబ్దములకంటెఁ బూర్వము దేశమునుండి నశించిపోయినదారుశిల్పమత్యధికముగ నీకథలయందు నిరూపింపఁబడుచున్నది. రాజప్రాసాదంబులును దారునిర్మితములని యీజాతకములు నుడువుచున్నవి.

ఈజాతకకథలుచెప్పువిషయములు బహువిధములైనవి. ఈకథలలో జంతుసంబంధమైన దృష్టాంతములును, నుపాఖ్యానంబులును, సంతోషదాయకంబులును నీతియుక్తములునగు సాధారణ జనజీవిత వర్ణనంబులును మనకుఁ గాన్పించుచున్నవి. కనుక జాతకకథాసముదయంబు వాఙ్మయచరిత్రవిషయములో మనల నాకర్షించుటయేకాక ప్రబోధకవిషయములకాశ్రయముగ నీయదియత్యధికప్రాముఖ్యమును వహించుచున్నది. పురాతనసంఘపరిస్థితులఁ దెలిసికొన నిచ్ఛగించు విద్వాంసునకీజాతకకథలత్యంతము నుపయుక్తములైయున్నవి. జాతకకథలవిష[illegible]మై మనము తెలిసికొనఁదగినవిషయములనిందుఁ బొందుపఱచుచున్నారము.

I. జాతక నైతికపుస్తకంబుగాథలను మాత్రమె కలిగియుండెను. ఉత్తరహిందూస్థానంబున మధ్యదేశంబున నీయదియశోకచక్రవర్తికిబూర్వమున వ్రాయఁబడినది.



2. మొదటినుండియు నీగాథలతోఁగూడ వాచికంబగువ్యాఖ్యానంబు కథలరూపంబునఁ జెప్పఁబడుచుండెడిదని దృఢముగఁ జెప్పవచ్చును. ఏలయన నీకథలవలనఁగాని లేకున్న నీగాథలు దురవగాహములై యుండును.

3. ఈకథలయందలి విషయములు చెక్కఁబడి క్రీస్తుజననమునకు మూఁడు శతాబ్దములకుఁ బూర్వముండిన ప్రతిచ్ఛాయలు కన్గొనఁబడినవి.

4. ఇప్పటిజాతకకథలు సూత్రకలకు వ్యాఖ్యానములుగాని వేఱొండుకావు. ఈయవి సింహళద్వీపంబున క్రీ॥ శ॥ 5 వ శతాబ్దములో నెవ్వనిచేతనో వ్రాయఁబడినవి. వీనికర్త యెవ్వఁడో మాత్రము మనకుఁ దెలియదు.

5. ఈకథలయందు సూచింపఁబడిన రాజకీయసాంఘిక పరిస్థితులు చాలవఱకు బుద్ధునికాలమునం దుత్తరహిందూస్థానమునం దుండిన పరిస్థితులని మనము నిశ్చయింపవచ్చును.

6. ప్రథమమున నీకథలు సమకూర్పఁబడినపుడయ్యవి యుత్తరహిందూదేశమునఁ బ్రజలు సామాన్యముగఁ జెప్పుకొనుచుండెడి కథలనుండియే తీసికొనఁబడినవి.

7. ఈకథలలో నతినవీనములని యనుకొనఁబడుచున్న కథలు కొన్ని క్రీస్తుజననమునకు మూఁడు శతాబ్దములకుఁ బూర్వమునుండిన ప్రతిచ్ఛాయలయందుఁ జెక్కఁబడి యున్నవి.

8. ఈజాతకకథాసంచయంబు భూతలంబున జనులు చెప్పుకొనెడి కథలసంబంధమైన వాఙ్మయములన్నిటిలోను బహు పురాతనంబును నత్యంతవిశ్వసనీయంబును సంపూర్ణంబైనదియును నై యున్నదని రిస్ డేవిడ్సు(Rhys Davids)దొరవారు వ్రాయుచున్నారు.

---

## ii

ఇరువదియైదు శతాబ్దములకుఁ బూర్వముండిన యార్థిక పరిస్థితులంగూర్చి మనము విమర్శించునపుడు, భారతవర్షంబున ప్రజలకు ముఖ్యజీవనోపాధిగఁ బరిగణింపఁబడుచున్న కర్షణమేరీతిగఁ జనులచే నవలంబింపఁబడుచుండెడిదో ప్రథమమున మనచేఁ దెలిసికొనఁదగు విషయము. బ్రాహ్మణధర్మసూత్రాదులలో బ్రాహ్మణక్షత్రియులకుఁ గర్షణంబాపద్ధర్మముగఁ జేర్కొనఁబడినది. పశుపాల్యము, కృషి, వాణిజ్యము మన్నగునవి వైశ్యవృత్తులుగఁ జెప్పఁబడినవి. బ్రాహ్మణులకు యాజనాధ్యాపన ప్రతిగ్రహంబులు వృత్తులుగఁ విధియింపఁబడినవి. అచటనచట జాతకకథలలోఁ గృషివాణిజ్యాదివృత్తులనవలంబించు బ్రాహ్మణులు పతితులుగఁ బరిగణింపఁబడుచుండెడి వారని జెప్పఁబడినది. కాని సామాన్యముగ జాతకకథలలోను, బౌద్ధసూత్రములలోను బ్రాహ్మణులు కృషీవలులుగను, పశుపాలురుగను, వ్యాధులుగను, రథకారులుగను, అహితుండికులుగను గన్పట్టుచున్నారు. బ్రాహ్మణ సిద్ధాంతప్రకారము బ్రాహ్మణవృత్తులుగఁ బరిగణింపఁ బడుచుండిన వృత్తుల నవలంబించు బ్రాహ్మణులు నిరసింపఁబడుచుండినటులఁ గాన్పించదు. క్షత్రియులును కృషీవలులుగ జాతకకథలలోఁ గాన్పించుచున్నారు. కునాలజాతకములో శాకీయకోలీయులలో భోజకామాత్యోపరాజులు క్షేత్రములకు నీరు పెట్టుటలో మొదటివంతుకై వివాదపడినటులఁ జెప్పఁబడినది.

జాతకకథలలో ననేకస్థలములందు భూస్వాములు సంఘ సంఘములుగ నివసించు గ్రామములు పేర్కొనఁబడినవి. ఇందుఘనంబులగు సంస్థానములుగాని, సామంతరాజులుగాని, సర్వస్వామ్యోపేత సంస్థానాధిపతులుగాని యసందిగ్ధముగఁ జేర్కొనఁ బడలేదని రిస్ డేవిడ్సుగారి సతీమణి యూహించుచున్నారు.

రాష్ట్రములో, షాష్ఠాంశంబగు కరముగ క్షేత్రముల



యందుఁ బండినపంటలలో ఆరవవంతుగాని ద్వాదశభాగముగాని రాజకరముగ భోజకునిచేతనో మహామాత్రునిచేతనో గృహీతంబై నతపాలుని ధాన్యకోష్ఠముల నుంచఁబడుచుండెడి వాడుక యుండెడిదని జాతకకథలవలనఁ దెలియవచ్చుచున్నది. రాజొకప్పుడు కరమును దనకనుగ్రహపాత్రుఁడైన వరునిపై విధియించకుండుటయు మఱియు నొక్కగ్రామమునుండిగాని యనేక గ్రామములనుండిగానివచ్చువన్నుల పుత్రికావివాహావసరంబునఁగాని, యమాత్యులకుఁగాని, బ్రాహ్మణాదులకుఁగాని దానమొసంగుచుండెడి యాచారములుండెడివని యీజాతకకథలవలనఁ దెలియవచ్చుచున్నది. ఇంతవఱకే నృపునకు క్షేత్రములపై స్వామ్యముండెడిదని యూహింపవచ్చును. సర్వపరిత్యక్తంబైన క్షేత్రమును భూపాలుఁడుఁ దనకిచ్చవచ్చినటులఁ జేయవచ్చును. ఎవ్వరైనను వారసులులేక మృతిఁజెందిన నట్టివానిభూములు భూపాలునకుఁ జెందుచుండెడివాడుక యుండినటుల నీకథలు నుడువుచున్నవి.

నరపాలురు తమప్రజలచే వెట్టిపనులను జేయించుకొనుచుండెడివారు. రాజొకఁడు మృగయాలోలుండై జనులను వేఁటయందు సహాయ్యముకొఱకుఁ గొంపోవుచుండుటచే, వారలకుఁ దమపనులలో నడ్డు కలుగుచుండెను. అట్టి యడ్డులేకుండుటకై ప్రజలందఱుఁ గూడి ప్రాకారపరిఖాదియుక్తంబగు వనము నొకదాని నిర్మించి దాని మృగపూరితముగఁ జేసిరని యొకకథ నుడువుచున్నది.

ఒక గ్రామవాసికి, తన క్షేత్రమును పరగ్రామవాసియగు నింకొకనికి దానవిక్రయములఁ గావింపుశక్తి యుండెడిదేమో మనము నిశ్చయింపఁజాలము. గాని మగధదేశంబున భూదానంబుచేయు నధికారమును, కోసలంబున భూవిక్రయంబుఁ గావించుయధికారము నాయాదేశపు ప్రజలకుండెడిదని స్పష్టమగుచున్నది. ఆపస్తంబాది ధర్మసూత్రములవలన ఫలభాగమునకై భూ

స్వామికి కృషీవలులకుఁ దనభూమినమ్ము యధికారమున్నట్లుఁ దెలియవచ్చుచున్నది.

జనసంఘములు నివసించు ప్రదేశములు గ్రామంబులనియు, నిగమంబులనియు, నగరకంబులనియు, నగరంబులనియు, మహానగరంబులనియు చెప్పఁబడుచుండెడివి. ఒకటిరెండు గృహములు మొదలుకొని యనేక సహస్రగృహంబులవఱకును, ఒకగ్రామ ముకలిగి యుండవచ్చును. నగరంబులయందైన ప్రాకారపరిఖాదులుఁగాని, రాజధానియందైన రాజప్రాసాదంబునుగాని గలిగియుండని జనాధివాసిత ప్రదేశంబునకు గ్రామంబనునది సామాన్యనామంబని మనమూహింపవచ్చును.

విదేహరాజొకఁడు తనరాజధానిని, సప్తయోజనములు పరిమితిఁగల మిథిలానగరంబును, షోడశసహస్ర గ్రామంబులను బరిత్యజించి సన్న్యసించినటుల నొకకథలోఁ జెప్పఁబడినది. ఇన్నిగ్రామములుగల రాష్ట్రమున నొక్కటియే నగరముండుటాతని మనమాశ్చర్యముఁజెందవచ్చును. కాని గ్రామంబునకును, నిగమనగరకనగరాదులకు నెట్టిభేదముండెడిదో మనమిప్పుడు నిర్ణయింపఁజాలము.

ధనవంతులు బానిసలచేఁ దమగార్హిక కార్యములం జేయించుకొనుచుండెడివారని జాతకకథలవలనఁ దెలియవచ్చుచున్నది. బానిసలను యజమానులు నిర్దయులై బాధపెట్టుచుండి నటులనీకథలయందుఁ జెప్పఁబడలేదు. మఱియు దయాళురగు యజమానులం తమబానిసలకు, లేఖన శిల్పాదుల నేర్చుకొనుటకు ననుజ్ఞనిచ్చుచుండెడివారని జాతకకథలు నుడువుచున్నవి. బానిసలకు యజమానులు దాస్యమోచనం బనుగ్రహించుటయు, బానిసలు ధనంబొసంగి బంధనమోక్షంబు సంపాదించుకొనుచుండుటయు నీకథలయందుఁ జెప్పఁబడినవి. భక్ష్యంబులనుగాని ధనవేతనంబులనుగాని యొసంగి



భృతకుల నియోగించు వాడుక యుండెడిదని యీకథలవలన స్పష్టమగుచున్నది.

లోహములతోఁ బనిచేయు కమ్మరవాండ్లును, దారుశిల్పులగు వడ్రంగులును, స్థపతులును, తచ్చకులును, భమరకారులును, జాతక కథలయందుఁ బేర్కొనఁబడుచున్నారు. వడ్రంగులు, సముద్రయానముఁ జేయునావలనుఁగూడ చేయుచుండెడివారని యీకథలు నుడువుచున్నవి. యానకారులు, రథకారులు, శకటకారులు, చర్మకారులు, చిత్రకారులు, మున్నగువారు, వివిధసంఘముల నేర్పరచుకొని సమతమవృత్తుల నభ్యసించుచుండెడివారు. అట్టి సంఘమునకు పాళీభాషలో 'శ్రేణి' యనిపేరు. శ్రేణియొక్క యధ్యక్షుని 'ప్రముఖుండ'ని చెప్పుచుండెడివారు. అట్టిప్రముఖునికి శ్రేణిపై నెట్టియధికారముండెడిదో మనకుఁదెలియదు. దంతములతోఁ బనిచేయువారు, వైణులు, ఆపూపకులు, నటులు, అహితుండికులు, గాయకులు, రత్నకారులు, మణికారులు, మాలాకారులు, కేశరచనం జేయువారలు, నాపితులు మున్నగువారలీకథలలోఁ బేర్కొనఁబడుచున్నారు.

జాతకకథలలోఁ దఱచుగ 'శెట్టి' యనుపదమును గనుచుందుము. ఈ శెట్టులు ధనికులుగను, వణిజులుగను కథలలోఁ జెప్పఁబడుచున్నారు. శెట్టియనువాఁడు నిశ్చయముగ నధికార పదస్థుఁడగువాఁడని పండితులూహించుచున్నారు. శెట్టులతో మహాశెట్టియు, ననుశెట్టియుఁగూడ పేర్కొనఁబడుచున్నారు.

వణిజులయొక్కగాని శిల్పులయొక్కగాని సంఘమునకు శ్రేణి యనిపేరు. ఇట్టి శ్రేణులసంఖ్యయనల్పమని దెలియనగును. మూగపక్ఖజాతకంబున, రాజత్యంత వైభవంబుతోఁ బ్రయాణోన్ముఖుండై చాతుర్వర్ణ్యంబుల నష్టాదశశ్రేణులసర్వబలంబుల నొక్కచోటున కేరావించెనని చెప్పంబడినది. ఈయష్టాదశశ్రేణుల నిపుడునిరూపించుట యసాధ్యంబైనను, శిలాశాసనాదులంబట్టి కొన్నింటిని మనము

దెలిసికొనంగలము. ఇచట నట్టి కొన్ని శ్రేణులయనుక్రమణికను బొందుపఱచుచున్నాము.

(1) రథకారులు.
(2) లోహకారులు.
(3) చర్మకారులు.
(4) చిత్రకారులు.
(5) మాలాకారులు.
(6) పశుపాలురు.
(7) నావికులు.
(8) కులాలులు.
(9) తంతువాయులు.
(10) వణిజులు.
(11) చనువలను రక్షించు భటులు.
(12) వైణవులు.
(13) చోరులు.
(14) కుశీదవృత్తినవలంబించువారు.
(15) వ్యాధులు.
(16) రంజకులు.

జాతకకథలవలన నింకొకటి దెలియవచ్చుచున్నది. వణిజుల శ్రేణులకును, శిల్పుల శ్రేణులకును భేదముండినటుల జాతకకథలవలన స్పష్టమగుచున్నది. వణిజులలో పారంపర్యాయముగ నొక్కొక్క జాతివస్తువులతో వ్యాపారాదులు సల్పుచుండినకులములు ముఖ్యాధిష్టితంబులైన శ్రేణులంగల్పించుకొను వాడుకయుండినను, తెఱచుగ నిట్టి శ్రేణులు సునిర్మితములైనటులఁ గాన్పించదు. శిల్పుల శ్రేణులు మాత్రము సునిర్మితంబులై యుండెడివి. శిల్పులలోఁ బుత్రుండు జనకునివృత్తిని లెస్సగ నభ్యసించుటకై సామాన్యముగ వానియొద్ద నేశిష్యుఁడై యుండి యాశిల్పమునందు శిక్షఁబొందుచుండెడివాఁడు. మఱియు భిన్నభిన్నవృత్తుల ననుసరించువారలు వేర్వేరు గ్రామముల యందుఁగాని, యొక్కపట్టణముననె వేర్వేఱువీథులయందుఁగాని నివసించుచుండినటులఁ దెలియవచ్చుచున్నది. వారాణసీ పట్టణమున కనతిదూరంబున సహస్రరథకార కుటుంబములు వసియించుచుండిన స్థపతులఁ పట్టణంబొకటి యుండెడిదని యొకజాతకకథలోఁ జెప్పఁబడినది. మఱియు నీరథకారులు రెండు సంఘములుగ నుండిరనియు నం దొక్కొక్క సంఘమున కొక్కొక్క ముఖ్యుఁడుండెననియుఁ జెప్పం బడినది. ఇంతియకాక యొక్కొక్క పట్టణంబుననె వివిధశిల్పముల



నవలంబించువారు వేర్వేఱువీథుల నివసించుచుండు వాడుకయుండె డిదని యాకథలవలన స్పష్టమగుచున్నది. దంతములతోఁ బనిచేయు వారివీథియు, రంజకులయొక్క వీథియు, తంతువాయులవీథియు, వైశ్యులవీథియు వారాణసీపట్టణమునందుండినటుల నీకథలలోఁ జెప్పం బడినది. మీఁదఁ జెప్పఁబడిన కథలో రథకారులు తమ పట్టణమును వదలి యొకద్వీపంబునకుం జని యచట నివాసములఁ గల్పించుకొని నటులఁ జెప్పఁబడినది. అందుచేనొక్క ప్రదేశమున నె సమానవృత్తిఁ గలవారలు భిన్నసంఘముల నేర్పఱచుకొను వాడుకయుండెడిదని స్పష్టమగుచున్నది. కొన్నిచోటుల సంఘప్రముఖుని పదవి కులక్రమా గతంబై యుండెడిదని తెలియనగును. శ్రేణిప్రముఖులున్నత రాజకీయోద్యోగములఁ జేయుచు నరపాలుర దయకుఁ బాత్రులై ధనసం పన్నులై యుండెడివారు.

ఆకాలమున వర్తకులు వాణిజ్యమునకై భూమిపైని, సముద్రముపైనిగూడ ప్రయాణముఁజేయుచు నతిదూరంబుననుండు దేశంబులకుం జనుచుండెడివారు. భూమిపై ప్రయాణము చేయువారికి ఘాతుకమృగచోర పిశాచములవల్లన భయంబుకలుగుచుండెడిదని జాతకకథలు నుడువుచున్నవి. ఒకప్పుడీవర్తకులు నిర్జలప్రదేశంబుల దాటవలసి వచ్చుచుండెడిది. వందలకొలఁది నరులొక్క యోడపై ప్రయాణము చేయుచుండినటులఁ గథలలోఁ జెప్పఁబడియుండుటచే నాకాలమున యానముల పరిమాణమధికంబై యుండెడిదని మన మూహింపవచ్చును.

ఆకాలమున వణిజులెట్టి పణ్యద్రవ్యములతో వ్యాపారమును జేయుచుండెడివారో జాతకకథలవలనఁ దెలియుచున్నది. మణులు బంగారము, కౌశికంబులు, సూక్ష్మవస్త్రంబులు, కవచంబులు, ఖడ్గా ద్యాయుధంబులు, కార్మికవస్త్రంబులు, చిత్రితవస్త్రంబులు, కంబళులు, గంధద్రవ్యంబులు, ఔషధంబులు, దంతము, దంతనిర్మిత

వస్తువులు, ఆభరణంబులు — ఇట్టి పణ్యద్రవ్యంబుల సేకరించుకొని వణిజులు దూరదేశంబులకుంజని వర్తకమును చేయుచుండెడివారు.

పట్టణములయందైన బజారులలో, అంబరములను, తైలములను గంధద్రవ్యములను, పుష్పములను, సువర్ణనిర్మితాభరణములను, ధాన్యంబుల నమ్ముచుండెడివారు. సురనమ్ముటకై పానాగారంబులుండినట్టులు జాతకకథలవలనఁ దెలియుచున్నది. వీధులమూలలయందును, చతుష్పథంబులయందును, స్థాపింపఁబడిన సూనంబులలో మాంసము నమ్ముచుండెడివారు. బాణశకటాదులు ఆపణంబుల నమ్మఁబడుచుండెడివి. కృపాణదాస మాంససురావిషంబులతో వర్తకము బౌద్ధమతావలంబకులకుఁ బ్రతిషేధింపఁబడినది.

క్రయవిక్రయముల ధనరూపముననె చేయుచుండెడివారని జాతకకథలవలనఁ దెలియవచ్చుచున్నది. సువర్ణముతోఁ జేయఁబడిన కహాపణంబులను, నిష్కలను, సువర్ణంబులను, పిత్తలతామ్రములతోఁ జేయఁబడిన కంసలను, పాదలను, మాసకంబులను, కాహణికల నీజాతకకథలు పేర్కొనుచుండుటచే నాకాలమున నిర్యుప్యవియే ముద్రలుగ నుపయోగింపఁబడుచుండెడివని మనమూహింపవచ్చును. ధనవంతులు తమధనమును పిత్తలనిర్మితాలంబరంబుల యందుంచి ద్వారకోష్ఠములయొద్దను, నదీతటములయొద్దను భూమిలోఁ బాతిపెట్టి రక్షించుకొనుచుండెడివారు. ధనికులు స్నేహితులయొద్ద నిక్షేపములనుంచుచు నట్టినిక్షేప పరిమాణవిధానముల బంగారుఫలకములపై జ్ఞాపకార్థము లిఖియింపించుచుండెడివారు.

ఇరువదిమూఁడు, నాల్గు, శతాబ్దములకుఁబూర్వము మనదేశమున నుండిన సాంఘికార్థిక పరిస్థితులంగూర్చి యిచట విపులముగ వ్రా



యుట సాధ్యంబుకాదు. చదువరులీ కథలనువిమర్శీలనముతోఁ బఠించినఁ బూర్వదేశౌన్నత్య ప్రబోధనవిషయములం దెలిసికొనంగలరు.

విజయనగరము<br>1-5-1926. } కిళాంబి రంగాచార్యుఁడు

ఈపుస్తకము వ్రాయుటలో నాకుసాహాయ్యమొనర్చిన నామిత్రులగు బ్ర॥ శ్రీ॥ అడిదము రామరావుగారికిని, బ్ర॥ శ్రీ॥ విద్వాన్ ఆకెళ్ల అరుణాచలశాస్త్రిగారికిని; బ్ర॥ శ్రీ విద్వాన్ జొన్నలగడ్డ సత్యనారాయణశాస్త్రిగారికిని వందనముల నర్పించుచున్నాఁడను.

గ్రంథకర్త.




## 1- అపన్న జాతకము.

మున్ను కాశీదేశమునందు వారాణసియను పట్టణమును బ్రహ్మదత్తుఁడను రాజు పాలించుచుండెను. ఆకాలమున వణిగ్వంశమునందు బోధిసత్త్వుఁడు జన్మించెను. అతఁడు యుక్తవయస్కుఁడై తూర్పునుండి పడమరకును, బడమరనుండి తూర్పునకును నేనూఱుబండ్లతోఁ బ్రయాణము సాగించి వాణిజ్యముఁ జేయుచుండెను. ఆకాలముననే వారాణసియందు బుద్ధిహీనుఁడును నిరుపాయుఁడునగు నింకొక తరుణవణిజుఁడుండెను,

మన కథారంభసమయమున బోధిసత్త్వుఁడు వారాణసీపట్టణమందలి బహుమూల్యవస్తుసంచయముల నేనూఱుబండ్లతో సేకరించుకొని ప్రయాణ సన్నాహముఁ గావించుచుండెను. మూఢుఁడగు వణిగ్యువకుఁడు నట్లొనరించెను. అంత బోధిసత్త్వుఁడు "ఈ బుద్ధిహీనుఁడైన వర్తకుఁడు నాతోఁగూడఁ బ్రయాణముఁ జేసిన మాయిరువర బండ్లను బాట సహింపనోపదు. పరివార జనంబులకు జలేంధనాదులుగాని, పశువులకు గ్రాసవాసంబులుగాని దుర్లభంబులగును. కాన మాలో నెవ్వరైన ముందటఁ బోవలయును" అని యాలోచించుకొని యా రెండవ వర్తకుని రావించి తన యుద్దేశము నాతనికిఁ దెలియఁబఱచి "ఓయీ! వర్తకా, మన మిరువర మొక్కసారి

ప్రయాణముఁ జేయఁజాలము. కాన నీవు తొలుతఁ బ్రయాణముఁ గావించెదవా, లేక నా వెనుకనే వచ్చెదవా?" అని యడిగెను. అడిగిన వాఁడిట్లు తనమనమునఁ జింతించెను. "నేను బ్రథమమునఁ బోయిన నాకు లాభము లెన్నియో గలుగును. బాటగతులు లేకయుండును. నా యెద్దులకుఁ బ్రశస్తమయిన గడ్డి యుండును. నా పరిజనమునకు శాక సమృద్ధి యుండును. నీరము లెల్లెడల నస్పృష్టములై నిర్మలముగ నుండును. నా సరకులకుఁగూడ నా యిచ్చవచ్చిన ధరలకమ్మఁగలను" అని యిట్లు చింతించి "నేనే ప్రథమమునఁ బయనము గావించెదను," అని ప్రత్యుత్తరమిచ్చెను. బోధిసత్త్వుఁడును దాను దరువాతఁ బోవుటలోనుండెడి లాభముల నిట్లు చింతించుకొనెను. "ప్రథమమునఁ బోవువారు బాటయందుండు నతోన్నతప్రదేశముల సమము చేయుదురు. నా పయనమునకట్టి బాట మిక్కిలి యనుకూలముగ నుండును. వారి పశువులు నీరంధ్రనీచఘాసఖాదనంబుఁ గావించును. నా వృషభంబులన్నో యాచోటియందలి నవీన తృణభక్షణంబుఁ గావించును. నా సేవకులు మొదట నరిగిన వారిచే నుద్ధృతములై మరలఁ బుట్టిన నవీనస్వాదుశాకంబులను భక్షించెదరు. నిర్జలంబులగు ప్రదేశములలో వారు ముందు త్రవ్వి యుంచుకొనిన కూపంబులనుండి నీరముల గ్రహించెదరు. క్రయ విక్రయకాలంబున నగు వివాద మత్యంత ఖేదజనితంబు. నేను వారి తరువాత బ్రయివారిచే నిర్ణయింపఁబడిన ధరలకు వస్తువిక్రయముఁ గావించెదను." అని యూరీతిం దలపోసి బోధిసత్త్వుఁడు రెండవవానితో "అయ్యా! నీవు ప్రథమమునఁ బొమ్ము. నేను నీ వెనుక వచ్చెదను," అని యనెను.

"ఆలాగుననే నేను బ్రథమమునఁ బోయెదను," అని మూఢుఁడు చెప్పెను. పిమ్మటఁ దన బండ్లకుఁ బశువులం బూన్చి ప్రయాణమై సాగిపోయెను. అట్లు పోయి పోయి యమానుషంబులగు నటవీప్రదేశంబులం జేరెను.



అడవులు చోరాక్రాంతములును, ఘాతుకమృగపూరితంబులును, పిశాచసేవితంబులును, నిర్ఝరంబులును, భక్ష్యరహితంబులును, ననినైదువిధములు. మొదటివానియందు దొంగలు మార్గనిరోధముం గావించెదరు. రెండవవానియందు సింహాదిఘాతుక మృగములు భయముఁ గలుగఁజేయుచుండు. మూడవవానియందు భూతములు పీడించును. నాల్గవవానియందు స్నానపానంబులకైన నుదకంబు దొరకదు. అయిదవవానియందుఁ గందమూలాదు లెవ్వియుఁ దొరకవు. అందీవణిజుఁడు చేరిన విపినంబుదకశూన్యంబును, పిశాచగ్రస్తంబునై యుండెను. కావున నా వణిగ్యువకుఁడు శకటములపై నుదకపూరితంబులగు కలశములనుంచి, షష్టక్రోశ పరిమితిగల యా కాంతారమార్గంబునఁ బ్రయాణముఁ గావించెను. విపినమధ్యంబుం జేరునప్పటికా భాగంబుననుండు పిశాచమొక్కటి యితనిం గాంచి "వీరిచే నీయుదకము పారఁబోయించిన దృష్ణాపీడితులై వీరు మూర్ఛితులగుదురు. అప్పుడు నా తృప్తి తీర వీరందఱ భక్షించెదను," అని యాలోచించుకొనెను. పిమ్మట నా భూతము తనమంత్రప్రజ్ఞచే ధవళవృషభద్వయములం బూన్చిన యొక రమ్యశకటమును సృజించెను. బాణతూణీరకరవాలఫలకయుక్తులగు నేకాదశ ... పరిచారకులు వెంటరా నా పిశాచరాజు నీలకమలధవళపద్మసగన్విత ... ంధరుఁడును, జలార్ద్రకేశవస్త్రుండును, బంకలిప్త రథచక్రుండునునై ప్రభువురీతిని వర్తకుని కెదురుగ వచ్చుచుండెను. వానిపరిచారకులును శ్యామాగవిందధవళకుముదమాలల శిరముల ధరించి, సిక్తకేశంబులతోడను, నార్ద్రవస్త్రంబులతోడను, నలినీగుచ్ఛముల హస్తములంబట్టి, ఖాద్యనాళంబుల భక్షించుచు, బురదనీరు కారుచున్న వస్త్రంబుల ధరియించి ముందుభాగమునఁ గొందఱును, వెనుకటి భాగమునఁ దక్కటివారును నా పిశాచరాజు ననుసరించి వచ్చుచుండిరి.

ప్రతివాతంబున రజోపపతనము లేకుండునటులఁ బరివారా

గ్రభాగంబునఁ బోవుటయు, ననుకూలమారుతంబున, బరివారపశ్చా ద్భాగంబునఁ బోవుటయు నను నాచారమొకటి చనుప నాయకుల లోఁ గలదు. ఆనాడు గాలి యెదురుగా వీచుచుండుటచేఁ బరిచారకులందఱు వర్తకుని వెంట వచ్చుచుండిరి. అదిచూచి పిశాచరాజు తన శకటమును బాటప్రక్క నిలువఁబెట్టి కపటప్రేమతో నావర్తకుంబిలిచి "మీరెచ్చటికేగుచున్నారు?" అనిప్రశ్నించెను. మార్గావరోధముగా కుండునటుల వర్తకుఁడును స్వశకటముల బాటప్రక్క నిలువఁబెట్టి యాపిశాచరాజుం గాంచి వానితో నీవిధముగ సంభాషించెను.

వర్తకుఁడు:—అయ్యా! మేమువారాణసీపట్టణమునుండి వచ్చుచున్నారము. కాని యరవిందకుముద ధారణపరిశోభిత హస్తమస్తకంబులను, నీరజనాళంబుల భక్షించుచున్న సేవకజనంబులను, బంకోదకప్రస్రవణదేహంబులను, గాంచుచున్నాఁడను. మీఁదిమార్గంబున వర్షపాతంబైనదా? లేక పంకజాకరంబులగు జలాశయంబులున్నవా?

పిశాచరాజు:—(ఆలకించి)ఆ, ఏమి నొడవితిరి? ఆకానిపించునదియే యతిపలాశవనరేఖ. అదిమొదలు కాంతారమంతయు జలోపేతము. అచ్చట నెప్పుడు నెల్లెడల వర్షము కురియుచునే యుండును. జలాశయంబులన్నియు జలపూరితంబులై యుండు. సరస్సులెల్లెడల నీరజశోభితంబులే. కాని, తామెచ్చటికేగుచున్నారు?

వర్తకుఁడు:—ఆయాచోటుల కేగుచున్నారము(అనిర్దిష్టవచనము)

పిశాచము:—ఈబండ్లయందుండు వస్తుజాతంబేమి?

వర్తకుఁడు:—ఆయావస్తువులు (అనిర్దిష్టవచనము)



పిశాచము:—మిక్కిలి భారముతో నీడ్వఁబడుచున్న యీశకటంబున నేమున్నది.

వర్తకుఁడు:—ఆబండియందా? నీరున్నది.

పిశాచము:—అయిన నద్దరినుండి నీటినిదీసుకొనివచ్చుటలో మంచిపనియే చేసితిరి. కానిముందు నీరుమిక్కుటముగనున్నది, కానని నీటియవసరమింక మీకుండదు. ఈకలశములను బగులఁగొట్టినీటినిఁ బారఁబోసి సుఖముగఁబ్రయాణముఁ గావింపుఁడు. ఇచట మీకుంగడు నాలస్యముఁ గావించితిని. త్వరగని[illegible]ఁబ్రయాణము సాగింపుఁడు.

ఈరీతిగ నాపిశాచరాజు వర్తకునకు బోధించి చూపుమేర దూరమువఱకును మార్గంబునఁబోయి పిమ్మట వెనుకకుఁదిరిగి తన పిశాచపట్టణముం జొచ్చెను.

మూఢుఁడగు నావణిజుఁడు పిశాచము చెప్పినచొప్పున నీటికడవలంబగులఁగొట్టించి పుడిసెడు నీరైనను లేకుండ [illegible]సిచిని నాలుకఁబోయించి బండ్లను సాగిపో నాజ్ఞాపించెను. అట్లువారు బయలుదేరి యెంతదవ్వరిగిన నొక్కబిందువైనను జలము కాన్పింపదయ్యెను. దప్పిమాత్రము వారిని మిగుల బాధించుచుండెను. అతికష్టముతో నట్లేవారు సూర్యాస్తమయమువఱకును బయనముగావించి బండ్లన్నిటిని నొకతావుననిల్పి వృషభంబుల నొక్కొక్క త్రాటితో శకటచక్రంబులకుంగట్టిరి. పశువులకుఁగాని మనుజులకుఁగాని త్రాగుటకును వండికొనుటకును జలంబులు లేకుండుటచే మిగుల డస్సియుండిరి. జలాభావంబుచే నన్నపానంబులు లేక వారందఱును దుఃఖించి సదనంబగునొక భూప్రదేశంబుననిద్రించిరి. వీరందఱును నిదురించినపిమ్మట నాత్మపరివారముతో నాపిశాచరాజువచ్చి వర్తకునిం బరివారమును, వృషభంబులను, జంపి భక్షించి యస్థిపంజరముల నటదిగవిడిచి తన

పట్టణంబునకుం బోయెను. మూర్ఖుఁడగు నావణిజ్యుఁడు సంఘమరణంబునకీతీరునఁ గారకుఁడయ్యెను. అన్నివైపులను బొమికలు వెదచల్లఁబడియుండెను, గాని బండ్లుమాత్రము చెక్కు చెదరలేదు.

ఈ మూఢవణిగ్యువకుఁడు బయలుదేరిన మాసార్థానంతరంబునఁ బంచశతశకటయుక్తుండై బోధిసత్త్వుఁడు ప్రయాణముం గావించి యచిరకాలంబునఁ గాంతారోపాంతంబును జేరెను. ఇచట నలింజరంబుల నుదకముతో నింపి పరివారజనంబును దననివేశస్థానంబునకు రమ్మనిచాటించి వచ్చినపిమ్మట వారలకిట్లు కట్టడచేసెను. "ఓ సేవకులారా, నామాటలేకుండ మీలో నెవ్వండును నుదకంబు నుపయోగింపరాదు. ఈవిపినంబున విషమయద్రుమంబులు పెక్కులుగలవు. కావ మీరీవఱకెన్నఁడును భుజింపని పర్ణపుష్పఫలంబెద్దానినైన నాయనుమతిలేక భక్షింపరాదు," అని వారికిట్లుపదేశించి కాంతారమార్గంబునఁ బంచశతశకట యుక్తుండై ప్రయాణముఁ గావించెను.

---

కాంతారమధ్యముం జేరువప్పటికిఁ దొల్లి మూఢవణిజునకుఁ బొడసూపిన పిశాచము బోధిసత్త్వునకు మార్గమునందుఁ గనుపడెను. బోధిసత్త్వుఁడు బుద్ధిమంతుండు గావున వానిని జూడగనే పిశాచమని తెలిసికొనఁగలిగెను. పిమ్మటఁ దనమనంబున నిట్లు చింతించెను. "ఈ విపినంబున నుదకంబులేదు. రక్తాక్షుండును నిర్లక్ష్య ప్రవర్తనుఁడును నైన యీ మనుజుని నీడ భూమిపైఁబడదు. వీఁడు నాకంటె మున్నువచ్చిన మూఢవణిగ్యువకునివంచించి, వాఁడు దెచ్చుకొనిన జలంబులం బారఁబోయించి, పరివారజనంబుతోఁగూడ నాతఁడు కృశించువఱకుఁ బొంచియుండి, వారలనందఱ భక్షించియుండనోపు. ఈవంచకుఁడట్టి దరినైన నాయూహాపోహలను, దెలివి తేటలను గుర్తెఱింగి.యుండఁడు" అని చింతించి యాపిశాచముతో నుచ్చైస్స్వరంబున నిట్లుమాట్లాడెను.



వంచకుఁడు:—పొమ్ము మేము వర్తకులము. మేమునీరున్న తావులం గాంచక పూర్వము మాయొద్దనున్న యుదకముం బారఁబోయము. జలంబులంగాంచిన పిమ్మట మాత్రమీ నీరములం బారఁబోసి శకటభారములేకుండఁజేసి కొందుము" అని చెప్పినతోడనే యాపిశాచము మాయవల్లఁక చూపుమేక దూరము నతిక్రమించువఱకును దోవవెంటఁబోయి పిమ్మటఁబిశాచపట్టణమునందలి తమయిరువునకుఁ బోయెను. పిశాచ గమనానంతరమునఁ బరిజనమును బోధిసత్త్వుఁడు నిట్లు మాట్లాడుకొనిరి.

పరిజనము:—ఆర్యా! ఆ కానిపించునది విపినహరిద్రాజిరునియు,నందెల్లప్పుడును వర్షము గురియుచుండుననియు, నాపోవుచున్న మనుజులవలన వింటిమి. అంతియకాక వారి శిరస్సులయందలి పద్మములును, హస్తములయందలి నీరజములును, వారు భుజించుచున్న పద్మనాళములును, వారి జలార్ద్రకేశవసనంబులును, వారు జలప్రదేశంబుల నతిక్రమించి వచ్చినట్టుగ్గ జూపట్టుచున్నది. మనము పోవు మార్గంబునం దనతిదూరంబున జలంబులుండుటకు సందియముండదు. కావున నీనీరములం బారఁబోసి, భారముఁ తగ్గించుకొని త్వరితముగఁ బ్రయాణముఁ గావింతము.

బోధిసత్త్వుఁడు:—అగుఁడు, వలను పడదు.

పరిజనము:—ఏలయట్లు సెలవిచ్చుచున్నారు?

బోధిసత్త్వుఁడు:—మీలో నెవరైన నీవఱకీ విపినంబున నుదకంబులున్నవని వింటిరా చెప్పుఁడు.?

పరిజనము:—ఆర్యా! వినియుండలేదు. ఇది నిర్జలవాలుకాప్రదేశమని మాకుఁ దెలియును. కాని యనతిదూరంబున నీవనరేఖ

యందు వర్షించుచున్నదని మనకుఁగొందఱిప్పుడే చెప్పి యుండిరి కాదా?

బోధి:—వర్షవాయువు లెంతదూరమువఱకు వీచును?

పరి:—ఆర్యా, ఒకక్రోసు దూరమువఱకును వీచును.

బోధి:—నీటిగాలి యెవ్వరికైనం దగిలినదా?

పరి:—ఆర్యా, తగులలేదు.

బోధి:—ఎంతదూరము వఱకు మేఘశిఖరము కనుపించును?

పరి:—ఆర్యా, ఒకక్రోసుదూరమువఱకును గనుపించును.

బోధి:—ఎవ్వరైన నట్టిజలదము నొక్కదానినైనం గాంచితిరా?

పరి:—ఆర్యా, లేదు.

బోధి:—విద్యుల్లేఖ నెవ్వరైనం జూచితిరా?

పరి:—ఆర్యా, చూడలేదు.

బోధి:—మనుజుఁడెంత దూరమునుండి ఘనధ్వనిని వినఁగలఁడు?

పరి:—ఆర్యా, రెండుమూడు క్రోసులనుండి వినఁగలఁడు.

బోధి:—ఈయెడ నెవ్వఁడైన మేఘగర్జితమును వినెనా?

పరి:—ఆర్యా, వినియుండలేదు.

బోధి:—వీరు పిశాచములుగాని మనుజులుకారు. వీరి దుర్వచనంబుల విని మనమీనీటిని పారఁబోసికొని పిపాసాబాధితులమైయున్నపుడు వారు తిరిగివచ్చి మనలను భక్షించెదరు. మన కంటెఁ బూర్వమీ మార్గమున వచ్చిన వర్తకుఁడు బుద్ధి



హీనుఁడు గాన నీపిశాచములచే వంచింపఁబడి, యున్ననీటిని ద్రిమ్మరించుకొని యాతఁడును, నతని పరిజనమును గృశీభూతులై గడుంగడు డస్సి పిశాచభక్ష్యంబులైయుండి యుందురు. వానిశకటంబులు ప్రయాణారంభసమయములో వలె నిప్పటికిని వస్తుపూరితములై యున్నటుల మనమూహింపవచ్చును. ఈదినముననే మనము వానింగన్గొనఁగలము. ఒక్కజలబిందువునైన వ్యర్థముసేయక సాధ్యమైనంత వేగముతో రండు, పోదము."

ఈతీరున నదనపరిజనమును బురికొల్పి వణిగ్వరుఁడు ప్రయాణము సాగించుచుఁబోయి పోయి తుదకుఁ దొల్లిటివలె భారాక్రాంతములైన బండ్లను, మనుజులయొక్కయు, వృషభములయొక్కయు, నస్థిపంజరములను గనుఁగొనెను. అచ్చోట నెద్దులను విప్పించి శకటంబుల వలయాకారంబుగ నిలువఁబెట్టెను. కాలాతిక్రమణము గాకుండగనే వృషభంబులకును, మనుజులకును, ఘాసాశనంబులఁబెట్టించి, మధ్యప్రదేశంబునఁబశువులను, చుట్టుపట్టుప్రదేశంబులఁ బరివారజనంబును, బరుండఁబెట్టి, తాను గదవాలంబుఁజేబూని నాయకులతోఁ గూడ జాగరూకతతో వానిని గాచుచుండెను. పిమ్మట ప్రాతఃకాలమునందుఁ బశువులకు ఘాసోదకంబులనిచ్చి కాల్యకృత్యములఁ దీర్చికొని దుర్బలబలీవర్దములకు బదులుగ బలమైనయెద్దులనుబూంచి సామాన్యవస్తువులను ద్యజించి విశేషవస్తువులనుండి మిక్కిలివిలువగలవానినిగ్రహించి, పయనముసాగించెను. పిమ్మట గమ్యస్థానంబునకుఁజేరి, మూఁడింతలు విలువగల వస్తువులకుఁ దనవస్తువులఁ బ్రతిపణించి తనసేవకులలో నొక్కనినైనఁగోల్పోక నిజనివాసంబునకుఁ జనుదెంచెను.



## — 2. వన్నుపథ జాతకము —

పూర్వకాలమున బ్రహ్మదత్తుఁడు కాశీదేశమందలి వారాణసిని బాలించుచుండినపుడు బోధిసత్త్వుఁడొక వణిజకుటుంబమున నవతరించెను. అతఁడు యుక్తవయస్కుఁడైనపిదపఁ బంచశతశకటంబులతో సరకుల సేకరించుకొని వర్తకముఁ జేయుచుండెను. ఒకపరి నాతఁడు షష్టియోజనపరిమితిగల నిర్జలసికతా ప్రదేశముఁ జేరెను. ఆ యిసుకఁ బిడికిటఁ బట్టినపుడు కరశాఖాంతరములనుండి జారునంత సన్నముగనుండెను. సూర్యోదయమైనదాది నామరుస్థల మంగారభస్మంబుపోలికఁ గాలుచుండుటచే నాసమయంబున నెవ్వరు దానిమీఁద నడచుటకు వీలుపడదయ్యె. అక్కతంబున నీప్రదేశముమీఁదుగఁ బయనము సేయువారు శకటములందు లో నింధనోదక తైలతండులాదులను వేసికొని రాత్రిసమయముననే ప్రయాణము సల్పుచుందురు. ప్రాతఃకాలమున శకటములను వలయాకారముగనుంచి వితానము క్రిందఁ గూరుచుండి దినమంతయుఁ గడుపుచుందురు. సూర్యాస్తమయంబైనతోడనే రాత్రిభోజనముఁ జేసి, భూమి చల్లఁబడినపిదప బండ్లుపూన్చుకొని, ప్రయాణము గావించుచుందురు. ఈసికతాతలంబునందలి ప్రయాణము సముద్రప్రయాణముం బోలియుండును. కర్ణధారుఁడు తన నక్షత్రజ్ఞానముచే జేసి యచ్చోట బండ్లను సమమైన మార్గమున నడుపుచుండును. ఈతీరుననే మనవర్తకుఁడు ప్రయాణముఁ గావించుచుండెను.

మనబండ్లింకను నేఁడు మైళ్లు వెళ్ళవలసియే యున్నది. అపుడీ వణిజుఁడు "ఈనాటిరాత్రితో నీయెడారిప్రయాణము ముగియును" అని యోచించి భోజనానంతరమున మిగిలిన యింధనోదకములఁ బారవేయించి బండ్లనుబూన్చి ప్రయాణము సాగించెను. మొదటిశకటమునందు శయ్యపైఁ గర్ణికుఁడు నక్షత్రంబుల వీక్షించి మార్గమును గను



పఱచుచుండెను. ఆకర్ణికునకుఁ జాలకాలమునుండియు నిద్రలేకుండుటం జేసి కడుడస్సి గాఢముగ నిదురఁజెందెను. ఆబండియెద్దులు వెనుకకుఁ దిరిగి యీవఱకుఁ దామువచ్చిన మార్గముననే పోవుచుండెను. ఆనాఁటిరాత్రియంతయు వృషభములీదారినే నడిచెను. ఉదయమవ ననే కర్ణికుఁడు మేల్కాంచి నక్షత్రస్థలంబుఁజూచి "బండ్లుమరలింపుఁడు" అని కేకలువేసెను. వారుబండ్లనుద్రిప్పి వరుసగానిలువఁబెట్టునప్పటికి సూర్యోదయంబయ్యెను. అప్పుడుబండ్లవాండ్రాచోటిని జూచి "అయ్యో! నిన్ననీచోటినుండియే మనముబయలుదేరితిమి. వంటచెఱకును, నీటిని, వ్యర్థపరచితిమి. ఇఁకనేమున్నది. మనయంతము సమీపించినది" అనివిలపించుచు నెద్దులనువిప్పి యుపరిభాగంబున వితానంబునమర్చి నిరాశాఖేదితులై యెవనిశకటంబుక్రింద వాఁడు నిదురించెను.

అంతబోధిసత్త్వుఁడిదిచూచి "ఇపుడు నేఁగాని నిరాశాగ్రస్తుండనైన వీరందఱును మృతిఁజెందుదురు" అని తనమనంబునఁ జింతించుకొనుచు, సూర్యరశ్మితీక్ష్ణంబుకాకమునుపు చల్లఁ[illegible]నటుఁదిరుగుచు, నొక్కచోఁ గుశ[illegible]యంబుఁగాంచి "ఈకుశసంచయంబు లోనజలముండుటచేఁ బుట్టినది" అని నిశ్చయించుకొని ఖనిత్రంబునొకదానిని దెప్పించి, యచ్చటనొక కూపంబుఁ ద్రవ్వనాజ్ఞాపించెను. అరువదిమూరల లోతువఱకుఁ ద్రవ్వఁ నటనొక బండ తాయి ఖనిత్రమునకుఁ దాకెను. దానితో నాత్రవ్వువారలకు నిరాశ జనియించెను. అపుడుబోధిసత్త్వుఁడు "ఈబాతిక్రింద నుదకముండక తప్పదు," అని నిశ్చయించుకొని యాగోతిలోనికిందిగి, యాశిలపై చెవియొగ్గివినెను. ఆశిలాంతర్భాగమున జలప్రవాహధ్వనివిని, వెలుపలికి వచ్చి, యొకసేవకబాలకునితో నిట్లనియెను. "ఓ బాలకా! నీవు నిరాశాపరుఁడవైన మేమందఱము నశింతుము. కాననీవు సోత్సాహుఁడవై ధైర్యముతో బిలములోనికేఁజని యీయయోమయ కాష్ఠంబున నీశిలావిదారణంబుఁ గావింపుము," అనిచెప్పినతోడనే యాబాల

కుఁడు తనతోడివారలందఱును నిరుత్సాహులై యుండుతరిని దాను మాంత్రికుఁ తనప్రభుని యాజ్ఞానుసారముగా బిలములోనికిఁ జని తన చేతిలోని యయఃకాష్ఠంబున నాఱాతిని మోదెను. తోడనే జలప్రవాహనిరోధముం గావించిన యాశిల వ్రక్కలై ప్రవాహము బయల్వడెను. బిలమంతయు నుదకముతోఁ దాళవృక్ష ప్రమాణముగ నిండెను. అందఱును స్నానపానంబులఁ గావించుకొనుచుండిరి. అప్పుడు వారవశిష్టాగ్రయుగాదులనుజీల్చి వంటకంబులఁ గావించుకొని భుజించిరి. పశువులనుగూడ ఘాసోదకంబులతోఁ దృప్తిపఱచిరి. పిమ్మట సూర్యాస్తమయసమయంబునఁ గూపసమీపభాగమునఁ బతాకంబొకటి నిలఁబొల్పి గమ్యస్థానంబునకుఁ బ్రయాణమైపోయిరి. అచట సమస్తవస్తువులను న్యాయమగు ధరలకన్న నాల్గింతల ధరలకు విక్రయించుకొనిరి. తమవస్తువిక్రయమువలన ధనమును సేకరించుకొని, నిజనివాసంబులకరిగి, జీవితకాలమంతయు సకలసుఖంబుల ననుభవించి తమతమ కర్మానుసారంబుగఁ బరలోకగతులైరి. బోధిసత్త్వుఁడును దానధర్మంబులఁ జేయుచుఁ గాలముఁ గడిపి నిజకర్మానుసారంబుగఁ బాపపుణ్యఫలానుభూతికై పరలోకంబుఁ జేరెను.



## 6, దేవధమ్మ జాతకము.



ఒకప్పుడు దేవదత్తుఁడు కాశీరాజ్యమందలి వారాణసిని బాలించుచుండెను. బోధిసత్త్వుఁడాదినములలోఁ బట్టమహిషిగర్భంబున జన్మించి, రాజపుత్రమహింశాసనుఁడు, అను నామమున బఱఁగుచుండెను. బాలుఁడై యటునిటుఁ బరుగులిడునప్పటికి రాజునకు ద్వితీయపుత్రుఁడు కల్గెను. రాజపుత్రిసోముఁడు, అను నామమును ధరించి యీతఁడిటునిటు పరుగులిడుచున్నప్పటికిఁ బట్టమహిషి



మరణించెను. పిమ్మట నారాజు తన మనసువచ్చిన యొకరాజపుత్రికను బెండ్లియాడెను. కొంత కాలమునకు వారియన్యోన్య ప్రేమ ఫలంబుగ నొకసుపుత్రుఁడు వారికిఁ గల్గెను. ఆకుమారునకు రాజు ఆదిత్యుఁడని నామకరణముఁ జేసెను. పుత్రజనన సంతోషాతిశయమున నాతఁడు తన భార్యకొక వరప్రదానముఁ గావించెను. ఆవరము తన పుత్రునకుఁ జెందియుండవలయునని నియమముఁ జేసెను. ఆమెయు నావరముఁ దనకుఁ గావలసినప్పుడీయవలయునని రాజును గోరెను. పిమ్మటఁ గొంతకాలమునకాదిత్యుఁడు యుక్తవయస్కుఁడయ్యెను. అప్పుడారాణి రాజుంజూచి "దేవా! పుత్రజననకాలంబునఁ బుత్రసంబంధమగు వరమొకదానిని నాకుఁ బ్రసాదించితిరి. దానిచే నాపుత్రునిపుడు రాజుగఁ జేయుఁడు," అనికోరెను. "అట్లు చేయఁజాలను. జాజ్వల్యమాన ప్రభాయుక్తులగు నిరువురు పుత్రులు నాకుఁ గలరు. కావున నీపుత్రునకు రాజ్యమీయఁజాలను" అని రాజుమారుపలికెను.

తనకోరికను రాజు ప్రత్యాఖ్యానమొనరించినను నరకుఁగొనక రాణి మాటిమాటికిఁ దనవరముఁ దనకిమ్మని రాజును బీడించుచుండెను. అదికని రాజు తనపుత్రులకామె దురాలోచనవలన హానికల్గునని భీతిల్లి వెంటనే వారలరావించి వారితోనిట్లనియెన్ను "పుత్రకులారా! ఆదిత్యుని జన్మసమయంబున నేనొకవరము నాతనికిచ్చెదనని చెప్పియుంటిని. ఇప్పుడాతనిజనని యదిమిషగాఁదీసికొని తన పుత్రునకు రాజ్యమపేక్షించుచున్నది. రాజ్యంబతనికిచ్చుట నాకిష్టము లేదు. స్త్రీలుసహజముగఁ గుటిలస్వభావలు. కావుననామె మీకేదైన నెగ్గుసేయ యత్నించును. అక్కతన మీరువనవాసము నెట్లో గడిపికొని సంప్రాప్తమయిన నాయనంతరము మానకులుంబమునకు ధర్మముగఁ జెందవలసినయీపురమును బాలించుటకు మీరుమరల రావలయును." అని చెప్పుచు బాష్పపూరితలోచనుఁడై పుత్రులం జేరఁదీసి మూర్ధంబుల నాఘ్రాణించి కాంతారవాసంబునకుఁ బంపుకొల్పెను.

రాజకుమారులిరువును జనకుని యానతిని శిరంబునఁ దాల్చి

వనంబునకుఁ బోవుచుండ, రాజమందిర ప్రాంగణమునఁ గ్రీడించుచున్న యాదిత్యుఁడు వారిం బొడఁగాంచెను. పిమ్మట నాదిత్యుఁడు వారివలన జరిగిన వృత్తాంతమంతయుఁ దెలిసికొని వారితోఁ గూడఁ దానును వనవాసంబునకుఁ బయనంబాయెను.

ఆతీరున వారుముగ్గురును జనిచని హిమాలయప్రాంతకాంతారములఁ జేరిరి. అట బోధిసత్త్వుఁడు మార్గముప్రక్కనున్న వృక్షమూలంబునఁ గూరుచుండి యాదిత్యునితో "వత్సా! ఆదిత్యా, ఆ కానుపించు పల్వలంబునకుం జని తజ్జలంబుల స్నానపానంబుఁ గావించి మాకుఁ గూడ నీరజపత్రపుటంబులతోఁ బానీయముం దెమ్ము" అని చెప్పెను. కుబేరుఁడా మడుగునొక యుదకభూతంబునకిచ్చుచు "ఈమడుగునఁ బ్రవేశించువారిలో దైవసన్నిభమగు దాని నెఱుంగువారిం దక్కఁ దక్కటివారి నెల్ల నీవు భక్షింపవచ్చును. ఉదకమందుఁ బ్రవేశింపనివారిపై నీ కధికారములేదు," అని చెప్పెను. అప్పటినుండియు నాయుదకపిశాచమా మడుగునఁ బ్రవేశించిన వారి నెల్ల దైవసదృశమైనదానిఁ గూర్చి ప్రశ్నించుచు నట్టిజ్ఞానములేనివారలనుబట్టి భక్షించుచుండెను.

ఆదిత్యుఁడు భ్రాత్రాజ్ఞానుసారముగా నామడుగునకుంబోయి నిర్భయముగ నాయుదకమునఁ బ్రవేశించెను. అంతజలభూతమాతనింబట్టికొని "నిశ్చయముగ దైవసమానమగు దాని నీ వెఱుంగుదువా?" అని ప్రశ్నించెను. "ఆ, నాకుఁ దెలియును. సూర్యుండును జంద్రుండును నట్టివారే," అని యాదిత్యుఁడు ప్రత్యుత్తరమొసఁగెను. "అయినచో నీకుఁ దెలియదు" అని చెప్పుచు నాపిశాచమాతని నీటిలోనికి లాగుకొనిపోయి జలాశయాధోభాగమందలి నిజనివాసస్థానమున బంధించెను.

బోధిసత్త్వుఁడు తనసోదరుండింత సేపేల తడసెనో యని చింతిం



చి సోముని నాచోటికంపెను. అతనింగూడ నాదయ్యము పట్టుకొని పైప్రశ్నమునే వేసెను. దానికా సోముఁడు "ఆహా! నాకుఁ దెలియును. చతుర్దిగ్భాగములును దైవసమములై యున్నవి" అని చెప్పెను. "నీ కేమియుం దెలియదు" అని చెప్పుచు నీతనింగూడఁ గారాగారమునకుం గొంపోయెను.

రెండవవాఁడును రాకుండుటఁ జూచి వారలకేదియో కీడుమూడినదని యెంచి బోధిసత్త్వుఁడుగూడ వారియడుగులజాడ ననుసరించి యాజలాశయముకడ కేగెను. వెంటనే యాపల్వలము పిశాచగ్రస్తంబని గ్రహించి బాణంబుఁ గేలఁగీలించి ఖడ్గంబును సిద్ధముగనుంచుకొని యాసరోవరతటంబున నిరీక్షించుచుండెను. బోధిసత్త్వునకు జలంబులఁ బ్రవేశించుటయం దిష్టములేదని తెలిసికొని యాభూతమాటవికరూపముతో వచ్చి యాతనితో నిట్లు సంభాషించెను.

భూతము:—మిత్రమా, మార్గాయాసంబున నీవు కడుంగడుఁ బడలితివి. నీవీపల్వలంబున స్నానపానంబుల నొనరించి బడలిక నేల బాపికొనవు? ఈకలువలచే దేహతాపంబు వాయించుకొనవేమి? అట్లొనరించినచో నీకమీఁది ప్రయాణము సౌఖ్యముగఁ జేయఁగల్గుదువు

బోధి:—నాసోదరుల నీవే పట్టుకొని యుందువు

భూత:—అగును, నేనే పట్టుకొంటిని

బోధి:—ఎందులకు?

భూత:— ఈమడుగునఁ జొచ్చినవారందఱు నాయధీనము.

బోధి:—ఏమీ! అందఱును నీయధీనమా?

భూత:—దైవసన్నిభమగు దాని నెఱుంగువారు తప్పఁ దక్కినవారందఱు నాయధీనమయి యుందురు

బోధి:—నీకట్టి జ్ఞానమును సంపాదింపవలయునను కుతూహలము కలదా?

భూతము:—నిక్కముగా నాకట్టి కుతూహలమున్నది.

బోధి:—అటులైన నేఁ జెప్పెదను.

భూతము:—చెప్పుము. సావధానముగ నాలకించెదను.

బోధి:—చెప్పవలయునని యున్నది. కాని మార్గాయాసము మిగుల నన్ను బాధించుచున్నది.

అదివిని యాదయ్యము బోధిసత్త్వునకు మజ్జనముఁ గావించి యన్నపానంబుల నొసంగి, పద్మంబులచే నాతని దేహమలంకరించి, సుగంధసేచనముఁ గావించి, ఘనంబగు పటమంటపమ్మున శయ్యనమర్చి యాతని కొసంగెను. ఆతఁడాశయ్యయందు విశ్రమించి తనపాదములయొద్ద గూరుచుండియున్న పిశాచముతో నిట్లు సంభాషించెను.

బోధి:—ఓయీ, జాగరూకతతో వినుము. నీవడిగిన ప్రశ్నమునకు సమాధానముఁ జెప్పెదను.

భూతము.—ఓ సుజ్ఞానీ, నీవలన మిగుల సంతసించితిని. నీసోదరులలో నొక్కనినీకిచ్చెదను. అందునీకెవ్వఁడు కావలయునో చెప్పుము.

బోధి:—చిన్నవానిని నాకిమ్ము.

భూతము:—ఓజ్ఞానీ, నీకు దైవసమానమగు దాని జ్ఞానమున్నను, నీజ్ఞానము నాచరణలోఁ బెట్టవేల?

బోధి:—ఎట్లు,

భూతము:—జ్యేష్ఠుని జ్యేష్ఠత్వము నిరాకరించి పెద్దవాఁడుండఁగఁ జి వానిని గోరికొనుట యుచితమా?



బోధిసత్త్వుఁడు:—భూతమా! నాకజ్ఞానమే కాక తజ్ఞానానుసారియగు నాచరణముకూడనున్నది. ఈ బాలునివలననే మేమరణ్యంబున సుఖముగ నుండవచ్చితిమి. ఈ బాలునికొఱకే పినజనని మాజనకుని రాజ్యముఁ గోరినది దానికియ్యకొనక మాతండ్రి మేమరణ్యవాసము సేయుటకంగీకరించెను. బాలుండగు నీతఁడు మమ్ములననుసరించివచ్చి మరల గృహోన్ముఖుఁడు కానొల్లక మాతోఁ గూడ నున్నవాఁడు. అడవియందీ బాలుఁడు పిశాచభక్షితుఁడయ్యెనని చెప్పినచో నామాట నెవ్వరు విశ్వసింపరు. లోకాపవాదభీరుత్వమతనిం గోరునట్లు చేయుచున్నది.

భూతము:—ఆహా, ఏమి యాశ్చర్యము. ఓసుజ్ఞానీ! నీకుజ్ఞానమే కాక యాచరణకూడనున్నది.

అని చెప్పుచు నాపిశాచము సంతోషాతిశయంబున నాతనిసోదరుల నిరువుర నాసరస్సునుండి తీసికొనివచ్చి బోధిసత్త్వునకు సమర్పించెను.

అప్పుడు బోధిసత్త్వుఁడు దయ్యమునుజూచి "మిత్రమా! పూర్వకృతదుష్కృతంబువలనఁ బ్రాణులను భక్షించు దయ్యమవై బ్రతుకుచున్నాఁడవు. ఈజన్మంబున సైతము పాపంబులఁ గావించుచున్నాఁడవు. ఈదుష్టకృత్యము నీకెన్నఁడును ముక్తిఁగలుగనీయక నరకవాసమును, దదితరక్షుద్రజన్మలనుగలుగఁజేయును. కావుననిప్పటినుండియు నీవు దుర్మార్గమును ద్యజించి సన్మార్గవర్తివై మనుము" అని చెప్పెను.

ఇత్తెఱంగునఁ బిశాచమునకు జ్ఞానబోధనముఁ గావించి బోధిసత్త్వుఁడు పిశాచసంరక్షితుఁడై యచ్చోట నేకొంతకాలముండెను. పిమ్మట నక్షత్రగణనమువలనఁ దండ్రిమృతి నెఱిఁగి యాపిశాచము తోడను సో,

దరులతోడను, నిజరాజ్యమున కేగి పట్టాభిషిక్తుఁడయ్యెను. బోధిసత్త్వుఁడు రాజ్యమును స్వీకరించి, సోదరుఁడగు సోముని రాజప్రతినిధిగను, సాపత్నీసోదరుఁడగు నాదిత్యుని సేనానాయకునిగను జేసి ధర్మయుక్తముఁగ రాజ్యమును బాలించుచుండెను. పిశాచమునకు రమ్యంపు పడిది నొకదానినొసంగి, పుష్పమాలలయందును, భోజనమునందును నెట్టిలోపము నాతనికిఁ గల్గకుండఁ జూడవలయునని పరిజనమునకుఁ గట్టడిఁ జేసెను. బోధిసత్త్వుఁడు ధర్మయుక్తముగఁ జిరకాలము రాజ్యమును బాలించి పిమ్మట జీవన్ముక్తుఁడయ్యెను.

## — 9, మఖాదేవుని తెల్లవెండ్రుకలు. —

పూర్వము విదేహదేశంబున మిథిలానగరమునందు ధార్మికుండగు రాజు మఖాదేవనాముఁడు ధర్మమునఁ బ్రజలఁ బరిపాలించుచుండెను. ఎనుబదినాల్గువేల సంవత్సరముల చొప్పున నాతఁడు రాజకుమారుఁడుగను, ఉపరాజుగను, రాజుగను, సగలసుఖముల ననుభవించెను. బహువత్సరంబు లిటుల జీవించి, యొకనాఁడు నాపితునితో "మిత్త్రుఁడా! నాశిరమునఁ దెల్లవెండ్రుకలు గన్పడిన నాతోఁ జెప్పుము" అనియెను. అనేకసంవత్సరములయిన పిదప నామంగలియు నొకనాఁడు నీలకేశకలాపంబున ధవళకేశం బొక్కండు గనుంగొని రాజుతోఁ జెప్పెను. పార్థివుఁడు "దానినుల్లూరనంబు గావించి నాహస్తంబున నిడుము" అని యాజ్ఞాపించెను. నాపితుండును గనకకంకముఖంబున దానిఁదీసి రాజహస్తంబునఁ బెట్టెను. పార్థివునకప్పటికెనుబదినాల్గువేలసంవత్సరములయాయుఃప్రమాణముండినప్పటికి నాధవళకేశదర్శనంబున నాతఁడత్యధికవిచారయుక్తుండయ్యెను. యమరాజాతనిపై నధిష్ఠించినటులను, జాజ్వల్యమానంబగు పర్ణశాలయందు నిరోధింపఁబడిన[illegible]. నాతఁడు మనోవిర



మొందుచుండెను. "మూఢుఁడా! మఖాదేవా! ధవళశిరోజములు పుట్టినప్పటికిని నీమర్త్యత్త్వుల విడనాడినాఁడవు కావుగదా?" అని విలపించుచుఁ దద్ధవళకేశజననంబుఁ గూర్చి విచారించుచు నంతరంగమునఁ బరితపించుచుండెను. దేహమంతయు ముచ్చెమటలు గ్రమ్మెను. వసనంబులు దుర్భరంబులయ్యెను. "ఏతద్దినంబుననే నేను సంసారపరిత్యాగంబుఁ గావించి పరివ్రాజకుఁడను గావలయును" అని నిశ్చయించుకొనెను.

నాపితునకు లక్షధనమువచ్చునట్టి యొకగ్రామ మొసంగెను. జ్యేష్ఠపుత్త్రుని రావించి వానితో నిట్లనుడివెను: "పుత్త్రకా! ధవళకేశంబులంకురించినవి. వార్ధకదశయు వాటిల్లెను. మానుషసుఖంబున సంతృప్తుఁడనైతిని. దైవికానందములఁ జవిఁజూడ నిచ్చపుట్టినది. నాసంసారపరిత్యాగమునకుఁ గాలమాసన్నమైనది. సామ్రాజ్యభరంబును నీపైఁ బెట్టుకొనుము. నేనన్నో మఖాదేవామ్రనికుంజంబను పేరువడసిన యారామంబున నివాసంబుఁ గల్పించుకొని పరివ్రాజకుండనై కాలముంగడపెదను.

అటులఁ బరివ్రాజకుండగుటకుఁ గృతనిశ్చయుండైన యారాజును సమీపించి యమాత్యులు "ప్రభో! యెందులకు మీరు తృతీయాశ్రమ స్వీకరణంబుఁ గావించుటకు నిశ్చయించితిరి?" అని యడిగిరి.

రాజు ధవళకేశంబును హస్తంబునఁ జూపి యిట్లు చెప్పందొడంగెను. "నాశిరముపైఁ గనఁబడు నీధవళకేశములు జీవంబపహరింపవచ్చిన మృత్యుకింకరులు. సంసారవిముఖుండనై పరివ్రాజకాశ్రమంబున మోక్షదాయకంబగు శాంతి నన్వేషించుటకుఁ గాలంబాసన్నమయినది," అని యిటులు చెప్పి యాదినముననే సామ్రాజ్యచిహ్నముల విడనాడి పరివ్రాజకుఁడయ్యెను. మఖాదేవామ్రనికుంజంబున వసించుచు నెనుబదినాల్గువేల సంవత్సరంబులు చతుర్గుణసిద్ధ

సితులను బరిపాలించుచుం దదనంతరంబున బ్రహ్మలోకంబునం బున
ర్జన్మంబు నొందెను. అటుపిమ్మట మిథిలాదేశంబున నిమిరాజై జనకుం
గాంచి యాదేశంబునకు రాజై, బహ్వాగతబంధుసంయోజనం
బుం గావించి యాయామ్రని కుంజంబునని వానప్రస్థుండై కొంతకా
లముం గడపి తుదకు బ్రహ్మలోకవాసమునకుం జనెను.

## — 12. నిగ్రోధమిగ జాతకము. —

బ్రహ్మదత్తుండు వారాణసిని పాలించు సమయమున బోధిసత్త్వుం
డు మృగమై జనించెను. జననకాలమున వాని దేహచ్ఛా
య కనకప్రభం బోలియుండెను. నేత్రంబులు పలమూకార
వజ్రంబులో యనునట్లుండెను. శృంగముల తేజంబు రజత
కాంతింబురుడించును. నోరరుణవస్త్రస్తబకంబు భాతినుండెను. కా
వినాల్గుడెక్కలును లక్కరంగు వేయంబడినట్లుండెను. లాంగూల
ము చమరీవాలంబు భాతినుండెను. వానిస్వరూపంబు ఘోటకశా
బకంబు పగిదినుండెను. బోధిసత్త్వుండెల్లప్పుడు నేనూఱుమృగంబులచే
సేవింపంబడుచుం గాంతారంబున 'వటమృగరాజు' అను నామంబు
న జీవించుచుండెను. వానికనతిదూరంబునం బంచశతపరివార యు
క్తమై యింకొక లేడి బోధిసత్త్వునితో సమముగ బంగారుచాయంగల్గి
'శాఖమృగంబు' అను నామంబునం బరంగుచుండెను.

అయ్యవసరంబున వారాణసీ పరిపాలకుండగు బ్రహ్మదత్తుండు
మృగయాలోలుండును, మాంసప్రియుండునునై ప్రతిదినంబునను
భోజనంబున మాంసమును భక్షించుచుండెను. ప్రతిదినంబున నా
తండు జానపదులను పురజనులను వారివారిపనులమాన్పి మృగయా
రతమై తనతోంగూడం గొంపోవుచుండెను. తమపనులన్నియుం జెడి
పోవుటచే జనులందఱు నేకీభవించి యిట్లుచింతించిరి.



"రాజు ప్రతిదినంబునను మనలం దనవెంటం గొంపోవుచు న
స్మత్కార్యవిఘాతంబుం గావించుచున్నాఁడు. కావున మనమందఱ
ముం గలిసి యతని యుపవనంబున మృగంబుల కనువగు ఘాసోద
కంబులం గల్పించి లేళ్ళనెల్లనా యారామంబు లోనికిం దఱిమి ద్వారము
బంధించి రాజునకు నర్పింతము. అట్లొనరించిన నారాజు తనతోరమ్మ
ని మనల నిరోధింపఁడు," అని చింతించుచు నాయాగామంబున ఘాసో
దకములం గల్పించి ద్వారంబుల లెస్సంగ దెఱచియుంచిరి. పదపడి వా
రందఱును గాష్టఖడ్గబాణాద్యాయుధ సాధనంబుల ధరియించి మృ
గాన్వేషణంబునకై కాంతారంబునకు బయల్వెడలిరి. వారట్లుకోసు
దూరము వఱకు నేగి వలయాకారముగం జుట్టుకొని లేళ్లంగుమి గూర్చి
చూడిరి. ఆమృగసంఘంబున వటమృగము శాఖమృగముంగూడం
జిక్కుకొనియుండెను. అంత వారామృగములం జూచి తుప్పలు చెట్లు
మున్నగువానిపైం గఱ్ఱలతోం గొట్టి బెదిరించి వానివాని నివాసంబుల
నుండి తఱిమిరి. అట్లు వానిందఱిమి యాయారామంబునం బ్రవేశపె
ట్టి కవాటంబులం బంధించిరి. పిమ్మట వారందఱు రాజునొద్దకేగి
"దేవా! తామెల్లప్పుడు మమ్ములంగూడ వేటకుం గొంపోవుచుండెడి
వారు. అక్కతంబున మా కార్యములకు భంగము వాటిల్లెడిది. అది
చూచి మేమెల్లరము బయలుదేరి మృగములందఱిమి తెచ్చి మీయుప
వనంబున నుంచితిమి. ఇటుపిమ్మటం దామెల్లవేళలం దమభోజనము
నందా మృగములను యథేచ్ఛగ నుపయోగించుకొనవచ్చును," అని
మనవిం జేసిరి.

ఒకనాఁడు రాజు తన యుపవనమునకుం జని మృగసమూహంబునం
దు రెండు కనకవర్ణ మృగములుండుటం గాంచి వానిని మాత్రము ర
క్షింపవలయునని నిశ్చయించుకొని వానికభయమిచ్చి మరలగృహో
న్ముఖుండయ్యెను. రాజు తనకు మృగములు వలయునపుడెల్లం దానుబో
యి వానిం దెచ్చుకొనుచుండును. ఒక్కొక్కపరి వంటవానిం బంపి తె
ప్పించును. వీరిలో నెవ్వరైన వానిం జంపంబోవునపుడు వీరికేలం బాణ

ముందిలక్షించి ప్రాణభయశంకచే నటునిటునావనంబునం బర్వులిడుచుండును. రెండుమూఁడు గాయములు తగిలినపిమ్మట మాత్రమలసి మూర్ఛిల్లి వారలచే హతము లగుచుండును.

ఇట్లుండ నొకనాఁడు మృగయూథము వటమృగంబు (బోధిసత్త్వుని) కడకేగి తమబన్నములఁ బాపవలయునని వేడికొనియెను. అప్పుడా వటమృగము రెండవయూథమునకు నాయకుండగు శాఖమృగమునకుఁ గబురిడి రప్పించి యాతనితో "మిత్రమా! బహుసంఖ్యాకంబులగు మృగంబులు హతములగుచున్నవి. వీనిని మరణమునుండి మన ముద్ధరింపలేకున్నను గాయములు తగులకుండఁ జేసినను బాగుగ నుండును. కావున మనయూథములనుండి దినమున కొకమృగము చొప్పున రాజునాహారమునకుఁ బంపునేర్పాటుఁ గావించుకొందము. ఒకదినమున నా యూథమునుండి యొకటియు మఱునాఁడు నీయూథమునుండి యింకొకటియుఁ బోయి ధర్మగంధికము మీఁదఁ గంఠము నుంచిన దక్కుంగల మృగములన్నియు గాయములనుండి విముక్తములగును" అనిచెప్పెను. అందులకా శాఖమృగమియ్యకొనెను. అంతనుండియుఁ బ్రతిదినంబున నొకలేడి తమనిర్ణయముచొప్పునఁ బోయి ధర్మగంధికముపై మెడనుంచినఁ బాచకుండువచ్చి దానిం గొంపోవుచుండెడివాఁడు.

ఈ నిర్ణయము చొప్పున శాఖమృగముయొక్క మందలోని యంతర్వత్నియగు నాడులేడి యొకటి వధ్యస్థానమునకుం బోవలసివచ్చెను. అప్పుడది తన యేలికయగు శాఖమృగము కడకేగి "దేవా! ఇప్పుడు నేను గర్భవతిని. ప్రసవమయినపిదప వంతుఁదీర్చుకొనుట కిదుపురముందుము. కావున నిప్పుడు నన్నుఁ దప్పింపఁ బ్రార్థించుచున్నాను" అనివిన్నవించెను. అదివిని యాతఁడు "నీవంతు నింకొకరికీయను. నీయదృష్టమెట్లున్న నట్లుకాఁగలదు. పొమ్ము" అనికసరిపోసెను. అంతటితో నిరాశఁజెందక యాలేడి బోధిసత్త్వుని కడకేగెను. అతఁడా వృత్తాంతమంతయువిని "సరియే నీవుపొమ్ము. నిన్నిప్పుడు



నీవంతునుండి తప్పించితిని," అనిచెప్పి దానిం బంపి బోధిసత్త్వుఁడేపోయి ధర్మగంధికముపై మెడనుంచెను. అంతఁ బాచకుఁడువచ్చి దానింగని "అభయదానమందిన హరిణమిచ్చటనున్నదేమి? దీనియుద్దేశమేమియై యుండును?" అనియనుకొనుచుఁ ద్వరితముగఁ బోయి రాజుతో నీయంశము విన్నవించెను. తోడనే రాజు రథాధిరోహణముఁ గావించి పరిజనపరివృతుఁడై యాచోటికేగి దానితో నిట్లు సంభాషించెను.

రాజు:- మిత్రుఁడా! హరిణరాజా! నీకు నేనభయంబీయలేదా? నీవేల నీవధ్యస్థానమున నుంటివి?

వటమృగము:- రాజచూడామణీ! నాదగ్గరకిపుడు గర్భవతియగు హరిణియొకతెవచ్చి ప్రసవమగువఱకుఁ దన్నుఁ దప్పింపవలయునని కోరినది. ఈదుస్థితి ననుభవింప నింకొకరిని బంపఁజాలక నేనే యనుభవించుటకు నిశ్చయించుకొని యిటువచ్చియుంటిని. దీననేమియు నింతకు మిక్కిలియగు నభిప్రాయము లేదు.

రాజు:- కనకహరిణ రాజమా! మనుజులలో సైతము నేనిన్నడిట్టి దయాళువుం గాంచియుండలేదు. నీవలన నేన్నమిగులఁ బ్రీతుండనైతిని. లెమ్ము మీయిరువుర జీవములం గాపాడెదను.

వటమృగము:- రాజా! మేమిరువురమును రక్షితులమైనఁ దక్కుంగల మావారలెల్లరు నేమికావలయును?

రాజు:- వారినిసైతము రక్షించెదను.

వటమృగము:- దేవా! నీయారామమందలి లేళ్లకు భయములేకున మిగిలినవానిగతి యేమి?

రాజు:- వానినిగూడ రక్షించెదను.

వటమృగము:- దేవరదయవలన హరిణంబులు మరణములేక యున్నఁ
బక్కన చతుష్పాదజంతువుల తెన్నేమి కావలయును?

రాజు:- అవిమాత్రము రక్షింపఁబడకుండునా?

వటమృగము:- రాజా! అండజములుమాత్రము రక్షింపఁబడవలదా?

రాజు:- అవియును రక్షింపఁబడును.

వటమృగము:- రాజా! అట్లైనచో విహంగరక్షణమగును. కాని జలచరంబులగు మత్స్యంబుల గతియేమి?

రాజు:- వానింగూడ రక్షించెదను.

వటమృగము:- రాజపుంగవా! ఋజుమార్గానువర్తివై యుండుము. గృహస్థులనుగూర్చియు, బాలబాలికలనుగూర్చియు, జానపదులనుగూర్చియు, నగరవాసులంగూర్చియు, దాక్ష్యమవలంబింపక సత్యపథమును, న్యాయమార్గమును, నవలంబింపుము. అట్లైనచో నీవు పారలౌకిక సౌఖ్యంబుల నిరపాయంబుగ ననుభవింపఁగలవు.

ఇట్లు వటమృగము రాజువలన నేజంతువునకును నపాయము లేకుండునట్లు వరమువడసిన పిమ్మట నాయఁడులేడి పద్మకుట్మలంబువంటిది రామణీయకమగు నొకశిశువునుగనెను. అశిశువు శాఖమృగంబుతోఁదిరుగుచు నాడుకొనుచుండెను. అదిచూచి దానితల్లి "బిడ్డా! వానితోనీవు సాంగత్యముఁ గావింపకుము," అనిచెప్పెను.

వటమృగము రాజవలన వరముఁబొందినప్పటినుండియును లేళ్ళన్నియు నిర్భయముగ సస్యములనెల్ల భక్షింపుచుండెను. రాజు



లేళ్ళకభయమిచ్చియుండుటచే జనులు వానిని గొట్టుటకుఁగాని తఱిమివేయుటకుఁగాని సంకోచించుచుండిరి వారందఱును రాజద్వారము కడకేగి రాజుతోఁదమకష్టములంగూర్చి మొఱపెట్టుకొనిరి కాని రాజు "వటహరిణము నాయనుగ్రహమును సంపాదించినపుడు దానికొక వరమును నేననుగ్రహించితిని. నారాజ్యమునైనను బరిత్యజించెదను, కాని మాటఁ దిరుగఁజాలను. పొండు. నారాజ్యమునందెవ్వరును హరిణములకుఁ గీడుఁగావింపఁగూడదు", అనిచెప్పి వారలనంపివేసెను.

ఈవృత్తాంతమంతయు వటమృగమునకుఁదెలిసెను. అప్పుడది తనయూథంబునెల్ల రావించి "మీలో నెవ్వరును మనుజుల సస్యముల భక్షింపఁగూడదు," అని శాసించెను. పిమ్మట వటమృగము మనుజులకిట్లు సందేశమంపెను. "కృషీవలులెవ్వరును దమ క్షేత్రముల కావరణముంచ నవసరములేదు. చుట్టును నాకులనుంచినఁ జాలును." ఈసందేశమంపినప్పటి నుండియుఁ బర్ణపరిక్షేపణంబుచే క్షేత్రావధినిరూపణాచారంబు కల్గినట్లు వినవచ్చుచున్నది. వటమృగముచే నట్లాజ్ఞప్తములై మృగములెవ్వియు నంతటినుండియు సస్యభక్షణంబుఁ గావింపవయ్యెను.

## 18. మతకభత్త జాతకము.

పూర్వము బ్రహ్మదత్తుఁడు వారాణసిని బరిపాలించుచున్నపుడు త్రివేదపారంగతుఁడైన బ్రాహ్మణుఁడొకఁడు జగద్విఖ్యాతుండగు నాచార్యుండై కాలగతిఁజెందిన పితృపితామహులకుఁ బిండప్రదానంబు చేయుఁబూని యజంబు నొకదానిం దెప్పించి ఛాత్రులతో నిట్లనుడివెను "పుత్రకులారా! యీయజంబును

నదీతటంబునకుఁ గొంపోయి స్నానంబుఁ జేయింపుఁడు. అటు
తరువాత దానికంఠంబున మాలనొకదానిని క్షేపించి భక్షణార్థము
దానికొక కలశమునిండుగ ధాన్యంబునొసంగి దానిఁదుడిచి తీసికొని
రండు," అని

అట్లనియాని నుడువుచు వారలా యజమును నదికిం గొంపోయి
మజ్జనంబుఁ గావించి తుడిచి తటంబుపైని నిలువంబెట్టిరి. ఆయజంబు
నకుఁ బూర్వజన్మ కర్మజ్ఞాన మంకురింపఁ దద్దినముననే దుఃఖవిముక్తి
యగుననునాశచే ఘటభంజనంబున నగుధ్వనివలె బిగ్గరగ నవ్వెను.
మఱియు స్వానుభూతవ్యధను బ్రాహ్మణుఁడు జెందునను బుద్ధిచే
నుచ్చైస్స్వరమున నేడ్చెను. అదిగని బ్రాహ్మణ యువకులా యజము
నిట్లు ప్రశ్నించిరి. "మిత్రుండవగు నోయజమా! నీవతి బిగ్గరగ
హాసవిలపనంబులఁ గావించితివి. నీయుల్లాసంబునకును విలపనంబు
నకుఁ గారణమేమి?

అజము:—మీగురువుచెంత నన్నీ ప్రశ్నము నడుగుఁడు.

ఆయజముతోడ వారలు గురువును జేరి వానికాయుదంతమం
తయు నివేదించిరి. అదివిని యాచార్యుఁడును దానివిలాసవిలాపం
బుల కారణమునుగూర్చి ప్రశ్నించెను. అప్పుడాపశువు పూర్వజన్మ
స్మరణశక్తిచేఁ బూర్వజన్మకర్మల నన్నిటిని జ్ఞప్తికిం దెచ్చికొని
యిట్టుల బ్రాహ్మణునితోఁ జెప్పఁదొడంగె. "ఓయీ! బ్రాహ్మ
ణుఁడా! పూర్వజన్మమున నేనుగూడ వైదిక మంత్రముల నారితేరి
నవాఁడనై పితృప్రియమ్ముకంబగు సంభోజనంబుఁ జేయఁబూని యాదర్శ
మై యజము నొకదానిం జంపితి. ఆమేక నొకదానిం జంపుటఁ బట్టి
యే యొక్కటి తక్కఁ యేనూఱుమార్లు శిరఃఖండనంబు ననుభవించితి.
ఇదియే నాయంతమగు పంచశతతమ జన్మంబు. ఏతద్దినముననే నా
కీదుఃఖముక్తిఁ గాంచెదనని యూహించి హసించితి. మఱియు నజపశ్వం



బుచే నేనూఱుపర్యాయములు శిరచ్ఛేదం బనుభవించినవాఁడ దుఃఖ
విరామము గల్గుచుండ నీవు నావలె మద్వధకుఁ బ్రతిఫలంబుఁగ నై
దువందల పర్యాయములు శిరచ్ఛేదంబు విధియింపఁబడుదువను నీ
హా పొడఁగట్టినప్పుడు విలపించితిని గానఁ దదర్థానుకంపచే రోదనం
బు సల్పితి.

బ్రాహ్మణుఁడు:—అజమా? భయపడకుము. నిన్ను నేఁ జంపను.

అజము:—బ్రాహ్మణుఁడా? నీవేమి చెప్పుచున్నావు. నీవు నన్నుఁ జంపినను, జంపకుండినను, నేనీదినమున మరణంబునుండి తప్పించుకొనఁజాలను.

బ్రాహ్మణుఁడు:— అజమా? భయపడకుము. నిన్ను సంరక్షించుటకు నీతో నేవచ్చెదను.

అజము:— బ్రాహ్మణుఁడా! నీసంరక్షణశక్తి యత్యంతాల్పంబు. నాపాపకర్మఫలంబన్ననో యత్యధిక శక్తియుక్తంబు.

అజంబు నా బ్రాహ్మణుఁడు కట్టువిప్పి వదలి శిష్యులతో
నిట్లనియెను. "ఎవ్వరు నీయజంబును జంపకుండఁ గాపాడుదము,"
అనుచు యువకులతో దాని వెంటఁ జనెను. కట్టునుండి విప్పఁబడిన
తక్షణమే యామేక యొక శిలోపరిభాగ సమీపమున మొలచిన
నికుంజపర్ణంబుల భక్షించుటకు మెడను సాచెను. ఆక్షణంబుననే
రాతిపైఁ బిడుగుబడి శిలాశకలంబును ఛేదింప నది యజాకంఠంబు
పైఁబడి తచ్ఛిరచ్ఛేదంబుఁ గావించెను. జనులచటికి గుమిగూడి
వచ్చిరి. ఆకాలమున బోధిసత్త్వుఁడా ప్రదేశమునందే తరుదేవతయై
జన్మించెను. నిజానుపమ ప్రభావంబుచే నాతఁడాకాశమధ్యంబున
బ్రహ్మపీఠము వేసి కూరుచుండ నచ్చట గుమిగూడినవారందఱును తద్ద
ర్శనంబు గావించిరి. "ఈజీవులందఱును పాపకర్మ ఫలంబుఁ గుర్తె

జరిగిన వారు. "బహుళః జీవహింసను గావింపకుందురు", అని
మాతనుబుఁగావించుమ నీరీతిఁగ నతిమధుర కంఠంబుతోఁ బలుక
నాగెను. "దుఃఖంబుసకుఁ బ్రీతిఫలంబు జన్మంబని గుర్తెఱింగిన
వారు ప్రాణిహింస మానుదురు. హంతకుని దండనంబతిఘోరంబు"
అటుల బోధిసత్త్వుఁడు, ఉపదేశంబుఁగావింప వారలందఱు "నరకభయ
యుక్తులై యానాటినుండియు జీవహింసగావింపక దయాళులై సత్కా
ర్యల నాచరించుచుఁ గాలముఁగడిపి దేవతాపట్టణవాసమునకుంజనిరి.

---

— 20: నళపాన జాతకము. —

పూర్వము నళకపాన గ్రామంబున కనతిదూరంబుననుండు కేత
వనంబున తట్టాపుటడవి యుండెడిదని చెప్పుదురు. మఱియు
నచటనుండు సరోవరంబున నొక జలపిశాచంబు వాసముఁగా
వించుకొని నీటక్రై యాకొలనిలోనికిదిగు ప్రతిజీవజంతువును
భక్షించుచుండెను. ఆకాలమున బోధిసత్త్వుఁడు మర్కటరాజై జన్మిం
చి పాటలమృగశావక దేహమంత దేహము కలవాఁడై యుండెను.
అతండా విపినమున దశగుణాష్టసహస్ర వనచరంబులకురాజై వార
లను కోనినుండి కాపాడుచు జీవించుచుండెను. ఈరీతి నాతఁడు
వారికిబోధించెను "ఓయీ మిత్రులారా! యీవిపినంబున విష
మయంబులగు వృక్షంబులును పిశాచగ్రస్తంబులగు కాసారంబులు
నున్నయవి. కాన మీరిదివఱకుఁ దిననిఫలంబు భుజింపక పూర్వము,
నింతకుఁ బూర్వము ద్రాగని ప్రదేశములనీటినిద్రాగక మున్ను, నన్ను
డుగ మఱవకుఁడు". వారందఱును సరియెయని ప్రత్యుత్తరమిచ్చిరి.

ఒకానొక దినమున వారదివఱకెన్నఁడును గాంచని ప్రదేశము
నకేగిరి. దినమంతయుఁ దిరిగితిరిగి, పానార్థముదకము వెదకికొనుచుఁ



డుదకసరస్సును గాంచిరి. కాని వారానీటిం ద్రాగక బోధిసత్త్వుని
రాక కెదురుచూచుచుఁ గూర్చుండిరి. అతఁడు వచ్చినతరువాత, "స్నే
హితులారా! ఎందులకీయుదకముఁ ద్రాగక యున్నారు?" అని
యాతఁడు వారిని ప్రశ్నించెను.

సమూహము:—మీరాక కెదురుచూచుచుంటిమి

బోధిసత్త్వుఁడు:—మిత్రులారా! మీరు వివేకముతో సంచరించిరి"
అనుచు నాతఁడా కాసారంబు చుట్టును దిరిగి పాదముల జాడలఁ బరీ
క్షింప నవియన్నియు నుదకములోనికిఁబోవువారి జాడలవలె నుండెను
గాని తిరిగి యందుండి వచ్చువారి జాడలవలెఁ గాన్పింపవాయెను.
"నిస్సందేహముగఁ నిదియొక పిశాచనివాసస్థానము," అని బోధి
సత్త్వుఁ డూహించి వారలతో "మిత్రులారా! మీరలీ యుదకము
ను ద్రాగకుండుటయందు సమముగ నాచరించితిరి. ఏలయన నీకా
సారంబు పిశాచగ్రస్తంబు" అని యనెను.

ఆజలపిశాచంబు వారలు నిజనివాసస్థానంబుఁ బ్రవేశింప కుం
డుటఁజూచి నీలంబగు కుక్షియు, శ్వేతంబగు ముఖంబును, నత్యంత
రక్తారుణంబులగు పాదహస్తంబులతోడను, ఘోరరాక్షస రూపంబు
ధరియించి యుదకంబు వెలుపలకువచ్చి "ఎందులకిచట నూరక
కూరుచున్నారు. నీటిలోనికిఁదిగి జలంబుఁద్రాగుఁడు" అని బిగ్గరగఁ
బలికెను.

కాని బోధిసత్త్వుఁడిట్లు ప్రత్యుత్తర మిచ్చెను. "నీవియుదక
మందుండు పిశాచంబవుగావా?

పిశాచము:—ఆ! నేనవుదును.

బోధిసత్త్వుఁడు:—ఈ సరోవరములోనికిఁ జను వారలందఱ నీవు భ
క్షించుచుందువా?

పిశాచము:—అవును. నేనట్లు శాసించుచుంటిని. చిన్నపిట్ట మొదలు ప్రతిజీవ జంతువును నేవిడువక భక్షింతును: మీ సమూహమునంతను భక్షించెద.

బోధిసత్త్వుఁడు:—నీకు మేము చిక్కుదుమా?

పిశాచము:—ఏది, ఒక్కపర్యాయము నీటిని ద్రాగుఁడు.

బోధిసత్త్వుఁడు:—ఆ! నిశ్చయముగ నీచేతఁబడకుండ మేమీనీటినే ద్రాగెదము.

పిశాచము:—మీరెటుల నీనీటిని ద్రాగఁ బ్రయత్నించెదరు?

బోధిసత్త్వుఁడు:— త్రాగుటకు మేమూ నీటిలోనికిం జనవలెనను కుంటివా? కానినీటిని ప్రవేశింపకుండఁగనే మాయెనుబదివేల మందియు, నొక్కొక్కఁడొక శూన్యాంతర్భాగనాళంబును గ్రహించి యతిసౌలభ్యముతో నీటిని ద్రాగఁగలఁడు. కాన, మమ్ములను నీవు భక్షింపఁజాలవు.

అప్పుడా బోధిసత్త్వుఁడొక బెత్తంబును దెప్పించెను. దశసిద్ధులనుజ్ఞాపకముఁ దెచ్చుకొని శపథపూర్వకముఁగనుచ్చరించి బెత్తములో నుగనూదెను. తక్షణమే యొక్క పర్వంబైన లేకుండఁగ నాబెత్తము రిక్తగర్భంబాయెను. ఈరీతిని కొన్ని బెత్తంబులను దెప్పించి వాని లో నుగనూదెను. తరువాత బోధిసత్త్వుఁడా సరోవరంబు చుట్టును దిరిగి “ యిచ్చట మొలచుచున్న బెత్తంబులన్నియు రిక్తగర్భంబులగుఁ గాక ” అని యాజ్ఞాపించెను. బోధిసత్త్వుల యుద్ధారకంబగు గుణ ప్రశస్త్యముచే వారియాజ్ఞ లెప్పుడును బ్రవర్తింపఁబడుచుండును. అది మొదలా సరోవరముచుట్టు మొలచు బెత్తములను రిక్తగర్భంబుగనే యుండును.



ఈయాజ్ఞనొసంగి బోధిసత్త్వుఁడు హస్తంబున బెత్తంబుఁ బట్టి కూరుచుండెను. ఆమిగిలిన యెనుబదివేల కోతులునుగూడ నొక్కొక బెత్తంబు చేతంబూని సరోవరముచుట్టును గూరుచుండినవి. బోధిసత్త్వుఁడు బెత్తముగుండ నీటినిబీల్చఁగ నవియన్నియుఁగూడ నాక్షణముననే నీటి నెగ్గఁబీల్చెను. ఈరీతిగ నామర్కటసమూహంబు నీటి నిద్రాగ నాయుదకపిశాచంబందు నొక్కమర్కటంబునైనఁ బట్టుకొనఁ జాలక యత్యంతము కోపముఁజెంది నిజనివాసంబునకుం జనెను. బోధిసత్త్వుఁడును బరివారముతో నడవిలోనికిం దిరిగిపోయెను.

— 22 కుక్కుర జాతకము —



తొల్లి బ్రహ్మదత్తుఁడు వారాణసిని బరిపాలించు సమయమున బోధిసత్త్వుఁడు తనపురాకృత దుష్కృతంబువలన శునకమై జనించెను. అతఁడు శ్వానంబులకెల్ల రాజై యొకశ్మశాన వాటిక యందు నివసించుచుండెను.

ఒకనాడు బ్రహ్మదత్తుఁడు క్షీరధవళంబులగు నశ్వంబులం బూఁచిన రథంబధిరోహించి యుపవనంబున కేగి, యాటఁబగలంతయు విలాసముతోఁ గడపి, సాయంసమయమునఁ దిరుగఁ బురంబునకు వచ్చెను. రథము సర్వాలంకారసహితమై ప్రాంగణమునునుండెను. ఆదినమున రాత్రియందు వర్షము కురిసెను. తేరి సజ్జంతయు వర్ష జలంబుచేఁ దడిసెను అప్పుడు రాజగారి శునకములన్నియుఁ బ్రా సాదోపరిభాగంబులనుండి ప్రాంగణంబునకువచ్చి తేరిసజ్జును, జర్మపట్టములను గొరికి పాడుచేసెను. మరునాడు పరిచారకులు రాజునడ కేగి, “దేవా! శునకములు ప్రణాళికముఖమార్గంబుననే ప్రాంగణంబు నంబ్రవేశించి తేరిసజ్జులఁ గొరికినవి,” అనివిన్నవించిరి. అదివిని

రాజు మిగులఁ గోపించి "మీకంటఁబడిన శునకముల నెల్లఁ జంపుఁడు" అని పరిజనుల కాజ్ఞాపించెను. అప్పుడు ఘోరమయిన శునకవధ సంప్రాప్తమయ్యెను. అయ్యదనున శునకములెల్లఁ భీతిల్లి బోధిసత్త్వుని దర్శనార్థము శ్మశానవాటిక కరిగెను. బోధిసత్త్వుఁడు వానిఁ దిలకించి "మీరలందఱు గుమిగూడి యిప్పుడియ్యెడ కరుదెంచుటకుఁ గతం బేమి" అని యడిగెను. తోడనే యవి "అయ్యా! ప్రాసాదావరణమున రాజుగారి రథస్థిత చర్మపట్టములను శునకములు భక్షించినవఁట. అందులకు రాజు కుపితుఁడై శునకహననం బాజ్ఞాపించెను. ఇప్పుడు శునకములన్నియు నిర్మూలములగుచున్నవి. ఈతీరున శ్వానములకు గొప్పయాపద సంభవించినది," అని మొఱపెట్టినవి.

అప్పుడు బోధిసత్త్వుఁడిట్లు తనమనంబున జింతించుకొనెను. "సురక్షితంబగు ప్రాసాదావరణములోనికి వెలుపలనుండు కుక్కురము లెట్లు పోగలవు? లోపలనుండు కుక్కలే యీపనిఁ గావించి యుండును. సాపరాధులను బరిత్యజించి రాజు నిరపరాధుల దండించుచున్నాఁడు. నేనిప్పుడు సాపరాధుల రాజునకొప్పగించి నిరపరాధులను నాచుట్టముల రక్షించిన నింకేమి దోషముకలదు!" అని చింతించి "భీతిల్లకుఁడు. మిమ్ముల నేను రక్షించెదను. నేను రాజుం దర్శించి వచ్చువఱకు మీరిటనేయుండుఁడు" అని ధైర్యముచెప్పి పోయెను. "ఱాళ్లతోఁగాని కఱ్ఱలతోఁగాని యెవ్వరును గొట్టకుఁడు" అని చెప్పుచు బోధిసత్త్వుఁడు పోవుచుండ నెవ్వరును వానికి హానిఁ గావింప దలంపరైరి.

రాజు కొలువుఁ దీర్చియుండెను. బోధిసత్త్వుఁడు తిన్నగ రాజునొద్దకుఁ బఱుగిడిపోయి సింహాసనాధోభాగమున కొక్కదాటునఁ జేరెను. రాజసేవకులు దాని వెడలగొట్టఁ బ్రయత్నించిరి. కాని రాజు వారిని వారించెను. కొంతసేపటికి బోధిసత్త్వుఁడు ధైర్యముఁ దెచ్చుకొని యెదుటికివచ్చి రాజునకు నమస్కరించి యాతనితో నిట్లు



సంభాషించెను.

బోధిసత్త్వుఁడు:-రాజా! నీవా శ్వాననాశంబుఁ గావించుచుంటివి.

రాజు:-అవును. నేనే కావించుచుంటిని.

బోధి:-నరాధిపా! వానియపరాధమేమి?

రాజు.- అవి నా రథాలంకార ఖాదనంబుఁ గావించినవి.

బోధి:-నేర మొనరించిన శునకము లెవ్వియో తమకుఁ దెలియునా?

రాజు:-నాకుఁ దెలియదు.

బోధి:-అపరాధులను శిక్షింపక కంటఁబడిన శ్వానముల నెల్లఁ జంపించుట తమకు న్యాయమా?

రాజు:-మచ్ఛకటాలంకారమగు చర్మములను కుక్కలు భక్షించినవి. కానవానికి మరణదండన విధించితిని.

బోధి:-దేవా! తమయనుచరులన్ని కుక్కలను బక్షపాతములేక చంపుచుండిరా? లేక కొన్నిటిని మాత్రమే చంపుచుండిరా?

రాజు:-నా ప్రాసాదంబుననుండు పెంపుడుకుక్కలను దప్పఁ దక్కినవానినెల్లఁ జంపుచున్నారు.

బోధి:-ఓ దేవా! తావకరథచర్మఖాదనంబుఁ గావించుటచే నన్నికుక్కలకును మరణదండన విధించితినని చెప్పియుండిరి. ఇప్పుడు తమ ప్రాసాదతలమందలి కుక్కలకట్టి శిక్షావిధానములేదని నుడువుచున్నారు. కావునఁ దాము పక్షపాతము, ద్వేషము, నజ్ఞానము, భీతి, యనునాల్గు దుష్టమార్గముల నవలంబించి నట్లున్నది. అది కేవలము నన్యాయమగును. రాజులు

వివాదములలోని న్యాయాన్యాయముల విమర్శించునపుడు తులాదండంబుభాతి నిష్పక్షపాతమున నుండవలయును. అట్టిచో నీమొద రాజమందిరములోని శునకములకు శిక్ష లేకుండుటయు, దీనములగు వెలుపలిశునకముల శిక్షించుటయుంజూడ నన్నిశునకములను శిక్షింపక దీనశునకములను మాత్రమే శిక్షింపం దలంచుకొనినట్లు కన్పట్టుచున్నది. ఓదేవా! తాము చేయునది కేవలము నన్యాయము.

రాజు:-నాకథచర్మఖాదనంబుం గావించిన వానిని నీ వెఱుంగుదువా?

బోధి:-ఓదేవా! నాకుం దెలియును.

రాజు:-అవ యెవ్వి?

బోధి:-అది నేను విశదముగం దమకు మనవిం జేయుదును.

రాజు:-చెప్పుము.

బోధి:-తమ శునకముల నిచ్చోటకు రావింపుండు- పిమ్మటం గొంచెము తక్రమును గుశదర్భలను దెప్పింపుండు

బోధిసత్త్వుడు కోరినవిధముగ నన్నిటిని రాజు తెప్పించెను. అప్పుడు బోధిసత్త్వుడు రాజుతో నిట్లనియె. "ఓదేవా! ఈదర్భల నామజ్జిగలో ముద్దచేసి కలుపుండు. పిమ్మట దాని నాకుక్కలకుం బట్టింపుండు" అని చెప్పినవెంటనే రాజట్లొనరించెను. కుక్కలన్నియు నామజ్జిగం ద్రావి వమనముం గావించుకొనినవి. అందుం జర్మఖండములు జూపట్టెను. పిమ్మట రాజు పరమానంద భరితుండై బోధిసత్త్వునకుం దనశ్వేతాతపత్రమును సమర్పించెను.

~



## — 30. మణిక జాతకము. —

పూర్వము బ్రహ్మదత్తుడు వారాణసిని బరిపాలించుచుండినపుడు బోధిసత్త్వుడొకపల్లెలో నొకమహాజన భూమియందు వృషభంబై జనించి, బృహత్పాటలుండను నామమును ధరించెను. వానికి, నల్పపాటలుండను కనిష్ఠసోదరుండుండెను. వీరిరువురు సోదరులు మాత్రమే యాకుటుంబముయొక్క సమస్తశకటకర్మల నొనర్చుచుండిరి. మఱియు నామహాజనునకు నొక్కతెకయే పుత్రికయుండెను. ఆపురవాసుండగు నొక కుటుంబి యామెను దనపుత్రునకునిచ్చి వివాహముం జేయుమనియడిగెను. వివాహసమయంబున ప్రాఘూర్ణకులకు స్వాదుభక్ష్యంబుల నొసంగుటకు నామెజననీ జనకులు మణికయను క్రోడంబును పీవరంబుగ నొనర్చుచుండిరి.

ఇది గని యల్పపాటలుండు సోదరునితో నిట్లనియెను. "సోదరా! యీకుటుంబునకు నవసరమున్న భారంబులన్నియు మనచే లాగంబడుచున్నవి. మనకష్టములకు భోజనార్థము వారిచ్చునవి రసహీనగ్రాసంబును పలాలంబును మాత్రమే. కాని యిదిగో నీక్రోడంబన్నం బొసంగం బడుచున్నది. అట్టి భోజనం బొసంగంబడుటకుం గారణ మెద్ది?"

బోధి:- ఓవత్సా! అల్పపాటలా! వానిం జూచి నీ వేమియు నసూయం జెందకుము. ఏలయన నాసూకరము ప్రాణనాశన హేతుకంబగు భోజనము చేయుచున్నది. పుత్రికా వివాహసమయమున నతిథులకు రుచ్యభక్ష్యంబు నొడంగూర్చుట మాత్రమే యీపందిని కుటుంబము మేపుచున్నది. కొలదికాలము నీవు వేచియుండిన నతిథులందఱును రాగలరు. అప్పుడా సూకరము తనయునికిపట్టునుండి వాళ్ళచే నీడ్వ

బడి వంశాంశంబుగ మార్చఁబడుచుండఁగ నీవు గాంచెదవు."
అని చెప్పి మరియు నిటులఁ జెప్పందొడంగె. "జాలిపడఁదగిన మణికను జూచి నీవసూయఁ జెందకుము. అది నాశనంబును దినుచున్నది. చిరకాలజీవన ప్రాతిభావ్యంబగు నీయల్పక డంగరమును దృప్తితో భుజియింపుము."

అచిరకాలంబుననే యతిథులువచ్చిరి. మణికయుఁ జంపఁబడి యనేక మాంసాహార విశేషంబులుగఁ జేయఁబడెను.

బోధి:- వత్సా! మణికను గంటివా?

అల్ప:- సోదరా! మణికుని సుభక్ష్యభోజనఫలంబునే గాంచితిని. అట్టి భక్ష్యంబుకంటె వేయింతలు గ్రాసకడంగరపలాలంబు లయినను, మనభక్ష్యంబులే మేలు. ఏలయన మనభక్ష్యంబు మనకు హానినొసంగక జీవననాశంబు నొడఁగూర్పఁదనుటకు నభిజ్ఞానంబు.

## — 21. కులావక జాతకము. —

పూర్వమున మగధరాజొకఁడు మగధరాజ్యమందలి 'రాజగృహ' మను పురమును బాలించుచుండెను. శక్రుఁడనువాఁడు తన పూర్వజన్మమున మగధరాజ్యములోనున్న మచల గ్రామమున జననమందినట్లే మగధరాజు తద్రాజ్య పరిపాలనంబుఁ గావించుచున్నపుడు బోధిసత్త్వుఁడొక సామంత ప్రభుఁడై జన్మించెను. నామకరణసమయమున నాతని తలిదండ్రులు మాఘకుమారుఁడను నామము నాతనికిడిరి. కాని యుక్తవయస్కుఁడైన పిమ్మట నాతని నందఱును మఘబ్రాహ్మణ యువకుఁడని, పిలుచు



చుండిరి. అతని జననీజనకులు తమతో సమానగౌరవముఁగల కుటుంబములోని యొకకన్య నాతనికి వివాహముఁ గావించిరి. పిమ్మట నా బోధిసత్త్వుఁడు సంతాన సంపదలతోఁ దులదూఁగుచుఁ, బంచవిధుల నాచరించుచు, మిగుల దయాళుఁడును దాతయునై మించియుండెను.

ఆ గ్రామమునందు ముప్పది కుటుంబములవారు కాపురముండిరి. ఒకదినమున గ్రామస్థులందఱుఁ తద్గ్రామసంబంధ వ్యవహారములఁ గొన్నిటిని బరిష్కరించుకొనుచు నా గ్రామమధ్యమునందుండిరి. బోధిసత్త్వుఁడొకచోట ధూళి మున్నగునవి లేకుండ శుభ్రపరచి యచ్చట నిలువఁబడియుండగ నింకొకఁడువచ్చి యచ్చోటినాక్రమించెను. పిమ్మట బోధిసత్త్వుఁడు మరియొక తావును శుభ్రపఱచు కొనఁగ నింకొకఁడువచ్చి దానినాక్రమించుకొనెను. ఈ తెఱఁగున బోధిసత్త్వుఁ డందఱకును సుస్థానంబులఁ గల్పించెను. మఱియొకసారి బోధిసత్త్వుఁ డొక మండపమును నిర్మించెను. కొంతకాలమైన తరువాత దానిం బడగొట్టి యచ్చోట నుదకుంభఫలకయుక్తంబగు నొక శాలను నిర్మించెను. బోధిసత్త్వునితో నా గ్రామవాసు లుదయముననే లేచి సత్కర్మలఁ గావించుచు, ఛురపరశు యష్టులఁ గరములధరించి, 'బయటికి వెడలుచుందురు. చేతిలోని కఱ్ఱలతోఁ జతుష్పథములో నుండియుఁ దదితర మార్గములలోనుండియు శిలలను బార్శ్వభాగములకుఁ ద్రోసివేయుచుందురు. శకటాక్షాగ్ర సంఘట్టనముఁ గావించు తరువుల ఛేదించుచుందురు. నతోన్నత ప్రదేశముల సమము సేయుచుందురు. సేతునిర్మాణముం జేయుచుఁ దటాక ఖననంబుఁ గావించుచు విశ్రాంతి గృహముల నిర్మింతురు. దయాపరులై విధుల సల్పుదురు. ఈతీరున నా గ్రామవాసులు బోధిసత్త్వుని యుపదేశంబుల నాచరించుచు విధులను నిర్వహించుచుందురు

అంతగ్రామాధికారి తనమనమున నేని గ్రామవాసులకు సురసమ్మియ్య, వారు సురాపానమత్తులై నరహంతకాదికృత్యముల

నొనరింప వారిని దండించియు నిట్లనేక విధముల వారివలన ధనము
నార్జించుచుండెడివాఁడను. ఇప్పుడీయువ బ్రాహ్మణుఁడగు మఘుఁ
డు వారలచే ధర్మవిధులఁ జేయింప నిశ్చయించుకొనినాఁడు. ఈతీరున
బోధిసత్త్వుఁడు నరహత్యాది ఘోరాపరాధ నిరోధముఁగావించుచు
న్నాఁడు" అని మిగులఁ గోపించి "నేను వారలు పంచవిధిపాలనం
బుచేయునటులఁ జేసెదను" అని రాజుకడకుఁజని "దేవా! చోర
సంఘమొకటి చెలరేగి గ్రామలుంఠనంబును, దదితరాపరాధములను
జేయుచున్నది," అని విన్నవించెను. రాజామాటనాలించి గ్రామా
ధికారితో "నీవుపోయి వారలఁబట్టితెమ్ము" అని యాజ్ఞాపించెను.
గ్రామాధికారిపోయి యాముప్పదుగురు గ్రామస్థులనుబట్టి నేరస్థులు
గ రాజునకొప్పగించెను. వారినేరంబులు విమర్శింపక యే రాజు వారికి
హస్తిపాదతలమర్దనమున మరణంబు విధించెను. అప్పుడు బోధిస
త్త్వుఁడు వారలతో "మీవిధులను మరువకుఁడు" అని చెప్పెను.

ఇంతలో వారలఁ జంపుటకై నాగమొక్కెడకు రావింపఁబ
డెను. మావటివాఁడెంతఁగొట్టినను నేరస్థులనది సమీపింపదయ్యెను.
పిమ్మట వరుసఁగ గొన్ని గజములు తీసికొనిరాఁబడెను. అవి యన్ని
యు నిట్లే కావించెను. రాజదిపరికించి వారలయొద్దనేదియో యొక
మూలిక యున్నదని యూహించి లెస్సఁగవారలఁ బరీక్షింపవలయు
నని పరిజనుల నాజ్ఞాపించెను. వారట్లు కావించి యేమియుం గానక
రాజున కాసంగతిఁ దెలియఁబఱిచిరి. అంతరాజు "మూలిక లేకున్నచో
మంత్రమేదైన నుచ్చరించుచుండవలయును. అట్టిమంత్రమేదైన ను
న్నదేమో, కన్గొనుఁడు." అని రాజు మరల వారల కాజ్ఞాపించెను.
రాజసేవకులుపోయి వారలనడుగ బోధిసత్త్వుఁడొక మంత్రమున్నదని
చెప్పెను. సేవకులుపోయి రాజుతో నావైనము విన్నవించిరి. రాజు
వారలఁ దన సమక్షమునకు రావించి "మీమంత్రమును జెప్పుఁడు."
అని యడిగెను. అప్పుడు బోధిసత్త్వుఁడు "దేవా! జీవహింస సేయ
కుండుటయు, ననుచితజీవనము సేయకుండుటయు, ననృతమును



బల్కకుండుటయుదక్క వేరుమంత్రమేదియు మాముప్పదిమందికిని లేదు
మేము సురాపానఁబు సేయము, దయావంతులము, ప్రేమయుతుల
ము. మేముకృపాన్వితులము. మార్గముల సమపఱిచి, తటాకముల
నిర్మించి, జనోపయుక్తముగ విశ్రాంతిగృహముల నిర్మింతుము. ఇది
యే మామంత్రము. ఇదియే మాసంరక్షకము. ఇదియే మాశక్తి"
అని చెప్పెను

అదివిని పరమానందభరితుఁడై యారాజు వారలకా పిశును
ని ధనమంతయునిచ్చి వానిని వారికి బానిసగ నొనరించెను. వీనితోఁ
బాటు వారలకొక యేనుగును, నొక ముఖ్యగ్రామమును, నొసఁ
గెను. అప్పటినుండియు వారుమనశ్శుద్ధితో సత్కార్యంబులఁ గావించుచు
నొకతక్షకుని రావించి చతుష్పథమున నొకవిశాలమగు భవనమును
గట్టించిరి. వారు స్త్రీవాంఛావిరహితులగుటంజేసి తాముచేయు సు
కృతములలో వారలకుమాత్రము పాలీయరైరి.

ఆకాలమున బోధిసత్త్వుని గృహంబునఁ సుశీల, విచారశీల,
యానంద, కులీన, యనునల్వురు స్త్రీలుండిరి. వీరిలో సుశీలయను
నదిశిల్పికి రహస్యంబునఁ బారితోషికం బొసంగి "సోదరా! యీగృహ
నిర్మాణంబున నన్ను ముఖ్యురాలునిగఁ జేయఁ బ్రయత్నింపుము" అని
చెప్పెను. వాఁడును నట్లేయని యంగీకరించెను. ప్రప్రథమమున నా
తఁడు ప్రాసాదశృంగమున నుపయోగించు శుష్కదారువు నొకదా
నిని శిఖరముగఁ దయారుచేసి దానికి గుడ్డలుచుట్టి యొకమూలనుంచె
ను. గృహనిర్మాణమున శిఖరారోపణ సమయమురాగనె రథకారుఁ
డు వారలతో నిట్లు సంభాషించెను.

రథకారుఁడు:—యజమానులారా! మనము కావింపవలసినపని యి
కొకటియున్నది.

యజమానులు:—అది యేమి?

రథకారుఁడు:—గృహమునకొక శిఖరము కావలయును.

యజమానులు:—ఒకదానిని సంపాదింపుము.

రథకారుఁడు:—ఇందుకుఁ బచ్చికఱ్ఱ పనికిరాదు. కొంతకాలము క్రిందటనే చేయఁబడి సిద్ధముగనున్న శిఖరము కావలయును.

యజమానులు:—ఇప్పుడేమి చేయవలయును?

రథకారుఁడు:—ఎవరియొద్దనైన సిద్ధముగనిర్మింపబడి క్రయంబునకు వచ్చునది యున్నదేమో కనుఁగొనుఁడు.

అప్పుడు వారు దానికొఱకుఁ బ్రయత్నించిరి. తుదకు సుశీల గృహంబున నట్టిదియొకటి వారలకగపడెను. కాని యామె దాని నెంతధనమునకైనను విక్రయింపదాయెను. చిట్టచివర కామె "నన్ను మీసుకృతంబున భాగభాగినిఁగ నొనరించిన మీకుదీని నుచితముగ నొసఁగెదను" అని చెప్పెను. "మేము స్త్రీలను మాసుకృతమున భాగభాగినులుగఁ జేయము" అని యజమానులు నుడివిరి. పిమ్మటనా సూత్రధారుఁడు "యజమానురాలా! ఏమట్లనెదరు; స్త్రీలు బ్రహ్మలోకమునుండి తప్ప మఱియెచ్చటను బహిష్కృతులుకారు కావున నామెయొద్దనుండి శృంగమును బరిగ్రహింపుఁడు. దానితో మనపని పూర్తియగును" అని చెప్పెను.

అందులకు వారియ్యకొని శృంగము నామెయొద్దనుండి పరిగ్రహించి గృహనిర్మాణముం బూర్తిగావించిరి. అచ్చట ఫలకముల స్థాపించి యందుదకకుంభములనుంచి నిరతాన్న ప్రదానముఁగావించుచుండిరి. గృహముచుట్టును సద్వారావరణకుడ్య విధానముఁగావించి, ప్రాంగణంబున సికతావకీర్ణంబుఁగావించిరి ఆవరణ బహిర్భాగంబునఁ దాళవృక్ష పంక్తి నెలకొల్పిరి.



విశాకశీల యొక యారామమును నిర్మించెను. అచ్చోటఁ గాన్పించని ఫలవృక్షంబులెచ్చటను గాన్పించవు. ఆనంద రమణీయంబును, బంచవిధనీరజ శోభితంబునునగు నొకపల్వలంబును నందుఁ ద్రవ్వించెను. కులీన మాత్రమేమియుం జేయలేదు.

పితృసేవయు, వృద్ధజనసేవయు, సత్యవాక్పరిపాలనంబు, పరుషవాక్య నిరాకరణంబును, నపవాద పరిత్యాగమును, గార్పణ్య వర్జనంబును, నను నీసప్తవిధనియమముల బోధిసత్త్వుఁడాచరించుచుండెను.

ఇట్టి యుత్కృష్టపదమునుజెంది బోధిసత్త్వుఁడు దేహముఁజాలించి త్రిదశులలోకంబున దేవరాజగు సక్కుండుగ (శక్రుఁడుగ) జన్మించెను. అతని స్నేహితులు నచటికేపోయిరి. అప్పుడ సురులుఁగూడ నచటనేయుండిరి. దేవరాజైన సక్కుఁడు "పరభోక్తవ్యంబగు నీలోకమున మనకేమి శ్రేయస్సున్నది," అనియెను. దివ్యసురాపానంబునసురులకావించి ప్రమత్తులైయుండ సక్కుఁడు వారిపాదములఁబట్టి సినేరుపర్వతప్రాంతమునకు విసరెను. దేవలోకము మొదలు వారుపడిన ప్రదేశము సినేరుపర్వతాధోభాగమునుండి యసురలోకముగఁ బరిగణింపబడుచుండెను, దేవతలయొక్క విద్రుమ తరువుభాతి నిచ్చటనొకవృక్షంబుజనియించి, యొక్కయుగము సజీవియై కిమ్మారపాటలనామంబునఁ బరగుచుండెను. ఏతద్వృక్షజనిత పుష్పములంబట్టి వారలు విద్రుమపుష్పశోభిత దేవలోకముకాదని గ్రహించిరి అప్పుడువారిట్లు ఘోషించిరి "ఈవృద్ధసక్కుఁడు మనలను రాపానమత్తులుగఁజేసి మనదేవతాపట్టణము నాక్రమించి, మనల నీయగాధంబులోనికి దింపివాఁడు. రండు. యుద్ధసంరంభమున నాతని జయించి మనలోకము మరల మనము తీసికొందము" అనుచు పిపీలికములు స్తంభోపరిగమనముఁ గావించునట్లు సినేరుపార్శ్వాధిరోహణముఁ గావింపఁదొడఁగిరి.

అంత నసురులు విజృంభించిరను భయధ్వనివిని, వారలతో యుద్ధము సేయుటకు సక్కుఁడా యగాధంబు లోనికిఁజని, వారలచేఁ బరాజితుండై శతపంచాశత్క్రోశ పరిమాణముగల జయరథమున దక్షిణాఘూతంపు శిఖరోపరిశిఖరమునకుఁ బరుగిడుచుండెను.

అట్లుపోయిపోయి యాతనిరథము శాల్మలీవనముం జేరెను. రథమార్గంబున వృక్షశాఖంబులు పగిలి భిద్యమానంబులై యగాధంబునఁబడెను. గారుడశాబకము లాయగాధంబునఁబడుచు ఘోరనినాదంబులఁ గావించెను. సక్కుఁడు తనసూతుఁడగు మాతలితో నిట్లనెను. "మాతలీ ! యీధ్వనియేమి ? ఎంతహృదయభేద్యంబుగ వినఁబడుచున్నది" అనినతోడనే మాతలి "దేవా ! తమ రథంబుచే వృక్షములున్మథితములగుచుండ నీగారుడడింభకములు భయాతిరేకంబున నరచుచున్నవి" అని చెప్పెను. అంతనతఁడు "మాతలీ ! వారు నావలన బాధఁజెందవలదు. రాజ్యమునకై మనము జీవహింస సేయరాదు. వీరి సంరక్షణ నిమిత్తమై నా ప్రాణముల నసురుల కొసంగెదను", అని చెప్పినప్పటికి మాతలి రథమునుద్రిప్పి యింకొకమార్గంబున దేవలోకంబుఁ జేరెను. అసురులు రథపరిక్రమణముఁ గాంచినతోడనే యితరలోకంబులనుండి సక్కులు నిశ్చయముగ వచ్చుచున్నారని విలపించిరి. పిమ్మటవారు "బలాభివృద్ధి యగుటచే నితఁడు రథపరిక్రమణమును గావించెను", అని యనుకొనుచుఁ బ్రాణభీతిచే గజగజవణఁకుచు నసురలోకముఁ జేరువఱుం బరుగిడిర.

అప్పుడు సక్కుఁడు దేవలోకమునఁ బ్రవేశించి నిజదేవతాగణంబుతోడను, బ్రహ్మలోకమందలి సురలతోడను గూడికొని కొన్నగరమధ్యంబున నధివసించెను. అంత జయప్రాసాదము సహస్రత్రిశములవఱకు భూమింజీల్చుకొని బయల్వెడలెను, జయా సమయము లబ్ధంబగుటచే దానికానామము గల్గెను. మరల నసురులవలన బాధ



కలుగకుండ సక్కుఁడు పంచప్రదేశంబుల రక్షకభటుల నియోగించెను. పంచస్థలనియుక్త రక్షకభటరక్షితుండై సక్కుఁడమరలోక సౌఖ్యములనుభవించుచుండ సుశీల దేహమ్ముఁ జాలించి సక్కుని భార్యయైజన్మించెను. శృంగదానఫలముగఁ బంచశతక్రోశోన్నతమై దివ్యమణిమయ విరాజితంబైన సుశీల నామకప్రాసాద మామెకు నుద్భవించెను. అందు ధవళదివ్యవితానంబుక్రింద సక్కుఁడు దేవరాజై దేవమానవపాలనంబుఁ గావించుచుండెను.

పిమ్మట విచారశీలయు మృతిఁజెంది సక్కుని దాసియై జన్మించెను. ఆరామనిర్మాణఫలముగ నామెకొఱకు 'విచారశీలాలతావనరాజి' యనునొకయారామముద్భవించెను. ఆనందయు మరణానంతరమున సక్కునిదాసియై జనించెను. తటాకఖననఫలంబుగ 'నానందయను' తటాకముగూడ నామెకొఱకుద్భవించెను. కులీన యకృతపుణ్య యగుటచే వనకందరంబున బకమైజన్మించెను.

"కులీనజ్జాడ యేమియుంగానఁబడదు. ఆమె మరల నెచ్చట జన్మించినదోకద" అని చింతించుచు సక్కుఁడు తుదకామె నివాసస్థానముఁ దెలిసికొనెను. పిమ్మట నాతఁడచ్చోటికేగి యామెఁగాంచి యామెను దనతోఁగూడ సురలోకమునకుఁ గొంపోయి, యతిరమణీయంబగు దేవనగరిని సుశీల ప్రాసాదంబును విచారశీలాలతావనరాజిని, నానందనామక తటాకంబు నామెకుఁగనుపఱచెను. పిమ్మట సక్కుఁడామెతో "వీరుమువ్వురును బూర్వజన్మ ఫలానుసారముగ నాచేటికలై జన్మించిరి. నీవు సుకృతంబుఁజేయమికి జంతులోకంబున జన్మించితివి. ఇంతటినుండియు విధులనాచరింపుము", అని చెప్పెను. ఇట్లామెతో సంతోషవాక్యంబులంబల్కి యామెకుఁ బంచవిధ్యుపదేశముఁగావించి యామెనామె నివాసస్థానమున విడిచెను. అప్పటినుండియు నామె యీవిధులననుసరించి చరించుచుండెను.

కొలది కాలమయినపిమ్మట నామెవిధ్యాచరణముం బరీక్షింపఁగోరి సక్కుఁడు మత్స్యరూపమున నామె యెదుటఁబడియుండెను. చేఁప మరణించినదను భ్రాంతిచే నాబకము మత్స్యశిరంబును ముక్కునఁగఱచి పట్టుకొనెను. అంతలోఁ జేఁప తోకనాడింపఁగా "ఏమీ, యీమత్స్యము జీవములతోడనే యున్నదే" అని దానినివిడిచిపుచ్చెను. "బాగు, బాగు. నీవువిధులలెస్సఁగ నాచరింపఁగలవు" అనుచు సక్కుఁడటనుండి వెడలిపోయెను.

వేఱొకజన్మంబునఁ గులీన వారాణసియందుఁ గుంభకారుని కుమార్తెయైజన్మించెను. పిమ్మటనీమెయెచ్చటజనించినదోయని చింతించుచు సక్కుఁడు, తుదకామె జన్మస్థానముంగనుఁగొని వృద్ధవేషంబున నొకశకటంబును సువర్ణకూష్మాండములతో నింపి "ఈకూష్మాండంబులఁగొనుఁడు; ఈకూష్మాండంబులఁగొనుఁడు" అనియఱచుచు గ్రామమధ్యంబునఁదిరుగుచుండెను. జనులు వచ్చి యమ్ముమని యడుగ "నేను విధులననుసరించు వారలకే విక్రయించెదను. మీరలావిధుల నాచరించుచున్నారా?" అనిప్రశ్నించెను. "నీవిధులయర్థము మాకుఁదెలియదు. కూష్మాండంబుల మాకమ్ముము" అనివారడిగిరి. "అట్లుకాదు. నాకుగుమ్మడికాయల క్రయధన మక్కరలేదు నేవాని నుచితముగ విధ్యాచరణ పరాయణుల కొసంగెదను. ఇతరుల కియ్యనొల్లను" అనిచెప్పెను. ఈపరిహాసకుఁ డెవ్వఁడోకదా యనియనుచు నెవరిత్రోవను వారుపోయిరి.

అదివిని కులీన యీకూష్మాండములు తనకొఱకే వచ్చినవని గ్రహించి ముదుసలియొద్దకేగిన నాతఁడామెతో నిట్లనెను. "అవ్వా నీవువిధుల నాచరించుచున్నావా?" అనియడిగిన "అగును. నేనాచరించుచున్నాను" అని యాపెబదులు చెప్పెను. పిమ్మట నాతఁడు "నీకొఱకే వీని నీయొద్దకుఁ దీసికొనివచ్చితిని", అనిచెప్పుచుఁ గూష్మాండంబులతోఁగూడ నాశకటము నామెయింటియొద్దవిడిచిచనెను.



ఆతీరుననే కులీన తనజీవితకాలమంతయు విధుల నాచరించుచు మరణానంతరమున వేపచిత్తియుఁడను నసురరాజునకుఁ బుత్త్రికగ జన్మించెను. తన సుకృతమువలన మిగుల సౌందర్యరాశియై యుండెను. ఆమెకు యుక్తవయస్సు వచ్చినవెంటనే యామెస్వయంవరమునకై యాపితండ్రి యసురులనెల్ల రావించెను. అంతలో సక్కుఁడును నామెజన్మమును దెలిసికొని యసురవేషధారియై కులీన వరాన్వేషణముం గావించు సమయమున నన్నే తప్పక వరించునని యనుకొనుచు నటకేగెను.

కులీన నాభరణములతో నలంకరించి సభాభవనంబునకుఁ దీసికొనివచ్చి యామెజనకుఁడు "వీరిలో నీమనసువచ్చినవానిని వరునిగ నెన్నికొనుము" అని యాజ్ఞాపించెను. అప్పుడామె యున్నదిక్కులం గలయంజూచి యొకచో సక్కునిఁ దిలకించి పూర్వజన్మప్రేమచేఁ బ్రేరేపితయై యాతనిం దనవరునిఁ గావించుకొనుట కిచ్చగించెను. స్వయంవరానంతరమున సక్కుఁడామెను దేవతానగరమునకుఁ గొంపోయి యామెను ద్వ్యర్థకోటిదేవదాసీలకు ముఖ్యురాలినిఁగఁ గావించెను. ఆమెయు దేహావసానంబున స్వకర్మానుసారముగ ఫలానుభూతికిం జనెను.



## — 44. మకశ జాతకము. —

పూర్వము బ్రహ్మదత్తుఁడు వారణాసిని పాలనంబుఁ జేయుచున్నపుడు బోధిసత్త్వుఁడు వాణిజ్యమువలన జీవించుచుండెను. ఆకాలమునఁ గాశీరాజ్యోత్సంగ గ్రామములందుఁ గర్మకారులు వసించుచుండిరి. వారిలోఁ దామ్రకలశమువలెఁ బ్రకాశించుచున్న శిరస్సుగల ఖర్వాటుఁడొకఁ డొకదినమున మానిబల్లనొకదానిని జిత్రికపట్టుచుండ నతనిశిరస్సుపై నొకమశకము బాణమువంటి తనతుండముతోఁ గుట్టెను.

అంత నతఁడు తనసమీపముననున్న కుమారునిబిలిచి "బాలకా! మశకంబొకటి నాశిరస్సునఁ గుట్టుచున్నది. దానిందోలివేయుము" అనిచెప్పెను. అంత నాబాలుఁడు "నాయనా! దానిని బెదరగొట్టక సమముగ నుండుము. నే దానినిప్పుడే యంతమునొందించెదను" అని చెప్పెను. ఆసమయమున నే వ్యాపారమునకై బోధిసత్త్వుఁడా గ్రామముఁ జేరి యాకర్మకారునిదుకాణంబునఁ గూరుచుండెను. "పుత్రకా! మశకబాధనుండి నన్నుదప్పింపుము" యనియాకంసాలియఱచెను. "తప్పించుచున్నాఁడను తండ్రీ" యని ముదుసలి పురోభాగమున నున్న యాతనిపుత్త్రుఁడు వాడియైనగొడ్డలి నొకదానిని జేతఁబట్టి మశకమును జంపుటకై పితృశిరస్తాడనంబుఁ గావించెను. అంతనాతని శిరస్సు ద్విధాభిన్నమై క్రిందఁబడెను. ఆకఁసాలి మరణించెను.

తన సమక్షమున జరుగుచున్నదంతయుఁ జూచి బోధిసత్త్వుఁడిట్లు చింతించుకొనెను. "ఇట్టిమిత్రుని కంటెఁ బ్రత్యపకారభీతిచే నెవ్వఁడు మనుజహననమునుండి విముఖుఁడగునో యట్టివిచక్షణశీలుఁడగు శత్రువైనను మేలు" అనిచింతించి "మూఢులగు మిత్రులుబుద్ధిమంతులగు శత్రువులకంటె నికృష్టులు. దోమను జంపఁబోయి వివేకహీనుఁడై పితృకపాలభేదనంబుఁ గావించిన యీకర్మకారుని పుత్త్రుఁడే మనకీయెడ దృష్టాంతముకాగలఁడు" అని యిట్లు చెప్పుచు బోధిసత్త్వుఁడు లేచి తనమార్గమునం జనెను. పిమ్మట నాకంసాలిశవమును బంధువులందఱును దహనముఁ గావించిరి.





## 30. — మహాశీలవ జాతకము. —

బ్రహ్మదత్తుఁడు వారాణసిం బాలించుచున్న సమయమున బోధిసత్త్వుఁడు నరలోకంబున బ్రహ్మదత్తుని పట్టమహిషి గర్భంబున నవతరించెను. నామకరణ దివసంబున నాతనికి సుశీలకుమారుండను పేరిడిరి. పదునాఱుసంవత్సరముల ప్రాయమునాటి కాతఁడు విద్యలెల్ల నేర్చెను. పితృమరణానంతరమున రాజ్యమునకువచ్చి సుశీలరాజను నామంబును వడసి ధర్మపరిపాలనంబుఁ గావించుచుండెను. పురద్వారములు నాల్గింటికడను, పురమధ్యంబునను, నిజప్రాసాదద్వారంబుకడను, భిక్షాదానగృహంబుల నిర్మించి వానియందు బాటసారులకును, బీదలకును, భిక్షాదానము సల్పుచు పంచనియమములను బాటించుచుండెను. విధులఁ బాలించుచు నుపవాసదినముల నుపవాసములు సల్పుచు శమదమాది సద్గుణ పరిపూర్ణుండై రాజ్యముధర్మంబునఁ బాలించుచు సర్వప్రాణులను గన్నబిడ్డలపోల్కిఁ బ్రోచుచుండెను.

అమాత్యులలో నొకఁడు రాజాంతఃపురంబున ద్రోహంబుఁ గావింప నది జనులలో వ్యాపించెను. ఇతరామాత్యులా వృత్తాంతమును రాజున కెఱింగించిరి. రాజుస్వయముగ నావిషయమును బరిశోధింప మంత్రియపరాధము వ్యక్తమయ్యెను. అప్పుడాయపరాధిని రప్పించి రాజు "ఓయీ! మదాంధా! నీవుపాపివి. కాన నారాజ్యమున నుండఁదగవు. నీదారాపుత్త్రమిత్త్రములతో నారాజ్యమును విడిచిపొమ్ము" అని దేశమునుండి యాతనివెడలఁగొట్టెను. దేశబహిష్కృతుండై యాతఁడు కోసలరాజ సేవకుండై క్రమముగనారాజుకడ నాప్తపదంబును బొందెను. ఇట్లుండ నొకనాడా మంత్రికోసలరాజుతో "దేవా! వారాణసీరాజ్యము మక్షికా దూషితంబుకాని ఘనమధుకోశంబుభాతి నున్నయది. రాజుమిగులదుర్బలుఁడు కొద్ది

"సేనతోనైన నా రాజ్యమును జయింపవచ్చును", అని చెప్పెను. అప్పుడు వారాణసీరాజ్య వైశాల్యమును, మంత్రి తనకుఁ జేసిన యుపదేశంబును, లెస్సఁగ నాలోచించి యాతఁడు తనరహస్య భేదముఁ గావించుట కారాజుచే నియోగింపఁబడిన భృతిభుజుఁడని యనుమానించి వానితో "ఓరీ! ద్రోహి! ఇట్లొనరించుటకు నీవు భృతినీయఁబడితివి" అనియనెను. అంత నాతఁడు "నిజముగ నేనట్టివాఁడనుగాను. యథార్థమును బల్కుచున్నాఁడను. నన్ను దామనుమానించినచో మాంతకులఁ దద్దేశప్రాంతములకు నరహత్యఁ గావించుటకుఁ బంపి యారాజు తనకుఁ బట్టువడిన వారలకుపహారంబుల నొసఁగి స్వేచ్ఛ నవిడుచునో లేదో పరిశీలింపుఁడు" అని బదులు పల్కెను.

"ఈతఁడు ధైర్యముగఁ బూర్వపక్షముఁ జేయుచున్నాఁడు, ఈతని యుపదేశముఁ గాలవిలంబన లేకుండఁగనే పరిశోధించెదను". అని రాజు తలంచెను.

పిమ్మట నారాజు ఖలులగు కొందఱు సేవకుల వారాణసీప్రాంత గ్రామములను బాధించుటకుఁ బంపెను. రాజసేవకులా మ్రుచ్చులం బట్టుకొని రాజునొద్దకుఁ గొనివచ్చిరి. రాజు వారలం జూచి "బిడ్డలారా! నాజనుల నేలఁ జంపితిరి?" అనియడిగెను. "జీవనోపాధి సంపాదింపలేక యిట్లుచేసితి"మని వారు బదులుపల్కిరి. "అట్లైనచో నాకడ కేలరారైరి? ఇట్టి పాపములు నిఁక మీఁదఁ జేయకుఁడు" అని రాజు వారలతోఁ జెప్పెను పిమ్మట రాజు వారలకుపహారంబులనిచ్చి పంపివేసెను. కోసలరాజునొద్దకుఁ దిరుగ వారు వచ్చి జరిగిన వృత్తాంతమంతయు నాతనితోఁ జెప్పిరి. కాని యీనిదర్శనము కోసలరాజును యుద్ధమునకుఁ బురికొల్పదాయెను. పిమ్మటఁ గోసలరాజు వారాణసీరాజ్య మధ్యస్థగ్రామములఁ బీడించుటకు మరల ఖలసమూహములను బంపెను. వారలనుగూడ సుశీలుఁడుపహారంబులనిచ్చి పంపివేసెను. కాని యిదియుఁగూడ వారాణసీరాజ్య దౌర్బల్య



ప్రదర్శకంబు కాదాయెను. కోసలరాజు మూఁడవసారికూడ ఖలబృందమును వారాణసీవీధులఁ గొల్లగొట్టుటకుఁ బంపెను. తొల్లింటివలెనే యారాజుయొక్క సౌశీల్యము స్పష్టమగుటచేఁ గోసలపతి వారాణసీరాజ్యమును జయించుటకు సేనలతోడను, గజములతోడను దాడి వెడలెను.

వారాణసీరాజు పోషకవర్గంబున మత్తగజమునైన నెదురించు ప్రజ్ఞకలిగి, వృత్రఘ్నప్రసర్పితవజ్రంబునైన సరకుఁగొనక యుండునట్టి యనుపమానదుర్జయవీరసహస్రంబు రాజాజ్ఞచే భరతవర్షంబునెల్ల సుశీలునకు వశముఁగావింప సంసిద్ధమైయుండెను. వారాణసీ దేశమును జయింపఁబూని కోసలరాజు వచ్చుచున్నాఁడనివిని యావీరులు తమసార్వభౌమున కావృత్తాంతమును నివేదించి, వైరి నెదుర్కొనుట కనుజ్ఞనొసఁగుమని తమయేలికను వేడికొననెంచి, "సార్వభౌమా! మనరాజ్యప్రాంతముల దాఁటకమున్నె వానిఁ బరాభూతునిఁగావించి బంధీకృతునిం జేసెదము" అని వేడికొనిరి. అపుడా రాజు "బిడ్డలారా! అట్లుచేయరాదు. నావలన నితరులు బాధఁబొందరాదు. రాజ్యకాంక్షగలవారు నారాజ్యమునైన నాక్రమించుకొననిండు", అనిచెప్పుచు నారాజు వైరి నెదుర్కొనుటకు వారలకనుజ్ఞనీయఁడయ్యెను

కోసలరాజంతలో రాజ్యమధ్యమును జేరెను. మఱియొకసారి యమాత్యులు రాజును వేడికొనిరి. కాని రాజు వారి ప్రార్థనల కియ్యకొనఁడయ్యెను. కోసలరాజు పట్టణబహిర్భాగమును జేరి రాజ్యము దనకుఁ గైవసమొనరఁ గావింపవలయుననియు, లేకున్న సమరమునైన సల్పవలయుననియు, సుశీలునకుఁ గబురిడెను. "నేను సమరముఁ జేయను. కావలయునన్న నారాజ్యమును గైవసముఁ గావించుకొననిమ్ము" అని సుశీలుఁడు రాయబారికిఁ బ్రత్యుత్తర మొసఁగెను.

మూఁడవసారి మంత్రులుతమరాజునొద్దకుఁజని "కోసలరాజు పురప్రవేశము సేయకుండగనే పరాజితునిఁగావించి, బంధీకృతునిఁ గావింతుము. అందులకు మాకునాజ్ఞ యొసంగుఁడు", అనిరాజును వేడికొనిరి. అందుల కియ్యకొనక రాజు పురద్వారంబులఁ దెరువ నాజ్ఞాపించి, సహామాత్యపరివృతుఁడై సింహాసనంబున నుపవిష్టుఁడై యుండెను.

పురముం బ్రవేశించి దుర్గావరోధనమును గావించువార లెవ్వరును గాన్పింపకుండుటచేఁ గోసలరాజు తనసైన్యముతో రాజనగరునకుం జనెను. తలుపులు తెరువఁబడియేయుండెను. విభాసమాన సింహాసనంబున సుశీలసార్వభౌముఁడు సహామాత్య పరివృతుఁడై సుఖోపవిష్టుండై యుండెను. కోసలపతి వారలఁజూచి తనపరివారముతో "వారలనందఱఁ బట్టుకొనుఁడు. హస్తములఁబురోభాగమున బంధించి శ్మశానవాటికకుం గొంపొండు. అట గోతులఁద్రవ్వి యాగోతులలో జీవములతో వారలను గంఠములవఱకుఁ బాతిపెట్టుఁడు. నిశాసమయంబున వారలకు శృగాలములు సమాధులు సమకూర్పఁగలవు" అనియాజ్ఞాపించెను. ఖలుఁడగు కోసలనరపతి యాజ్ఞననుసరించి యతనిభృత్యులు వారాణసీనరపతి నమాత్యులతోఁగూడ బంధించి తోడ్కొనిపోయిరి. అప్పుడైనను వారలపైనాతఁడు కొంచెమైనఁ గోపింపఁడయ్యెను. బంధనంబులతో వధ్యస్థానంబునకుఁగొంపోఁబడుచున్న సమయమునందైనను నమాత్యులలో నొక్కఁడును రాజాజ్ఞనుల్లంఘింపఁడయ్యెను. సుశీలుని నీక్రమముగ శిక్షించిరి.

ఇరువురు భృత్యులు సుశీలున కిరుపార్శ్వముల నిలువఁబడి శ్మశానవాటికకాతనిం గొంపోయి, యొకగోతిలోఁ గంఠమువఱకుఁ బూడ్చివచ్చిరి. నిరహంకారుఁడైన సుశీలుఁడు తనయపకారిపైఁ గినియక సంతసంబున ననుచరులతో "ప్రేమదయా పరిపూర్ణమానసులై యుండుఁడు" అనిచెప్పెను.



నిశాసమయంబున శృగాలములు మానవమాంస భోజనలుబ్ధములై గుంపులుగూడి తండోపతండములుగ రాసాగెను. వానిని జూచి రాజును, తత్పరిజనమును బెద్దనినదముం గావించిరి. అవివిని యవి పర్విడెను. అట్లు కొంతదూరమువఱకునుం బర్విడి యటనాగి వెనుకకుంజూచి తమగుంపు నెవ్వరు ననుసరింపకుండుటచే నవిమరలి వచ్చెను. రెండవనినదము మరలవానిం బారఁద్రోలెను. కానియవి మునుపటివలెనే వచ్చెను. మూఁడవసారికూఁడ దమ్ము నెవ్వరు ననువర్తింపకపోవుటచే శృగాలములు "వీరలు మరణశిక్షాదండితులై యుండవలయును" అని చింతించి ధైర్యముతోవచ్చుచుండ వారు మరల ఘోరనినాదముఁ గావించిరి. కాని యవి కదలలేదు. పిమ్మట నవి తమలో 'శృగాలరాజు సార్వభౌముని దక్కనవి తదితరులను' అని యీరీతిగ నన్నియుఁదమతమ యామిషంబుల నిరూపించుకొని వానిసమీపింపఁజొచ్చెను. ఉపాయశీలుఁడగు రాజు నక్కల రేదునమీపించుటచూచి వానినోటికి, దనయా దలనందించుటకో యనునట్లు కంఠంబునెత్తి శృగాలకంఠంబును గట్టిగదంతంబులతోఁ గఱచిపట్టుకొనియెను. రాజుపట్టినపట్టు దృఢమైనదగుటచేఁ దనకంఠంబును విడిపించుకొనఁజాలక యాశృగాలరాజు పట్టువడితిననితలంచి ఘనాక్రందనంబొనర్చెను. పిమ్మట నవి తమతమయామిషంబుల సమీపింపనొల్లక జీవితాశచేఁ బలాయనముఁ గావించెను.

పట్టువడిన యాశృగాలము రాజు దంతంబులనుండి తప్పించుకొనుట కన్నివైపులం బర్విడి రాజునుబూడ్చినమట్టినిటునటు పెదఁజల్లెను. పిమ్మట రాజు శృగాలంబును విడనాడి, తనయావచ్ఛక్తి నుపయోగించి, యొకప్రక్కనుండి యింకొకప్రక్కకుఁ దిరిగి తన హస్తముల బంధనమునుండి తప్పించుకొనెను. తన్నుఁబూడ్చినగోతి ప్రక్కల నాసఁకొని రాజుప్రవాతంబు నెదుటఁబర్వాలిను జలదంబుభాతి నాగోతినుండి వెడలివచ్చెను. మిత్రులు నిర్భయమనస్కులగు

నటుల ప్రోత్సాహంబుగ మాటలాడి వారిని గోతులనుండి తప్పించి వారితోఁగూడ శ్మశానవాటికనుండి వెడలిపోయెను.

శ్మశానవాటికయందు వారుండిన భాగమున రాక్షసద్వయాశ్రితప్రదేశోత్సంగమున నొకశవము చేర్చఁబడి యుండెను. ఆపిశాచద్వయము శవమాంసవిభాగమునకై వివదించుచు నొకటి మఱియొకదానితో "మనమీ విభాగముఁ గావించుకొన నేరము. ఈసుశీలరాజు న్యాయవంతుఁడు. మనకొఱకీవిభాగమును గావించును వానియొద్దకుఁ బోదము" అనుచు నాశవమును గాలుపట్టియీడ్చుకొని రాజునొద్దకేగి యిట్లనెను "ఓప్రభూ! యీశవమును విభజించి మాయిరువురకు సమముగఁ బంపకము సేయుము", అనినతోడనే రాజు, "ఓమిత్రులారా! అట్లే నిశ్చయముగఁ గావించెదను. కాని నా దేహమంతయుఁ బురదతో నిండియున్నది. ప్రథమమున మజ్జనముఁ గావించుకొనవలయును" అనెను. అంతనాపిశాచములు రాజ్యాక్రాంతుని స్నానముకొఱకు సిద్ధముఁ గావింపఁబడిన పరిమళోదకములఁ దమమంత్రబలముచే నచిరకాలంబునఁ దెచ్చి రాజునకుసమర్పించెను. స్నానానంతరమున శత్రుర్థముంచఁబడిన వసనంబులఁ దెచ్చి పిశాచములొసఁగిన నాతఁడు వానినిధరించెను. తరువాత నాపిశాచములు చతుర్విధసౌరభపేటికను దెచ్చి రాజునకొసఁగెను. రాజు గంధలేపనముఁ గావింప నానావిధపుష్పయుక్తములైన మణిమయవ్యజనంబులుంచఁబడిన సువర్ణపేటికం దెచ్చియర్పించిరి.

పిమ్మట నాపిశాచములు రాజుకడకేఁగి "దేవా! యేమియాజ్ఞ" యని యడిగెను. అంతరాజు తనక్షుద్బాధ నెఱిఁగింప నాపిశాచములు రాజ్యాక్రాంతుని భోజనముకొఱకుంచఁబడిన స్వాదుపదార్థములంగొనివచ్చెను. రాజుమజ్జనముఁగావించి, వసనంబులధరించి గంధంబుఁ బూసికొని, స్వాదుపదార్థంబుల భుజియించెను. అప్పు డాపిశాచములు రాజ్యాక్రాంతుని సురభిపానీయయుక్తకనకకల



శంబును సువర్ణపానభాజనంబునుఁ దెచ్చియిచ్చెను. పానీయంబుల ద్రావి ముఖహస్తప్రక్షాళనంబుఁ గావించినపిదప సుగంధితాంబూలంబు సమర్పించి యాపిశాచంబులు రాజాజ్ఞమేద్దియైనఁ గలదా యనియడుగ నాతఁడిట్లనెను. "మీమంత్రబలంబున రాజ్యాక్రాంతుని దిండు ప్రక్కనున్న రాజకరవాలంబును గొనితెండని" యాజ్ఞాపించెను. తక్షణమే పిశాచములా ఖడ్గంబును గొనితెచ్చి రాజునకొసంగెను. రాజు శవమును నిలువఁబెట్టి పృష్ఠభాగంబునకుఁ గ్రిందుగ సమముగు రెండుతునియలు చేసి యారెండు పిశాచములకు నొసఁగెను. తరువాత ఖడ్గమును గడిగి పదిలపఱచుకొనెను.

పిశాచంబులు తుష్టిగ భోజనంబుఁ గావించి సంతుష్టమానసములై రాజునొద్దకేఁగి "దేవా! యేమి సెలవ" యని యడిగెను. "మీమంత్రబలముచే రాజ్యాపహారిగృహమున నన్నుంచుఁడు. నాయమాత్యులను వారివారి గృహములం దుంచుఁడు" అని రాజువారి కాజ్ఞాపించెను. "ప్రభూ! అటులనే గావించెదము" అనుచు నాపిశాచములు రాజాజ్ఞనిర్వర్తించెను. ఆసమయమున రాజ్యాపహారిసుశీలుని గృహంబున జనపాలశయ్యపై నిదురించుచుండెను. వాఁడుస్వస్థతతో నిదురించుచుండ నీసుశీలుఁడుఖడ్గముపృష్ఠంబులతోఁగొట్టెను. వాఁడత్యధికముగ భీతుఁడై మేల్కాంచి రాజ్యాపహారిదీపపువెలుఁగున సుశీలరాజుంగనెను. ఎట్లో ధైర్యము చిక్కఁబట్టి శయ్యపైనుండిలేచి వానితోనిట్లనెను. "రాజా! ఇది నిశాసమయము. రక్షకభటులు జాగరూకులై కావలి యిచ్చుచున్నారు. కవాటములు బంధింపబడి యున్నవి. ఇందెవరికిం బ్రవేశింప శక్యము కాదు. అట్లుండ నీవు సుప్రకాశములగు వస్త్రములధరియించి కరవాలంబుఁ జేఁబూని యెట్లు నాశయ్యాసమీపమునకు రాఁగలిగితివి" అనిన సుశీలుఁడు సమగ్రముగ జరిగినదంతయుఁ జెప్పినదమాయుక్తుఁడై యాశ్చర్యముతో నాతఁడిట్లనెను "ఓరాజా! నేనుమానుష హృదయయుక్తుఁడనయ్యు

నీసుగుణములను గ్రహింపఁజాలనైతిని. కాని యాజ్ఞానము మాంసరుధిరభక్షణంబు సేయు పిశాచములకుఁ గల్గినది. ఇప్పటినుండియు నీవంటి సుగుణరాశిపై నెట్టికుట్రలం బన్నను” అని వాక్రుచ్చి కరవాలంబుపై స్నేహప్రతిజ్ఞఁ బూని తన్ను క్షమింపుమని వేడికొనెను. పిమ్మట సుశీలుని రాజశయ్యపైఁ బరుండఁబెట్టి తానొకచిన్న సెజ్జపైఁ బరుండెను.

మఱునాడు సూర్యోదయమైనపిదప రాజ్యాపహారి అనకప్రాకారంబున సేనపతివారమునెల్ల రావించి వారియెదుట సుశీలుని వేసికొని, యతనిరాజ్యంబు నాతనికర్పించి “ఇప్పటినుండియు రాజద్రోహుల దండించుట నాపని. నేను రక్షకుఁడనై యుండఁగ నీరాజ్యంబు నీవు పాలింపుము” అని యాతనితోఁ జెప్పెను. పిమ్మట పిశునుఁడును రాజద్రోహియు నగు నామంత్రికి మరణదండన విధించి, తన యేనుఁగులతోడను, సేనలతోడను నిజరాజ్యంబునకుఁ జనెను.

అనూనప్రభతో రాజు సామ్రాజ్యశ్వేతాతపత్రముక్రింద సువర్ణమయమై, మృగజంఘువులవంటి కాళ్లుగల సింహాసనము నధిరోహించి సుశీలుఁడు తనయశస్సునుగూర్చి యిట్లు చింతించెను. “నేను దీర్ఘోద్యమంబుఁ గావింపకున్న నీశోభననుభవింపకయే యుందును. నా సహస్రామాత్యులుగూడ జీవింపకయే యుందురు. ఈదీర్ఘోద్యమంబుననే నేను నష్టరాజ్యశ్రీసంపాదనఁ గావించి, నా సహస్రామాత్యులను రక్షించితిని” అనియనుకొనెను. కాన స్థిరచిత్తులమై మనమెల్లెడల నెడతెగక పాటుపడుచుండవలయును.





— అసాతమంత జాతకము. —

మున్ను బ్రహ్మదత్తుఁడు వారాణసిని బరిపాలించునపుడు బోధిసత్త్వుఁడు గాంధారదేశమునందలి తక్షశిలానగరంబున బ్రాహ్మణుఁడై జనించెను. అతఁడు యౌవనవంతుఁ డగునప్పటికి వేదత్రయంబునను, సకలకళలయందును పారంగతుఁడగుటచే మహదాచార్యుఁడని లోకంబునఁ గీర్తిఁగాంచెను.

ఆకాలమున వారాణసియందు బ్రాహ్మణదంపతులుండిరి. వారికొక పుత్రుఁడుండెను. ఆపుత్రుని జననకాలమున నగ్నిని నిలకొల్పి వానికిఁ బదునాఱువత్సరములు వచ్చువఱకు నాయగ్ని విచ్ఛిన్నము కాకుండఁ గాపాడిరి. బాలుఁడు షోడశవర్షీయుఁడైన పిమ్మట నాతని పితరులు “నాయనా! నీజననసమయమున నీ యగ్నిని నిలకొలిపి నీకుఁ బదునాఱువత్సరములు వచ్చువఱకు నవిచ్ఛిన్నముగఁ గాపాడితిమి. ఇంక నీభవిష్యజ్జీవనరీతిని నిర్ణయించుకొనుము. బ్రహ్మలోకసంపాదన నిచ్ఛగింతువేని యగ్నిం గైకొని విపినంబులకేగి నిరంతరము నగ్నిసంతర్పణంబును, దేవపూజలను, సల్పుచు నభీష్టమనోరథంబులఁ బొందుము. అటుగాక సంసారసుఖములఁ గోరినఁ దక్షశిలానగరంబునకుం బోయి జగద్విఖ్యాతిఁగాంచిన గురువునొద్ద జ్ఞానసంపాదనఁ గావింపుము” అని చెప్పిరి. అంతనాతఁడు “నిశ్చయముగ నగ్నికార్యము దేవార్చనయు నేను సమగ్రముగఁ జేయఁజాలను. కాన నేను గృహస్థుండ నయ్యెదను” అని ప్రత్యుత్తరమిచ్చెను. పిమ్మట నాతఁడు జననీజనకులయొద్ద సెలవు గైకొని గురుదక్షిణార్థము సహస్ర టంకంబులతోఁ దక్షశిలానగరమునకుంజనెను. అచట లెస్సగ శిక్షఁబొంది గృహోన్ముఖుఁడయ్యెను.

వానితలిదండ్రులు వానిచే నాగ్నేయపూజ చేయించుచుం డిరి. వానిని గాంధారమున కేగుమనియు, సందతనికి వాంఛవృద్ధి

బొందింపఁ బ్రోద్బలించుచుండిరి. పుత్రుని సంసార పరిత్యాగము నత్యంతము గోరుచున్న జనని, స్త్రీజనదుష్టత్వమాతని మనమున నాటు నట్లుచేసిన వాఁడు సంసారవిముఖుఁ డగునని నమ్మి, యాచార్యుఁడు వానికట్టిజ్ఞానంబే యిచ్చియుండునను నమ్మకముతోఁ "విద్యాభ్యాసము సంపూర్ణమైనదా" అనిప్రశ్నించెను. ఆ! పూర్తియైనదని వాఁడు నుడివెను. అట్లయిన నీవుదుఃఖశాస్త్రాభ్యాసము గావింపలేదు గదా యని జననియడిగెను. "నేనువానిఁ జదువలేదు" అనిపుత్రుఁడు చెప్పెను. "అట్లయిన విద్యసమాప్తియైనదని యెట్లుచెప్పఁగలవు; మరల నీగురువునొద్దకుంజని వానినభ్యసించి యింటికిరమ్ము" అని జననిచెప్పెను. అట్లేచేసెదనని చెప్పి యాతఁడు తక్కశిలానగరంబునకుం జనెను.

ఆచార్యునకుఁగూడ నూటయిరువదిసంవత్సరముల వయస్సుగల తల్లి జీవించియుండెను. ఆమెకు స్నానభోజనాదికృత్యముల నాతఁడే స్వయముగఁ జేయించుచుండెను. అట్లాతఁడు చేయుటచేఁ బ్రతివాసులాతనిఁజూచి పరిహసించుచుండిరి. అక్కతంబున నాతఁడు విపినంబునకుఁజని జననితోఁగూడ వనవాసముసేయుటకు నిశ్చయించుకొనెను. పిమ్మట నాతఁడు నిర్మానుష్యప్రదేశమునందు జలసమృద్ధిగల యొకరమ్యంపు చోటఁ గుటీరంబొకటి నిర్మించి, దానియందు ఘృతతండులాదివస్తువులనుంచి, తనముదుసలితల్లి నటకుంగొంపోయి యత్యంతభక్తిప్రేమ పురస్సరంబుగ శుశ్రూషఁ గావించుచుండెను.

తక్కశిలానగరంబున గురువుం గానక బ్రాహ్మణ యువకుఁడు వానిని వెదకి వెదకి తుదకు వానియుదంతం బంతయుఁ దెలిసికొని యావిపినంబునకేగి వినయముతో నాచార్యుని దర్శించెను. పిమ్మట వారిరువురు నిట్లు సంభాషించిరి.

గురువు:- బాలకా! యేల యింతత్వరితముగ వచ్చితివి?



బాలుఁడు:- గురూ! తమయొద్దదుఃఖశాస్త్రము నేనభ్యసించితినని దలఁపను.

గురువు:- నీవింకను దుఃఖశాస్త్రమును జదువవలసియున్నదని నీ కెవ్వరు చెప్పిరి?

బాలుఁడు:- మన్మాత చెప్పినది.

అదివిని బోధిసత్త్వుఁడు దుఃఖశాస్త్రంబను నదేదియులేకుండుటచేఁ గుమారుఁడు స్త్రీలదుష్టత్వము దెలిసికొనుటయే తల్లికోరికయని గ్రహించెను. పిమ్మట నాచార్యుఁడాతనితో "నీకు దుఃఖశాస్త్రబోధనంబుఁ గావించెదను," అనుచు "ఓయీ? యీదినము నుండియు నాజనని సేవయందు నీవునాస్థానమునాక్రమించియామెకు నీ చేతులతోనే మజ్జన భోజనాదులఁ గావించి పరిచర్య యొనర్పుము, ఆమె హస్తపాదశిరః పృష్ఠభాగంబుల బరిమార్జనంబుఁ గావించునప్పుడు 'అహా! తల్లీ! ఇంత ముదుసలితనమున నింత సౌందర్యవతివై యుండ నీయౌవనాతిశయమున నెట్లుండియుంటివో కద!' అనిచెప్పుచుండవలయును. ఆమెహస్తపాదంబులఁ బ్రక్షాళనంబుఁగావించి, గంధలేపనంబుఁ గావించునపుడు, ఆమెసౌందర్యమును మిగుల శ్లాఘింపుము. మఱియు నాజనని నీకుఁజెప్పు ప్రతివచనంబును నాతో నేమఱక చెప్పుచుండుము. ఈనాయాజ్ఞల ననుసరించి వర్తించిన నీవు దుఃఖశాస్త్రపారీణుఁడ వగుదువు. నాయాజ్ఞోల్లంఘనముఁ గావించినఁ దచ్ఛాస్త్రజ్ఞానరహితుఁడవై యుందువు" అనియెను.

యువకుఁడు గుర్వాజ్ఞానుసారముగఁ జేయుచు నెల్లప్పుడునామె సౌందర్యమును బొగడుచునుండ వాఁడుతన్ను మోహించెనని యామె యనుకొనెను. అంధురాలును జరాజీర్ణాతురాలు నయ్యును నామెకుఁ గామముద్రేకించెను. ఒకనాఁడామె వానిపొగడ్తల కడ్డుపడి "ఓయీ! నన్ను వరించుచుంటివా?" అని యనెను. "ఔను నీయం

దు బద్ధానురాగుఁడనైతిని. కాని నాయాచార్యుఁడ నతిక్రమణీయుఁడు" అనివాఁడు ప్రత్యుత్తరమిచ్చెను.

ముదుసలి:- ఓయీ! నీవు ననుఁగోరిన నాపుత్రునిఁ జంపుము.

యువకుఁడు:- నాకు నిరుపమాన జ్ఞానావబోధనంబుఁ గావించిన యాచార్యునిఁ గామాంధుఁడనై యెట్లు చంపఁగలను?

ముదుసలి:- నీవు నాయందు దృఢానురాగము కలవాఁడ వైనచో నేనాతనిఁ జంపెదను.

పిమ్మట బ్రాహ్మణ యువకుఁడు బోధిసత్త్వున కిదియంతయు నివేదించెను. అందులకు వానిం బొగడి శేషంబగు మాతృజీవన కాలంబుఁ దెలిసికొనెను. ఆనాఁ డామెకు మృత్యువు విధింపఁబడినదని గుర్తెఱిఁగి "బ్రాహ్మణయువకుఁడా! రమ్ము, ఆమె నీదినమునఁ బరీక్షించెదను" అనిచెప్పెను. అంతబోధిసత్త్వుఁ డొక యంజీరతరువును నఱికి దనపరిమాణమున నొక సాలభంజికను నిర్మించెను. పిమ్మట నాబొమ్మ నొక తాఁడుకట్టి బట్టలఁ జుట్టఁ బెట్టి, తనశయ్యపైఁ బరుండఁ బెట్టెను. "ఈపరశుతో నాజననియొద్దకుం జని యీసూత్రము నామె మార్గాదేశార్థమిమ్ము" అనియనెను.

ఆయువకుఁడు నట్లేపోయి ముదుసలితో నిట్లనెను. "అమ్మా! ఆచార్యుండింటిలో శయ్యపై నిదురించుచున్నాఁడు. నీకుమార్గము తెలియుటకై యీసూత్రముం గట్టితిని. ఈపరశువుం గొంపోయి వానిని జంపఁగలిగినఁ జంపుము," అనెను. "నీవు నన్ను బరిత్యజింపవుగదా?" అని యామెయడిగెను. "ఎందులకు నేనట్లు కావింపవలయును?" అనివాఁ డుత్తరమిచ్చెను. పిమ్మట నామె కంపితహస్తయై పరశువుం గ్రహించి తడుముకొనుచుఁ బోయి, పుత్రుని స్పృశించి కంఠముపైనుండు వస్త్రంబులఁ దొలఁగించి, యొకవ్రేటున పుత్రశిరః కర్తనంబుఁ గావించుటకై పరశువుతో సాలభంజికకంఠంబుపైనఁ బొక



కఠోరముగ ధ్వనియయ్యెను. దానఁదనదితమునిర్మాణంబని యూహ్యగ్రహించెను. "జననీ! యేమిచేయుచున్నావు" అని బోధిసత్త్వుఁడడిగెను. "అయ్యో! నేను వంచింపఁబడితిని" అని పెద్దపెట్టున నేడ్చుచు గ్రిందఁ బడి మృతిఁజెందెను. ఆమె యాక్షణమున నాగృహంబున మృతిఁ జెందవలెనని విధివిధానమని పెద్దలు చెప్పుదురు.

నిజజననిగతాసువైనదని గ్రహించి యామెకు దహనకార్యంబుఁ గావించి, ప్రేతాగ్ని నార్పి, యాబూడిదను వన్యపుష్పంబులచే నలంకరించెను. పిమ్మట బ్రాహ్మణ యువకునితోఁ గూడఁ గుటీరద్వారంబునఁ గూరుచుండి "పుత్రకా! వేఱుదుఃఖశాస్త్రంబు లేదు. నాజనని దుష్టత్వంబును నీవు కన్నారఁ గాంచితివి. కానఁ దరుణులెట్టి దుష్టురాండ్రో యనునది నీకుఁ దెలియును," అని బోధించి యువకునింటికిఁ బొమ్మని చెప్పెను.

ఆచార్యునియొద్ద సెలవుఁగైకొని బ్రాహ్మణయువకుఁ డిలుచేరెను. "నీవుదుఃఖశాస్త్రమును జదివితివా?" అని వానితల్లి యడిగెను "ఆహా నేను నేర్చితిని" అని వాఁడుత్తరముఁ జెప్పెను. "బాలకా? నీవు పరిగ్రహింపఁబూనిన దెట్టిది? నీవగ్ని దేవార్చనార్థము సంసార పరిత్యాగమును గావించెదవా? లేక గృహస్థాశ్రమమున నుందువా" అని వానితల్లి యడిగెను. "నేనుగన్నులార యువతుల దుష్టత్వంబుఁ గాంచితిని. కావున సంసారంబు నొల్లను. సంసార పరిత్యాగముఁ గావించి పరివ్రాజకుండ నగుదును" అనివాఁడనెను. బ్రాహ్మణయువకుఁడు గృహస్థాశ్రమమును బ్రవేశింపక సన్న్యాసియై యీప్సితశాంతి సంపాదనగావించి జీవనాంతమున బ్రహ్మలోక ప్రవేశార్హత్వమును సంపాదించెను.



— 73. సచ్చంకిర జాతకము —

పూర్వకాలమున బ్రహ్మదత్తుఁడు వారాణసిని బాలించుచుండెను. వానికి దుష్టకుమారుండను పుత్త్రుండుండెను. దండతాడిత మహోరగంబు భాతినిర్దయుండును, క్రూరకర్ముండును నై పరుషవాక్యములుగాని, తాడనంబులుగాని లేకుండ వాఁడెవ్వనితోడను సంభాషింపఁడు. నయనంబున శర్కరంబురీతి, నున్మత్తపిశాచంబుభాతి, రాజగృహంబులనుండు వారలకును, దదితరులకును భీషణకర్ముండై యుండెను.

ఒకనాఁడు నదీతీరమునకుం గ్రీడసల్పుటకనల్ప పరివారసమేతుండై చనెను. అంతఁ బ్రచండవాతంబు సంఘటించి భూమి చీకట్లు గ్రమ్మెను. "ఓసేవకులారా! నన్ను నదీమధ్యంబునకుం గొంపోయి, మజ్జనంబుఁ గావించి దరికిం జేర్పుఁడు." అని సేవకులకాతఁడాజ్ఞాపించెను. అట్లే వారలాతని స్రవంతీమధ్యంబునకుం గొంపోయి "వీనినిచట నంతముఁ బొందించిన రాజు మనల నేమిచేయును? ఖలుండును బాపకర్ముండునగు నీతని నిటఁ దుదముట్టించెదము గాక" అని వారనుకొని "ఓరి కంటకా! యీనదీనీరంబుల మునుఁగుండవగుము." అని యనుచు నాతని నదిలోనికిఁ ద్రోసిరి. తటముం జేరునప్పటికి 'కుమారుండెచట నున్నాఁడని' సేవకులు వారలను బ్రశ్నింప 'మాకేమి తెలియును. అతఁడెచ్చటనుం గానుపింపఁడే. చండమారుతంబుఁ గని తటంబుఁ జేరి మాకంటెముందర పోయియుండును' అనినుడివిరి. రాజదర్శనంబునకుం బోవ "నాకుమారుండెచటనున్నాఁడు" అని వారల నాతఁడడిగెను. "మహారాజా! మాకేమి తెలియును; ప్రచండవాతంబు వీవఁ గుమారుండు మాకంటె ముందుగఁ జనియేయుండునను నమ్మకముతో మేముతిరిగి వచ్చితిమి" అని చెప్పిరి. తత్క్షణమే ప్రాసాదద్వారములు తెరచి నదియొద్దునకుం జని యదృశ్యుండైనయా రాజకుమారుని



కొఱకేతయు రాజు వెదకించెను కాని వానిజాడయేమియుం గానుపింపలేదు. ఆచండమారుత సమయమునఁ జీకటియైనపుడు కుమారుఁడు ప్రవాహవేగముచేఁ గొట్టుకొనిపోవుచుఁ దరుస్కంధంబు నొకదాని నధిష్ఠించి, నీరప్లవన భీతిచే నేడ్చుచుఁ బ్రవాహంబునఁ గొట్టుకొనిపోవుచుండెను

వారాణసియందు ధనికుండొకఁడు మృతిజెంది, నదీతటంబునఁ బాతిపెట్టిన నలువదికోట్ల టంకములయందలి యాశచే సర్పమై జనించి ధనమున్న ప్రదేశముననే వాసముచేయుచుండెను. మఱియు నింకొకఁడు ముప్పదికోట్ల ధనమునార్జించి మరణానంతరమున ధనకాంక్షచే మూషకంబై జనించి ధనమచ్చోటఁ బాతిపెట్టఁబడియుండుటచే నాప్రదేశముననె వసించుచుండెను. అంతజలము వానిబిలంబులఁ బ్రవేశింప నామార్గములనే యవియు బిలములనుండి బయటికి వచ్చి ప్రవాహంబునఁ గొట్టుకొనిపోవుచుఁ గుమారాశ్రిత తరుస్కంధంబుంగని రెండుకొనల నీరెండుజంతువులును మ్రానునకెగఁబ్రాకి పట్టుకొనియుండెను. ఆనదియొడ్డునందు శాల్మలీవృక్షంబునందు శుకశాబకంబొకటి యుండెను. వృక్షంబు ప్రవాహముచే నిర్మూలితంబగుడు శుకశాబకం బెగురఁబోయి వర్షతాడితంబై యావృక్షస్కంధంబుపైఁబడి దానింబట్టుకొని యుండెను. శుకశాబకంబును, సర్పంబును, మూషకంబును, కుమారుండును, నావృక్షస్కంధము నాశ్రయించుకొని ప్రవాహంబునఁ బోవుచుండిరి.

ఆకాలంబున బోధిసత్త్వుఁడు బ్రాహ్మణుండై వాయుదిక్ప్రదేశంబున జనించెను. సంప్రాప్తయౌవనుండై సంసారమును బరిత్యజించి మునివృత్తిని నదీతీరమునఁ బర్ణశాలను నిర్మించుకొని కాపురముండెను. అతఁడిటునటుఁ బచారుచేయుచు రాకొమరుని రోదనంబువిని యిట్లువితర్కించుకొనెను. "ఇట్టివానిని నావంటి దయాశీలుఁడు చూచి నశింప నీయరాదు. వానిని బ్రవాహమునుండి

సురక్షితముగఁ దెచ్చికాపాడెదను" అనియనుకొని "భయపడకుము, భయపడకుము," అని కేకలు వేయుచుఁ బ్రవాహమునఁ బ్రవేశించి నాగబలుండగుటచే, వృక్షస్కంధంబు నొడ్డునకుం దోసి రాజకుమారుని భూమిపై నిలువఁ బెట్టెను. పదపడి సర్పమూషక శుకశాబకంబులను గని పర్ణశాలకుం గొంపోయి దుర్బలంబులగుటచే వానిం మొదట నగ్నియొద్దఁ గాచి వాని చలితీరిన పిదపఁ గుమారుని చలిదీర్చికొనుట కగ్నియొద్ద నుంచెను. పిమ్మట నానాజాతిఫలంబులఁ దెచ్చి మొదట జంతువులకును, పిమ్మట రాజకుమారునకును, నిచ్చెను. అది చూచి కుమారుఁడు మిగులఁ గోపించి "ఈ శుంఠయగు సన్న్యాసి నా రాజజన్మమును లెక్కింపక జ్ఞానహీనములైన జంతువులకుఁ బ్రాముఖ్యము నొసంగుచున్నాఁడు" అని కుపితుఁడై బోధిసత్త్వునిపై ద్వేషముఁ బూనెను.

పిమ్మటఁ గొంతకాలమునకు వారలెప్పటివలె శక్తియుక్తులై ప్రవాహవేగంబు తగ్గినతోడనే సర్పము సన్న్యాసియొద్ద సెలవుఁ గైకొనుచు నిట్టులనియెను. "ఓతండ్రీ! నీవు నాకత్యంతోపకారంబు నొనర్చితివి. నీకు ధనమెప్పుడైనఁ గావలసిన యప్పుడు సాధనరాసులన్నియు నీవగును. నీవు నావాసస్థానము నొద్దకువచ్చి, "సర్పమా!" యనిన నీయీప్సితంబంతయు నెరవేర్చెదను. నేను బీదవాఁడను కాను. నలువదికోట్ల ధనమొకచోట దాచితిని" అని చెప్పెను. మూషకము కూడ నట్లే చెప్పెను. శుకశాబకంబుగూడ నిట్లు విన్నవించెను. "తండ్రీ! సువర్ణరజతంబులు నాకు లేవు. కాని నీవెప్పుడైన విశిష్టతండులంబులఁ గోరిన నావాసంబునకు వచ్చేసి, శుకమా! యనిన నా బంధువర్గంబుతో వచ్చి బండ్లకొలంది తండులంబులఁ దెచ్చి నీకు సమర్పించెదను." తరువాత రాజకుమారుఁడు కృతఘ్నుండగుటచే సన్న్యాసి యెప్పుడైనను గానుపించిన వానినంతంబుఁ బొందించెదనని కృతనిశ్చయుండై తననిశ్చయమును బ్రకటింపక "నేను రాజ్యాభిషిక్తుండనైనతరి నాదర్శనమునకు రమ్ము. నీకుఁ జతురీప్సితంబులఁ బ్రసాదించెదను," అని చెప్పుచు సెలవుఁ గైకొని చనెను. అచిరకాలంబున నేయాతఁడు రాజ్యాభిషిక్తుఁడయ్యెను.



వారి సత్యాసత్యంబులఁ దెలియఁగోరి బోధిసత్త్వుడు తొలుత సర్పబిలంబు నొద్దకుఁజని "సర్పమా!" యనిపిలిచెను. ఆమాటను విని సర్పము బిలంబు వెలువడివచ్చి యాతనినారాధించి "తండ్రీ! యీ ప్రదేశంబున నలువదికోట్ల ధనమున్నది. దానిందీసికొనుము" అనన్నాతఁడా ధనము నట విడిచి మూషక నివాసస్థానమునకుం జని "మూషకమా" అని పిలిచెను. మూషకంబును సర్పంబువలెఁ గావించెను. పిమ్మట నటనుండి బయలుదేరి శుకముండు చోటికిం జని "శుకమా!" యనిపిలిచెను. శుకంబును వానియామంత్రణంబు విని వృక్షమునుండి దిగివచ్చి "హిమాలయ ప్రాంతదేశంబులనుండి బంధువులతోఁ గూడఁ దండులసంగ్రహణంబుఁ గావింపవలయుననియా తమ యాజ్ఞ" అని యడిగెను. "అవసరముండిన మరువక చెప్పెదను లెమ్ము" అని చెప్పి రాజకుమార పరీక్షార్థమై చనెను. ఆతఁడును రాజోద్యానముం జేరి మరుచటిదినమున నిపుణతతో సువస్త్రంబుల ధరించి భిక్షార్థము పట్టణములోనికిం జనెను. అట్టియవసరంబునఁ గృతఘ్నుండగు నారాజు మిక్కిలి వైభవంబుతో నసంఖ్యాకపరివారజనంబుతోఁ గూడుకొని పట్టపుటేనుంగు నధిష్ఠించి పురమువెంటఁ బోవుచుండెను. దూరంబునుండియే రాజు బోధిసత్త్వునిఁ జూచి యిట్లు చింతించెను. "ఇదిగో యీ ఖలుండగు సన్న్యాసి విషయోపభోగములను దీర్చికొనుటకు వచ్చుచున్నాఁడు. వాఁడు నాకు నొనర్చిన యుపకారము ప్రజలకుఁ దెలియకమునుపే వీనిశిరంబును ఖండింపవలయును." అని యాలోచించుకొని దగ్గరనున్న పరిచారకులకు సైగచేసి "అదుగో, ఆసన్న్యాసి నన్నుఁ దనకోర్కులఁ దీర్పుమని ప్రార్థింపవచ్చుచున్నాఁడు. ఆకంటకునిఁ బట్టి బంధించి ప్రతివీథిమూలలను గొట్టి పుర బాహ్యప్రదేశంబున వధ్యస్థానంబున శిరచ్ఛేదంబుఁ గావించి శూలారోహణంబుఁ గావింపుఁడు" అని యాజ్ఞాపించెను.

రాజాజ్ఞానువర్తులై సేవకులు మహాత్ముని పాశంబుల బంధించి వధ్యస్థానంబునకుం గొంపోవుచు మార్గమున నన్నివీథిముఖలలయందును గొట్టనారంభించిరి. కానివారితాండవంబు లెంతమిక్కుటములైనను బోధిసత్త్వుఁడు మాత్రము "ఓజననీ! జనకా!" అనియైన నేడ్వండాయెను. కాని యీతఁడీరీతిని నుడువుచుండెను. "ప్రవాహంబునుండి ఖలులగువారలను రక్షించుటకంటె తరుఖండసంరక్షణంబు మేలు' అని నుడివినవారలు నిశ్చయముగఁ బ్రపంచజ్ఞానముఁగలవారలు."

ఈరీతిగఁ దన్నుఁగొట్టిన యన్నిచోటులను నుడువుటచేఁ గొంత మందిబుద్ధిమంతులుసన్న్యాసినిసమీపించి "అయ్యా! తాముమారాజునకొనరించిన మేలేవి?" అని యడిగిరి. బోధిసత్త్వుఁడు నిజవృత్తాంతమంతయు వారల కెఱిగించి యిట్లులనెను. "నాకీకష్టమంతయు వానిని ప్రవంతినుండి రక్షించుటవలన సంభవించినది. నేను పెద్దలయొక్క జ్ఞానవచనంబుల లెక్కింపక నిరాకరించితినని తెలిసికొనుటచే మీరు వినుటకై యీపదముఁ బాడుచుంటిని," అనిచెప్పెను.

ఈకథయంతయువిని బ్రాహ్మణక్షత్రియ వైశ్య శూద్రాదులందఱును నైకకంఠ్యముగ నిట్లనిరి. "కృతఘ్నుండగు మనరాజు తనప్రాణరక్షణంబుఁ గావించిన యీసత్పురుషుని మేలైనను గణింపఁడు. ఇట్టిరాజువలన మనకేమి శ్రేయము. లోకోపప్లావకునిఁబట్టుఁడు" అని వారత్యంత కుపితులై యన్నివైపులనుండియు రాజుమీఁదికిఁ బోయి బాణశూలశిలాకాష్ఠాద్యాయుధములతో నేనుఁగుపై నూరేగుచుండఁగనె వానిఁజంపిరి. పిమ్మటబోధిసత్త్వునికిఁ బట్టముఁ గట్టిరి.

బోధిసత్త్వుఁడు ధర్మపరిపాలనముఁ జేయుచు నొకనాడు సర్పమూషక శుకంబులఁ బరీక్షింప నిచ్చగించి పరిజనసమేతుఁడై యటకేగెను. అచ్చట "సర్పమా!" యనిపిలుచునప్పటికి నాసర్పముబిలంబు



నుండి వెలువడివచ్చి సగౌరవంబుగ "ఓమహారాజా! యిదిగో ధనసంచయంబు, స్వీకరింప ననుగ్రహింపుము" అని ప్రత్యుత్తరమిచ్చెను. రాజానలువదికోట్ల బంగారునాణెములఁ బరిచారకులకు నొప్పగించి మూషక నివాసంబునకుంజని, 'మూషకమా!' యని పిలిచెను. మూషకంబు వెలుపలికివచ్చి నమస్కరించి తనముప్పదికోట్లను నిచ్చివేసెను. ఈధనమునుగూడ సేవకులకొప్పగించి శుకవాసంబునకుంజని "శుకమా" యని పిలిచెను. ఆరీతినే యాపక్షియుఁ జనుదెంచి రాజపాదంబులకుం బ్రణమిల్లి ప్రభ్వర్థముఁ దండుల సంచయంబు నొసర్పవలయునా తెలియఁజెప్పుమని ప్రార్థించెను.

రాజు:- "తండులావసరము వచ్చునప్పుడు నిన్ను శ్రమపెట్టుము. పోవుదము రమ్ము" అనినుడివి డెబ్బదికోట్లబంగారునాణెములతోడను, సర్పమూషకశుకంబులతోడను రాజు తిరిగి పట్టణంబునుజేరెను. అచ్చట నొకఘనప్రాసాదంబున, రాజనివాసంబగు నుపరిభాగంబున కాయనచని, ధనమును బొక్కసంబునఁ బెట్టించి, భద్రముగ నుండునటులఁ జేసెను. సర్పనివాసార్థమై యొకబంగారుగొట్టమును, మూషకనివాసంబునకు నొక స్ఫటికంపుఁ బెట్టియుఁ, జిలుకయునికికి బంగరుపంజరమును జేయించెను. ప్రతిదినంబునను, రాజాజ్ఞచే నీజంతుత్రయమునకు బంగారుపాత్రలయందు స్వాదూచ్ఛషిత ధాన్యంబును, మూషకంబునకు సుగంధితాన్నమును, బెట్టుచుండిరి. దానంబులను, తదితర సుకృతంబులను విరామములేక యారాజు చేయుచుండెను. ఆటులవారు నలువురు సన్న్యాస సుహృద్భావంబునను, నైకమత్యమునను జీవనంబులు వెళ్ళఁబుచ్చి యంతమున వారివారి కర్మలఫలముల ననుభవించుటకుఁజనిరి.

## — ౮౦. భీమసేన జాతకము —

పూర్వము బ్రహ్మదత్తుఁడు వారాణసిని బరిపాలించుచున్న సమయమున నుత్తరదేశముయొక్క ముఖ్యపట్టణమున బోధిసత్త్వుఁడు జనించెను. ఆతఁడు యుక్తవయస్కుఁడయి తక్షశిలానగరమున కేగి, జగద్విఖ్యాతుండగు గురువునొద్ద మూఁడువేదములను, బదునెనిమిది శాస్త్రములను బఠించి, విద్యాభ్యాసముఁ బరిసమాప్తిఁ జేసెను. ఆతఁడు విద్వాంసుఁడగు 'నల్పధనుర్ధరుఁడ'ను నామమును బడసెను. పిమ్మట నాతఁడు తక్షశిలానగరమును వదలి, వ్యవహారానుభవమునకై యాంధ్రదేశమున కేగెను. ఈ జన్మమున బోధిసత్త్వుఁడు వామనుఁడై యుండుటచే నిట్లు చింతించెను. "నేనా రాజుం దర్శించిన నీవంటి వామనునివలన నేమిప్రయోజనమని యడుగుట నిశ్చయము. నేనందుల కొకవిశాలుండును, దీర్ఘదేహుండునగు నొక్కని గాంభీర్యద్యోతి విశేషవ్యక్తి [illegible]శ్రయంబుఁ గావించి చతురతతో జీవనోపాధి సంపాదింపవలయును" అని సాలివీధికిఁబోయి యచట మహాకాయుండగు భీమసేనుఁడను సాలివానింగని నమస్కరించి వానినామము నడిగెను. "నాపేరు భీమసేనుఁడు" అని యాతఁడుత్తరమిచ్చెను.

బోధిసత్త్వుఁడు:- నీయట్టి పుష్టాంగుఁడిట్టి వృత్తియందుండుట యేల?

భీమసేనుఁడు:- మఱియేవిధమునను జీవనోపాధి సంపాదింపజాలకుండుటచేత నేనీవృత్తి ననుసరించుచున్నాఁడను.

బోధి:- మఱియింక నేటమానుము. ఈ భూమండలమున నావంటి ధనుర్ధరుఁడు లేఁడు. నేను గుబ్బుఁడ, ఖర్వుఁడ, నగుటచే రాజులు నన్ను నిరసింతురు. నీవీ ధనుశ్శాస్త్ర ప్రావీణ్యమునుగూర్చి ప్రగల్భములఁ బలికిన రాజు నిన్నుఁ దనసేవకులలోఁ జేర్చుకొని, యీవృత్తియందు నీకెమరు లేకుండఁ జేయును. నేను



నీవెనుకనుండి రాజనియోగముల నిర్వర్తించుచుండువాఁడనై యుందును. ఇట్లు మనమిరువురము వృద్ధిఁబొందెదము. నీవు మాత్రము నేఁజెప్పినటులఁ జేయుము.

భీమ:- ఆ, అంగీకరించితిని.

ఈసమయము ననుసరించి బోధిసత్త్వుఁడా సాలివాని వారాణసికిఁ దీసికొనిపోయెను. భీమసేనుని బురస్కరించుకొని తత్సేవకునివలె వర్తించుచు, రాజప్రాసాద ద్వారమునొద్దకువచ్చినప్పటికి వారిరాక రాజునకుఁ దెలిసెను. పిమ్మట రాజానుజ్ఞాతులై, [illegible]మున కేగి నమస్కరించి నిలువఁబడిరి.

రాజు:- మీరిందుల కేకారణమువలన వచ్చినారు?

భీమసేనుఁడు:- నేను బాణప్రయోగకుశలుండను. నాయంతటివాఁడీ దేశమున లేఁడు.

రాజు:- నా సంశ్రయమున నుండుటకు మీకేమి వేతనము కావలయును?

భీమ:- దేవా! పక్షమునకొక వేయిసువర్ణములు.

రాజు:- ఈపురుషుఁ డెవఁడు?

భీమ:- రాజా! యీతఁడు నా బాల్యానుచరుఁడు.

రాజు:- సరియే. నీవు నాయాశ్రయమున నుండుము.

భీమసేనుఁడు రాజసేవయందుఁ బ్రవేశించెను. కాని వాఁడు చేయవలసిన పనులనన్నిటిని బోధిసత్త్వుఁడే చేయుచుండెను. ఆకాలమునఁ గాశీదేశమందలి యొక యరణ్యమున నొకవ్యాఘ్రము సేవకులం

జంపి తినుచుఁ బురుషులనవతరముం బోవుచుండెడి. రాజమార్గమును నిరోధించుచుండెను. ఈవృత్తాంతము రాజనకుం దెలిసినతోడనే భీమసేను నిరావించి "వ్యాఘ్రమును బట్టుకొనఁగలవా?" అనిప్రశ్నించెను.

భీమ:- దేవా! నేనాపులిని బట్టుకొనలేకుండిన నెట్లు ధనుర్ధరుండనని చెప్పుకొనఁగలను?" అనిన నా రాజాతనికిఁ బారితోషికంబొసంగి వ్యాఘ్రవధకై పంపెను. భీమసేనుఁడింటికివచ్చి యీ యుదంతమును బోధిసత్తునకుఁ జెప్పెను.

బోధి:- సరియే, మిత్రమా! నీవు చనుము.

భీమ:- నీవు నాతోఁగూడ రావా?

బోధి:- నేను నీతోఁగూడ రానుగాని యొకచిన్న యుపాయముం జెప్పెదను.

భీమ:- దయచేసి చెప్పుము?

బోధి:- నీవుతొందరపడి వ్యాఘ్రవాసము నొక్కరుఁడవే ప్రవేశింపకుము. వేయి రెండువేలమంది జానపదులగుమిగూర్చి బాణములతో వారినాస్థానమునకుఁ గొనిపొమ్ము. వ్యాఘ్రముత్తేజింపఁబడినపిమ్మటనీవొక నికుంజమునకుంజని, భూమిపైని ముఖముంచి, పండుకొనుము. అప్పుడు జానపదులా వ్యాఘ్రమును జావమొత్తుదురు. పులిచచ్చినపిమ్మటఁ బండ్లతో లతనొకదానిని ద్రెంపి, యాలతాతంతువుల నీడ్చుకొని, మృతవ్యాఘ్రముకడకుంజనుము. దానింజూచి కోపముతో "ఎవ్వఁడీ వ్యాఘ్రమును జంపెను. నేనీ వ్యాఘ్రమును లతాతంతువులతోఁగట్టి వృషభమువలె రాజసమీపమునకుఁ గొంపోఁ



దలఁచితిని. లతలఁదెచ్చుటకు నేనువనమునకేగి వానిం దీసికొని నేను రాకమున్నెవ్వఁడీపులిని జంపెనో నాకుఁదెలియవలెను," అని నీవన్నచో జానపదులుభీతిల్లి, రాజునకైననుఁ దెలియఁ జేయకుండుటకై నీకుపాయనమ్ముల నిత్తురు. వ్యాఘ్రమును జంపితి వనుఖ్యాతియు నీకుండును. రాజుకూడ నత్యధికముగ నీకుధనమొసంగును." "సరియె," అనిభీమసేనుఁడుపోయి బ్రహ్మదత్తుఁడు చెప్పినచొప్పున వర్తించి, వ్యాఘ్రహననముఁగావించెను. పథికులకా మార్గమున భయము లేకుండఁజేసి, యధికజనపరివృతుండై వారాణసిఁజేరి, రాజునకిట్లు నివేదించెను "దేవా! వ్యాఘ్రమునుజంపి వనంబునఁబాంథులకు భయములేకుండఁ జేసితిని. వనమునఁ బాంథులకింకేమియు భయములేదు" అనిన సంతుష్టుండై రాజాతనికి బహుమానమొసంగెను.

ఇంకొకదినమున మహిషంబొకటి మార్గమునునిరోధించుచున్నదని రాజనకుఁదెలిసెను. అప్పుడాతఁడు మహిషమును జంపుటకు భీమసేనునంపెను. బోధిసత్తుని మాటచొప్పున వ్యాఘ్రమువలెనే దీనింగూడఁజంపి రాజునొద్దకుఁ దిరిగివచ్చి వానివలన బహు ధనములఁ బారితోషికముగఁ బడసెను. అప్పటికాతఁడు ధనాధిపుఁడయ్యెను. నూతన గౌరవమర్యాదలచే మదోన్మత్తుఁడై బోధిసత్తుని నిరసించుచు, వాని యుపదేశంబుల గర్హించుచు, "నీసాయములేకుండ నేను జీవింపఁగలను. నీవుతప్ప వేఱెవ్వరును తేరనుకొనుచున్నావా యేమి?" అని బోధిసత్తునిట్టి పరుషవచనములచే నెంతయో దూషించెను.

కొన్నిరోజులకు శత్రురాజొకఁడు వారాణసిపై దాడివెడలి యాపట్టణమును ముట్టడించి, రాజ్యమును దనయాధీనము గావింపకుండినఁ బోరునకురమ్మని వారాణసీరాజునకు వర్తమానమంపెను.

వారాణసీరాజు భీమసేనుని యుద్ధమునకు పొమ్మని యాజ్ఞాపించెను. భీమసేనుఁడును, యోధునివలె నఖశిఖపర్యంతమును గవచముఁ దొడిగికొని శస్త్రములఁ బూని కవచముచే సురక్షితంబయిన యుద్ధగజంబు నెక్కెను. భీమసేనుఁడు వధింపఁబడునేమోయని భీతిల్లి బోధిసత్త్వుఁడును గవచమును దొడిగి శస్త్రంబులఁ బూని వానిపక్కవనే యుండి యాగజముపైఁ గూరుచుండెను. సేనాపరివృతమై యాగజము పురద్వారము వెలువడి యుద్ధంబులోనికిం జొచ్చెను. యుద్ధమందు దుందుభిధ్వని వినఁగనే భీమసేనుఁడు కడు భీతిల్లి కంపించుచుండెను. "నీవు క్రిందబడిన మరణింతువు" అని చెప్పి బోధిసత్త్వుఁ డాతఁడు క్రిందఁబడకుండ నాతని పాశముతో బంధించి తానా పాశమును బాగుగఁ బట్టుకొనియుండెను. యుద్ధభూమిని జూచినమాత్రముననే సాహసింపనేరక భీమసేనుఁడు మరణభయావిష్టుండై యాగజము మీఁదనే పురీషోత్సర్జనముఁ గావించెను. బోధిసత్త్వుఁడు, "అహా! వర్తమానంబు భూతకాలమును బోలకున్నది. నీవప్పుడొక మేటిశూరునివలె వర్తించితివి. ఇప్పటి యీనీశౌర్య మారూఢగజంబును మలినము గావించుటకుఁ బనికివచ్చినది. నీశౌర్యమునుగూర్చి ప్రగల్భములం బల్కితివి; శత్రువును జయించెదనని శపథముఁ జేసితివి; శత్రువ్యూహదర్శనమున నిటులనీవుకంపించుచు నధైర్యమును గనుపఱచుట యుచితమా?" అని యాతని నాక్షేపించి "మిత్రమా! భీతిఁ జెందకుము. నిన్ను రక్షించుటకు నేనిచ్చట లేనా!" అని గజమునుండి భీమసేనుని డింపి "ప్రక్షాళనముఁ గావించుకొని యింటికిఁ జనుము" అని చెప్పెను,

పిమ్మట బోధిసత్త్వుఁడు "ఈదినమునఁ గీర్తిఁ గాంచవలెను" అనుచు యుద్ధఘోషముఁ జేయుచు శత్రువ్యూహములఁ జొచ్చెను. పిమ్మట రాజశిబిరమునుండి రాజునీడ్చుకొనివచ్చి, ప్రాణములతో వా



రాణసికిఁ దీసికొనిపోయెను. అత్యంతానందభరితుండై కాశీరాజాతని శౌర్యమునకు మెచ్చి యమితధనంబు నొసఁగెను. ఆదినమునుండియు నల్పధనుర్ధరుని కీర్తి భరతవర్షమునందంతటను వ్యాపించెను. పిమ్మట బోధిసత్త్వుఁడు భీమసేనున కత్యధికముగ ధనంబొసఁగి యాతని నిజనివాసంబునకుఁ బంపెను. తానుయావజ్జీవమును నతిధార్మికుండై సుకృతంబుఁ జేయుచుఁ బ్రాణప్రయాణకాలమునఁ గర్మోచిత ఫలప్రాప్తికిఁ బోయెను.

## — 96. తెలపత్త జాతకము. —

బ్రహ్మదత్తుఁడు వారాణసిని బరిపాలించు సమయమున బోధిసత్త్వుఁడు రాజపుత్రశతమునఁ గడగొట్టువాఁడై జనియించెను. అతఁడు యుక్తవయస్కుఁడై రాజప్రాసాదంబున ప్రత్యేకబుద్ధులకు భోజనాద్యతిథి సత్కారములఁ గావించుచుండెను.

అధిక సోదరగణంబులఁ బరికించి బోధిసత్త్వుఁడు తనతాతతండ్రుల నాఁటినుండియుఁ గ్రమంబుగఁ దమకుటుంబమున వచ్చుచున్న రాజ్యమునఁ బట్టాభిషిక్తుఁడనగుదునా, కానా? అని చింతించుచుఁ బ్రత్యేకబుద్ధుల నీవిషయము నడుగుటకు నిశ్చయించుకొనెను. మఱునాఁడు ప్రత్యేకబుద్ధులు విచ్చేసి, దైవిక కార్యముల కొఱకుంచఁబడిన కలశంబులనున్న యుదకము పడకట్టి పాదప్రక్షాళనముం జేసికొని, పాదంబులఁ దుడుచుకొని భోజనమునకై కూరుచుండిరి. పిమ్మట బోధిసత్త్వుఁడు సవినయముగ నమస్కరించి, "నాతండ్రి యనంతరమున నేను రాజునగుదునా" అని యడిగెను. అదివిని వారు "కుమారా! యీపట్టణమున నీవెన్నడభిషిక్తుఁడవు కావు. ద్విసహస్రక్రోశదూరం

బుననున్న గాంధార దేశంబునఁ దక్షశిలానగరమున్నది. ఏడు దిన
ములలో నీవాపట్టణమును జేరఁగల్గిన నటనీవు రాజవగుదువు. కాని
యచ్చటికిఁ బోవుమార్గంబుననున్న కాంతారంబున నపాయమొక్కటి
యున్నది. అడవినిజుట్టి పోవునమన్న నది యటవీమధ్యముననున్న
మార్గముకంటె నధికముగనున్నది. అటవీమార్గముననే పోవుదుమన్న
పిశాచములానటవియందు వసించుచు బాటప్రక్కను మిథ్యాగ్రామ
గృహంబులనిర్మించికొనియుండును. తారాచిత్రిత వితానంబుక్రింద
నద్భుతరాగశోభిత రత్న్యావరణ పటయుక్తంబగు పర్యంకమును దమ
మాయచే సృజింతురు. అమానుషప్రభాయుక్తలై రక్షాంగనలు మృ
దుమధుర సల్లాపంబులచేఁ బథికులఁజూచి "అయ్యా! శ్రాంతులైనట్లు
కానిపించుచున్నారు. పయనము సాగింపకమున్ను, అన్నపానాదుల
స్వీకరింపుఁడు" అని యాతీరునఁ దేనెలొలుకుపలుకులనుడువుదురు.
పిమ్మటవారు దుష్టకార్యాచరణమునకుఁ గావించిన, నాఁడుదయ్యములు వా
రలఁజంపి యుష్ణంబగు రుధిరదిగ్ధమాంసంబును భక్షింతురు. వారు
లావణ్యానుభోగనంబును దమయనుపమాన సౌందర్యముచేతను, శ్రవ
ణేంద్రియంబును దమయనువ్యక్తగానమాధుర్యముచేతను, జిహ్వాన
త్యంతస్వాదు భక్ష్యంబులచేతను, స్పర్శేంద్రియంబు నత్యంత మృ
దురక్తోపధానంబులచేతను, జయింతురు. కాని నీవింద్రియనిగ్రహ
ము కలవాఁడవై వారిని దర్శింపకుండుట కెందుఁ గృతనిశ్చయుఁడవై
నీమార్గంబున నీవుపోయిన నేడవనాఁడు తక్షశిలానగరంబున నభిషి
క్తుఁడవగుదువు" అనిచెప్పిరి. పిమ్మటనాతఁడు "ఓపూజ్యులారా
మీరుచెప్పిన పిమ్మటఁగూడ నాదయ్యములఁ జూతునా?" అనుచుఁ
బ్రయాణంబునఁ దనకేయపాయమురాకుండునట్లుగఁ దనకేదియైననొ
కవస్తువునొసంగవలయునని ప్రచ్చేకబుద్ధుల వేడెను. పిమ్మటవారలయొద్ద
మంత్రింపఁబడినసూత్రసైకతంబులఁబరిగ్రహించి, తలిదండ్రులయొద్దను



బచ్చేకబుద్ధులయొద్దను, సెలవుఁగైకొని, తనయింటికరుగుదెంచి తనవా
రలతో "నేను రాజ్యాభిషిక్తుండనగుటకుఁ దక్షశిలానగరంబున
కేగుచున్నాఁడను. మీరలిచటనే యుండుఁడు" అని చెప్పెను
అంతట వారిలో నైదుగురు, "మమ్ములనుగూడ రానిండు" అని
వేడిరి. పిమ్మట బోధిసత్త్వుఁడు "మీరు నాతో రావలదు. తమ
సౌందర్యముచేఁ బాంథులమనంబులహరించి వారిని దమవశవర్తులఁగా
వించుకొని, పిమ్మట వారలఁజంపి భక్షించు రక్కసులామార్గంబున
నున్నారనివింటిని. మీరుగూడ నాతోవచ్చిన గొప్పహానిరాగలదు.
నేనాత్మవిశ్వాసంబుచేఁ బోవుచున్నాఁడను" అనిచెప్పెను. అంతవారు
"కుమారా! మేముగూడ నాదుష్టసుందర విగ్రహములఁ జూడము.
కాన మమ్ములను నీతోఁ దక్షశిలానగరమునకు రానిమ్ము" అ
నియడిగిరి. బోధిసత్త్వుఁడదివిని "అట్లైన నింద్రియనిగ్రహముఁ గావిం
పుకొనుఁడు" అనిచెప్పితనతోఁగూడ నాయైదుగురునిఁ గొంపోయెను.

మార్గమున దయ్యములు తమగ్రామనివాసమునుండి పోవు
చున్న బోధిసత్త్వుఁడు మున్నగువారిని వీక్షించుచుండెను. వీరిలో
సౌందర్యలోలుండగు నొకఁడా దుష్టపిశాచికానన్యసామాన్య లా
వణ్యాపహృత మనస్కుఁడై వెనుకంజవేయుచుండెను. "నీవెం
దులకు వెనుకకుఁ దగ్గుచున్నాడవు", అనిబోధిసత్త్వుఁడు వానిని బ్ర
శ్నించెను. "కుమారా! నాపాదంబులు బాధపెట్టుచున్నవి. ఈవి
తానముక్రిందఁ గొంతతడవు విశ్రమించి యమ్ములఁ గలసికొనియెద
ను" అనివాఁడు ప్రత్యుత్తరమిచ్చెను. పిమ్మట బోధిసత్త్వుఁడు "ఓయీ!
ఇవి దయ్యములు! వాని నాశింపకుము" అనెను. "కుమారా! ఏ
మైనను సరియే. నేనిటుపిమ్మట విశ్రమింపక యొక్కయడుగైనఁ బెట్టఁ
జాలను" అని వాఁడనెను. అంతబోధిసత్త్వుఁడు "సరియే. నీనిజస్వభా
వము బయటికచిరకాలముననే రాఁగలదు" అనుచు మిగిలిన నల్గు
వురతోడను బ్రయాణము సాగించెను.

పిమ్మట విషయలోలుండును గానాంధుండునునగు నాపథికుండు దయ్యములయొద్దకుం జని, వాటిచిత్రప్రేమలకుం జిక్కి దుర్వ్యాపారియై హతుండై వారిచే భక్షింపంబడెను. తరువాత నాపిశాచములు, పోవుచున్న పథికులకంటె ముందుగనరిగి, మార్గమునం దమమాయచే నొక మిథ్యావితానముం గల్పించిరి. ఆవితానమునందు నానావిధవాద్యములతో నవ్యక్తమధురమ్ముగ గానము సల్పుచుండిరి. అప్పుడు పథికులలో గానలోలుండగు నింకొకండు మొదటివానివలెనె వెనుకంబడి యాపిశాచములకు భక్ష్యంబయ్యెను. పిమ్మట మరల నాపిశాచములు పథికులకంటె ముందరగి నానావిధసుగంధద్రవ్యంబులుగల యొక యాపణంబును గల్పించెను. అచట సుగంధలోలుండు బ్రయాణమును జాలించెను. వానిని భక్షించిన పిమ్మట నాదయ్యములు పాంథులకంటె ముందుగనరిగి తన్మార్గమున స్వాదు భక్ష్యభరిత విక్రయశాలలు నిర్మించెను. అచట భోజనప్రియుండు వెనుకంబడి వానికాహారమయ్యెను. అనంతరమున నాదయ్యములు మిగిలి నమార్గస్థులకన్న మున్నేగి తమమాయచే రమ్యమగు శయ్యాతలంబుల సృజించి వానిపైనధివసించియుండె. వానింగని సౌఖ్యాసక్తుండట నాగెను. వానింగూడ నాదయ్యములు భక్షించెను.

చివరకు బోధిసత్త్వుండొకండే మిగిలెను. దయ్యములలో నొకతెమాత్రము కృతనిశ్చయుండైనను నెట్లైన వానినిం దానుదిరిగి రాక మునుపు భక్షింపవలయునని నిశ్చయించుకొని వానిననుసరించి పోవుచుండెను. అట్లుపోవుచుండ నడవియందు వనవాసులా దయ్యమును జూచి ముందేగుచున్న వాండెవ్వండని ప్రశ్నించిరి.

దయ్యము:—సత్పురుషులారా! ఆతండు నాభర్త.

ఆటవికులు:—(బోధిసత్త్వునుద్దేశించి) ప్రసూనంబుభాతి లావణ్యంబునుం దరుణవయస్కురాలునగు భార్య నిన్ను నమ్మి గృహంబు



విడిచి వచ్చుచుండ నెందులకామెను నీతోడ నడువనీయక నతిభారముతో దేహము నీడ్చుకొని రానిచ్చగించుచుంటివి.

బోధిసత్త్వుండు:—ఆమె నాభార్యకాదు; అదియొక దయ్యము. ఇదియే నాయైదుగురు స్నేహితుల దిగమ్రింగినది

దయ్యము:—అయ్యో! సత్పురుషులారా! పురుషులు కోపావేశముచే నిజభార్యల దయ్యములనియు, భూతములనియు, నిందింతురుగదా!

అటుపిమ్మట నాదయ్యము గర్భభారాలసవలె నటించుచు, శిశువులంగనిన యువతి తెఱంగున నటించెను. శిశువును బిరుదులపైం బడునట్లు వెనుకకు వ్రేలంగట్టి బోధిసత్త్వుననుసరించి పోవుచుండెను. తోవయందుం బ్రతిమనుజుండును వారలం బైవిధముననే ప్రశ్నించుచుండిరి. బోధిసత్త్వుండును బైవిధముననే ప్రత్యుత్తర మొసంగుచుండెను.

తుదకాతండు తక్కశిలానగరముం జేరెను. ఆదయ్యము తన శిశువునంతర్ధానముం గావించి తానొక్కతె యయ్యాతని ననుసరించి పోవుచుండెను. పత్తనద్వారముం జేరి బోధిసత్త్వుండు విశ్రాంతిగృహమును బ్రవేశించి యటగూరుచుండెను. బోధిసత్త్వుని మహిమచే నాదయ్యమాగృహముం బ్రవేశింపనేరక, యమానుష రూపలావణ్యయుక్తయై గృహప్రాంగణమున నిలువంబడియుండెను.

తక్కశిలానగరపాలకుండు విలాసార్థము నిజారామంబునకుం బోవుచు నాదయ్యముం జూచి మోహించెను. అప్పుడు రాజు పరిచారకుం బిలిచి యామె సభర్తృకయో కాదో కన్గొనిరమ్మని యాజ్ఞాపించెను. పిమ్మటం బరిచారకుండామెయొద్దకేగి „అమ్మా! నీభర్త యెచ్చటనున్నాడు?” అని యడిగెను. అంతనా దయ్యము „అయ్యా! నాభర్తవి

శాంతిగృహమున నున్నాఁడు," అని ప్రత్యుత్తర మొసఁగెను. అంతఁ బోధిసత్త్వుఁడు "ఆమె నా భార్య కాదు. అది నాయొక్క మనుష్యుల భక్షించిన యొక దయ్యము" అని చెప్పెను. ఆ దయ్యము "పురుషులు కోపావేశముచే నిజభార్యల దయ్యములనియు, భూతములనియు, నిందించుచుందురు," అనెను. అంతఁ బరిచారకుఁడు భూపాలుని యొద్దకుం జని జరిగినకతయు నివేదింప "అనాయకంబగు నిధి రాజునకుం జెందవలయును" అని చెప్పుచు నా రాజు పిశాచమును దనప్రక్కను గజముపైఁ గూరుచుండఁబెట్టుకొనెను. పిమ్మటఁ బట్టణమంతయు నుత్సవముతో నూరేగి ప్రాసాదంబు జేరి రాణియుండఁదగిన యంతఃపురంబున నామెం బ్రవేశపెట్టెను. తరువాత నా రాజు స్నానముఁ జేసి సుగంధిలేపనాదుల స్వీకరించి భోజనముఁ గావించి రాజశయ్యపైఁ బండుకొనెను. పిశాచముగూడ వండికొని భుజించి ప్రభాతంబగు రూపంబుఁ దాల్చి యధిక సంతుష్టుండగు రాజుప్రక్కను బండుకొని, యొకప్రక్కకుఁ దిరిగి యేడ్వసాగెను. ఆరోదనంబునకుఁ గారణ మేమని రాజు ప్రశ్నింప "ప్రభూ! నన్ను మార్గంబునఁ గన్గొని కులగోత్రంబులఁ దెలిసికొనకయే యవరోధ స్త్రీజనంబెక్కుడుగనున్నను నాకున్నత స్థితి నొసంగనున్నాఁడవు. వీరిమధ్యమున దు నివసించుచు 'నీజననీజనకుల నెవ్వరెఱుంగుదురు? నీకులం బెవరికి తెలియును? నీవు త్రోవయందు సంప్రాప్తవైతివి', అని వారు నన్నన్న నేనవమానితనై కృంగియుండవలయును. కాని యేలినవారు రాజ్యమునందంత నెక్కుడుగ నధికారము నాకొసంగిన, నన్నాక్షేపించుటకు నందఱు వెఱతురు," అని పిశాచము ప్రత్యుత్తరమిచ్చెను

రాజు:—ప్రియురాలా! నా రాజ్యంబున నందఱపై నాకు నిరంకుశాధికారము లేదు. నేను నాదిరాజును గాను. నా యధికారము, దానిధిక్కరించు వారిపైని, నేరములొనర్చు వారిపైని, జెల్లుచున్నది. కాన రాజ్యమునందంతట నీకు సర్వాధికార మొసంగఁజాలను.



దయ్యము:—ప్రభూ! నాకు రాష్ట్రముపైనిగాని పట్టణముపైనిగాని సర్వాధికారము నొసంగ నేరకున్న రాజప్రాసాదంబున నివసించువారిపైనైన నధికార మొసంగుము. వారల నేను బాలించెదను."

అతఁ డామెను మిగుల మోహించుటచే నామె ప్రార్థనల నంగీకరించి "ప్రాసాదవాసులపై నధికారముఁ జేయుము," అని రాజాజ్ఞ నిచ్చెను. అందులకామె సంతుష్టాంతరంగయై రాజు సుఖసుప్తుండగు పఱకును వేచియుండెను. పిమ్మటఁ బిశాచపురంబునకుం జని పిశాచ సమూహంబంతటిని దోడ్కొనివచ్చి ప్రాసాదంబుసొచ్చి రాజును నాశచంపి, యస్థికలు తప్పఁ జర్మమాంసాదికంబుల నెల్ల భక్షించెను. పిమ్మటఁ బిశాచములన్నియుఁ బ్రాసాదంబుసొచ్చి యందుండు కుక్కుటములు, శునకములు, మొదలగు జంతుజాలమును జనసమూహమును గూడఁ దమపొట్టఁబెట్టుకొనెను. మరునాడు జనులందఱు రాజప్రాసాదద్వారంబులు తెరువంబడకుండుటఁ గాంచి ప్రచండోచ్చైరరవంబులఁ జేయుచుఁ బిలిచిరి. అందులకేమియుం బ్రతివచనంబుగానక తలుపులఁగుద్దిరి. కాని యవి తెరువఁబడుట లేదు. పిమ్మట వారు తలుపులఁ బగులఁగొట్టి లోనికింబోయి యస్థివికీర్ణంబగు భూతలముం గాంచిరి. అప్పుడు వారు "అప్పుడామనుజుఁడాయువతి తనభార్య కాదనియు, నదిదయ్యమనియుఁ జెప్పియున్నాఁడు. అదియథార్థము. మోహమున మనరాజా పిశాచము నింటికిఁ గొనిపోయి భార్యగ స్వీకరింప నిశ్చయముగ నా పిశాచము తదితరపిశాచములఁ దోడ్తెచ్చి యందఱ భక్షించి పారిపోయియుండును" అని యనుకొనిరి.

ఆనాటిరాత్రి బోధిసత్త్వుఁడు మంత్రపూతంబగు సైకతంబు శిరంబున నిడికొని మంత్రపూతంబగు తంత్రిని లలాటంబుమీఁదుగఁ దలకుఁజుట్టి కరవాలంబు కేలఁగీలించి సూర్యోదయము కొఱకు నిరీక్షించుచుండెను. పురజనులును, ప్రాసాదగృహభూమిని బరిశు

శ్రీపఱది పుష్పగుచ్ఛముల మీదకప్పుచుండి వ్రేలఁగట్టి సురభిమాలలతోఁ గుడ్యముల నలంకరించి, పరిమళద్రవ్యములతో ధూపంబుల వేసిరి. అటుపిమ్మట వారందఱుఁ గలిసి యిట్లాలోచించిరి. "ఎవఁడు దివ్యసౌందర్యవతియైన నారీమణి తన్ననుసరించి వచ్చుచుండినను నొక్కపరియైన నామె వైపుఁ గన్నెత్తిచూడలేదో, ఎవఁడట్టి యింద్రియ నిగ్రహజ్ఞానసంపన్నుఁడో, అట్టివాఁడు రాజై యుండిన రాష్ట్రంబంతయు సుఖంబుననుండును. వానినే రాజుఁగఁ జేయుదము" అని నిశ్చయించిరి.

రాజవల్లభులును, రాష్ట్రజనులుంగూడ నీవిషయంబున నేకమనస్కులైరి. బోధిసత్త్వుని రాజుఁగఁజేసి పురమునకుం గొంపోయి యాభరణాదులతో నలంకరించి, తక్షశిలానగరంబున నభిషిక్తునిఁ జేసిరి. పిమ్మట బోధిసత్త్వుఁడు దుష్టమార్గచతుష్టయమున వర్జించి దశగుణరాజవిధుల నొనర్చుచు, ధర్మపరిపాలనంబుఁ జేయుచు దానాదిసత్కర్మలయందే జీవితమంతయుఁ గడపుచుఁ గర్మఫలానుభవంబు కొఱకు దేహంబుఁ జాలించెను.



## — 151. రాజవాద జాతకము —

తొల్లి బ్రహ్మదత్తుఁడు వారాణసిని బరిపాలించుచున్న సమయమున బోధిసత్త్వుఁడు పట్టమహిషిగర్భంబునఁబుట్టెను. గర్భవతికి యుక్తమగు సీమంతోన్నయనాది సంస్కారములను శుద్ధోచితముగఁ గావింప యుక్తకాలమున నామె ప్రసవించెను. నామకరణదివసంబున నాతనికి బ్రహ్మదత్తకుమారుఁడను నామముంచిరి.



ఆతఁడు నానాటికిఁ బదునాఱు వత్సరముల ప్రాయము గలిగి, విద్యాభ్యాసమునకై తక్షశిలానగరమునకుం బోయెను. అచట నన్నివిద్యల మిక్కిలి ప్రవీణుఁడై పితృమరణానంతరమున నాతని పదవినిస్వీకరించి, ధర్మపరిపాలనముఁ గావించుచుఁ దన యిచ్ఛవచ్చినట్లుగ గాక యథాన్యాయముగ ధర్మనిరూపణముఁ జేయుచుండెను. అతఁడిట్లు న్యాయపరిపాలనఁ జేయుచుండుటచే నాతని యమాత్యులును, న్యాయముగ వర్తించుచుండిరి. ఆతని యన్నికార్యములును న్యాయానుసారముగఁ జరుపఁబడుచుండుటచే నెవ్వఁడు నన్యాయాభియోగమును న్యాయస్థానమునకుం దేఁడాయెను. రాజప్రాసాదశాలయందభియోగులసమ్మర్దము క్షీణించెను. అమాత్యులు పగలెల్ల న్యాయస్థానంబుననుండియు నొక్కయభియోగినైనం గానకుండిరి. న్యాయస్థానంబులు నిర్జనంబులయ్యెను.

అప్పుడా బోధిసత్త్వుఁడిట్లు చింతించెను: "నా న్యాయపరిపాలనచే నొక్కయభియోగియైనను ధర్మనిర్ణయమునకై న్యాయస్థానమునకు రాఁడయ్యెను. న్యాయస్థానమున మునుపటికోలాహలంబు లేదు. న్యాయశాలలు నిర్మానుష్యములై యున్నవి. నా పరిపాలనా విధానమున లోపములేవైన నున్నవేమో కన్గొనవలయును. అట్టి లోపమేదైనను నున్నచో దానిం బోద్రోసి పుణ్యజీవనము సేయవలెను." అతఁడప్పటినుండియుఁ దనలోపములఁ గనుపఱచువానికొఱ కన్వేషించుచుండెను. రాజవల్లభులలో నొక్కఁడును నాతనిలోపములఁ గన్గొనలేకుండెను. "అందఱును నన్నుశ్లాఘించువారే యైయుండిరి. నాభయముచే వీరందఱును నాలోపములనుజెప్పక గుణములనే కీర్తించుచున్నారు కావలయును," అనుచు పురప్రాకారమునకు వెలుపలనుండువారిలో నట్టివానికై రాజు వెదకుచుండెను. కాని వారియందుఁగూడ నట్టివాఁడొక్కఁడును గాన్పింపలేదు. అప్పుడు పట్టణవాసులను, నాలుగుద్వారములయొద్దనుండు జానపదులను, రాజు ప్రశ్నించుచుండెను. వారిలోఁగూడఁ దనలోపములఁ గనుపఱుపఁగల

వాఁడొకఁడును గాన్పింపఁడయ్యెను. పొగడికతప్ప వేరేమియు నాతనికిఁ గన్పడుట లేదు. తుదకాతఁడు రాజ్యపరిపాలనా తంత్రమును మంత్రులకొప్పగించి, మారువేషమును వేసికొని, రథము నెక్కి రథచోదకు నొక్కనినే వెంటఁబెట్టుకొని, జనపదంబులయందు నాత్మదోషప్రదర్శకుని వెదకుటకై బయలుదేరెను ఆతీరున దేశమంతయుఁ బరిభ్రమించి ఛిద్రాన్వేషము కావించువానిఁ గానక, నిజసుగుణప్రశంసను బొందుచుండెను. పిమ్మటఁ బర్యటనముఁ గావించి, రాజమార్గమున నిజగృహాభిముఖుండయ్యెను.

ఈసమయముననే కోసలరాజగు మల్లికుఁడు నీవిధముననే గావించుచుండెను. అతఁడు కూడ న్యాయపాలకుండై సదసద్వివేక సంపన్నుఁడై యుండెను అనుచరులలో దోషనిరూపకునొక్కనినైనం గానక స్తుతినెల్లెడలఁ బొందుచు దేశమునందంతట నట్టిదోషనిరూపకు నన్వేషించుచు, నాటికావ్రదేశముఁ జేరెను.

రెండున్నతతీరంబుల మధ్యను, రెండురథములు పోవుటకు వైశాల్యము చాలని మార్గమున వీరిరువురు గలిసికొనిరి.

“రథము బాటనుండి తీయుము”, అని మల్లికుని సూతుఁడు వారణసీపాలకుని సూతునితోఁ జెప్పెను.

వారాణసీపాలకుని సూతుఁడు—అట్లు కాదు. నీరథమునే తీసివేయుము. ఆరథమున బ్రహ్మదత్తుండను వారాణసీపాలకుండగు రారాజధిష్ఠించియున్నాఁడు.

మల్లికుని సూతుఁడు—అట్లు కాదు. కోసలరాజ్యపాలకుండగు మల్లికుండను రారాజీరథమున నున్నాఁడు. నీవే నీరథమును బాటనుండి త్రిప్పి మారాజు రథమునకు మార్గము నొసఁగవలయును. “ఆహా! ఆరథమునఁగూడ నొకరాజున్నాఁడే! నే



నేమిచేయవలయును,” అని యనుకొనుచుండఁగ నాతని కొక యూహ తోఁచెను. ఆరాజులవయస్సులనడిగి, వారిరువురిలోఁ జిన్నవాఁడు రెండవవానికి మార్గము వదలివేయవలయునని యోచించి మల్లికుని సూతునడిగి వారిరువురును సమవయస్కులని తెలిసికొనెను. పిమ్మట మల్లికుని రాజ్యవిస్తీర్ణమును, నైశ్వర్యమహిమాదులను, గులగోత్రంబులనుగూర్చి ప్రశ్నించెను. వారిరువురకును త్రింశత్ క్రోశ పరిమాణముగల దేశంబులును, సమానైశ్వర్యమహిమాదులును,గలవని తెలిసికొనెను. అవుడు వారిరువురిలో సచ్చరిత్రుఁడైనకు మార్గము వదలివేయఁబడవలయునని యోచించి మల్లికునిసూతుని, “నీనరపాలుని సుగుణసంపదఁ జెప్పు”మని యడిగెను. అతఁడప్పుడీరీతిని మల్లికుని సుగుణదుర్గుణంబులఁ గీర్తించెను. “మల్లికనరపాలుఁడు కఠినులను గఠినముగను, సరళస్వభావులను మార్దవంబునను, బరిపాలించుచున్నాఁడు. మరియు సన్మార్గుల మంచిగను, దుర్మార్గుల దుష్టముగను,లొంగఁదీయుచున్నాఁడు. ఓసూతుఁడా? నరపాలుని చర్యలియ్యవియే. నాకు దారియిమ్ము”. అని యనెను. అప్పుడా మొదటిసూతుఁడు “ఆహా! యిదియేనా మీస్వామిగుణకీర్తనంబు?

రెండవసూతుఁడు:—“అగును.” అనిప్రత్యుత్తరమిచ్చెను. “ఇయ్యవి నీరాజసుగుణంబులైన వానిదుర్గుణంబు లెట్టివైయుండవలయును?” అని వారాణసీరాజసేవకుండు ప్రశ్నించెను.

మల్లికునిసూతుఁడు:—“నీవనుకొనినట్లవి దుర్గుణంబులే కానిమ్ము. మీస్వామిగుణంబు లెట్టివియో వినిపింపుము?”

వారాణసీరాజసూతుఁడు:—“ఈతఁడు మార్దవంబునఁ గోపము నుపశమించుకొనును. ఖలురను సద్భావంబునఁ బాలించును. లోభిని దానమువలన జయించును. అనృతమును సత్యముచేఁ బ్రతిపాదించును. ఓసూతుఁడా! మాకు మార్గము నిమ్ము. ఇట్టివి మాసార్వభౌముని సాధుమార్గములు.”
ఈమాటలువిని మల్లికనరపాలుండును, [illegible] రథము

నుండి దిగి, యశ్వంబుల రథమునుండి విప్పి, వారాణసీరాజు రథంబు పోవుటకుఁ దమరథంబును మార్గమునుండి ప్రక్కకుఁ ద్రోసిరి. అప్పుడా వారాణసీరాజు మల్లికనృపతితో "నీరీతులనీవుప్రవర్తింపవలయు" నని బోధఁగావించి, ప్రయాణముసాగించి, వారాణసిం జేరెను. పిమ్మట నాతఁడు తనజీవితకాలమంతయు దానంబులఁజేయుచు మంచిపనులఁ జేసి వైకుంఠంబుననుండువారి సంఖ్యను నధికముచేయుటకుఁ జనెను.

మల్లికభూపతియు బోధలనెన్నంగ గ్రహించి దేశమంతయుం దిరిగి, తనలోపములఁ గన్గొనువాని నొక్కనినైనం గనుంగొనలేక నిజపురంబునకుఁ దిరిగివచ్చి ప్రాణప్రయాణకాలమువఱకును దానంబులనిచ్చి, సన్మార్గప్రవర్తియై తుదకు వైకుంఠవాసగణముసధికముఁ జేయుటకుఁ జనెను.

---

## 155. గగ్గ జాతకము.

పూర్వము బ్రహ్మదత్తుఁడు వారాణసిని బరిపాలించుచున్న సమయమున బోధిసత్త్వుఁడు కాశీదేశమున నొకబ్రాహ్మణకుటుంబమునందు జనించెను. వానిజనకుఁడు న్యాయవాదవృత్తిచే జీవించుచుండెను. బోధిసత్త్వునకుఁ బదునాఱువత్సరముల యీడువచ్చినతోడనే వానితండ్రి రమ్యంబగు నొకమణిని దాచుమని వానికిచ్చెను. పిమ్మట వారిరువురును బ్రతిపట్టణమునకును, బ్రతిగ్రామమునకును, దిరుగుచుఁ దుదకు వారాణసిని జేరిరి. అయ్యెడ నాభూసురుఁడు ద్వారపాలుని గృహంబున వండికొనెను. ఉనికికి స్థానంబుగానక యాతఁడఖ్యాలస్యముగ వచ్చిన పథికులకు వాసమెట్లు దొరకునని ప్రశ్నించెను. అచ్చటిజనులు వానితోఁ బురబాహ్యప్రదేశమునఁ బిశాచగ్రస్తంబగు నొకగృహమున్నదనియు, సందానాథుఁడు



బనచేయవచ్చుననియుఁ జెప్పిరి. అపుడు బోధిసత్త్వుఁడు తనజనకునితో "జనకా! పిశాచమువలన భయముంజెందకుము. సెనట్టి పిశాచమును లొంగఁదీసి నీపాదములపైఁ బడవేయుదును" అనుచు జనకు నొప్పించెను. పిమ్మట వారిరువురు నాస్థలమునకుఁబోయిరి. బ్రాహ్మణుఁడాగృహమునఁ బర్యంకమునఁ బండుకొనెను. కుమారుఁడు పాదంబుల నిమురుచు జనకుని సమీపమునఁ గూరుచుండెను.

వెస్సవణునకుఁ బండ్రెండువత్సరములు సేవచేసి దయ్యమొకటి యాగృహవాసంబును బ్రతిఫలంబుగఁ గొన్నిమర్యాదలకొడంబడి పొందెను. ఎవ్వఁడైన నాగృహమునఁజొచ్చి తుమ్మిననితరుండు "చిరజీవిర్భవ" అన "చిరజీవిర్భవ"యనికాని "నీకునదియే యగుఁగాక" యనిగాని చెప్పకుండినయట్టివానిని పిశాచము భక్షింపవచ్చును. పిశాచమాకుటీరగృహమధ్యస్థూణంబున నివసించుచుండెను.

పిశాచం బాభూసురునకుఁ దుమ్ముఁ దెప్పింపవలయునని నిశ్చయించుకొనెను. పిమ్మట నాదయ్యము దనయింద్రజాలప్రభావముచే సూక్ష్మధూళిపటలంబును రేచెను. ఆధూళి బ్రాహ్మణుని నాసారంధ్రములఁ బ్రవేశించెను. పిమ్మట నాబ్రాహ్మణుఁడా పర్యంకంబునందుఁ బండుకొనియే తుమ్మెను. పుత్రుఁడు "చిరజీవిర్భవ" అని పలుకకుండుటచే నాదయ్యము నిజోపహారభక్షణార్థమై క్రిందికిదిగెను. బోధిసత్త్వుఁడదిగని "నిశ్చయముగ నీదయ్యమే నాతండ్రిని తుమ్మించినది. "చిరజీవిర్భవ"అని యనకుండువారినెల్ల నీపిశాచము భక్షించుచున్నదికావలయును." అని చింతించి పిమ్మట జనకునుద్దేశించి "ఓగగ్గుఁడా! నూఱువత్సరములవఱకు జీవింపుము. మఱియొక యిరువదివర్షములుగూడ నీవు జీవింపవలయునని నేఁబ్రార్థించెద. పిశాచం బెద్దియు నిన్ను భక్షింపకుండునుగాక. శతవర్షములుగూడ జీవింతువుగాక" అనిచెప్పెను.

పిశాచం బీరీతిగ విచారించెను. "చిరజీవిర్భవ" అని చెప్పుటచే వలని భక్షింపఁజాలను. కాన నేనితని జనకుని మ్రింగెదను" అనుచు బ్రాహ్మణుని సమీపించెను. కాని బ్రాహ్మణుఁడా విషయమునకు గారణంబుఁ దెలిసికొని "నీవుగూడఁ జిరాయుష్మంతుఁడ వగుము" యని చెప్పకున్న నన్నీపిశాచము భక్షించునుగావలయును" అనితలఁచి కుమారునుద్దేశించి "నీవుకూడ నూఱువత్సరములును, పిమ్మట నిరువదివత్సరములును, జీవింపవలయునని నేనుగోరెదను. పిశాచభోజనము విష మగుఁగాక!" అనిచెప్పెను.

పిశాచంబీ వాక్యములవిని "వీరిరువురును నాకు భక్ష్యంబు కారు." అని చింతించుచుఁ దిరిగిపోవుచుండెను. అప్పుడు బోధిసత్త్వుఁడా పిశాచము నిట్లు ప్రశ్నించెను.

బోధిసత్త్వుడు:—పిశాచమా! నీ వెందులకీ గృహమును బ్రవేశించి నరుల భక్షించుచున్నావు?

పిశాచము:—వెస్సవనుని బండ్రెండేండ్లు సేవించి యీయధికారమును బడసితిని.

బోధిసత్త్వుఁడు:—ఏమీ! నీవందఱను భక్షించుట కాజ్ఞఁబడసితివా?

పిశాచము:—ఒకరు "చిరజీవిర్భవ" యని యాశీర్వదింప నింకొకఁడు "నీకును నట్లేయగుఁగాక" అని యనవలయును. అట్టివారిం దప్పఁ దక్కుంగలవారల నందఱ భక్షించెద.

బోధిసత్త్వుఁడు:—ఓదయ్యమా! పూర్వజన్మమున నీవు దుష్కర్మల నాచరించుటచేఁ దత్కర్మఫలానుసారముగ భయంకరమును, దయాహీనంబును, మనుజఘాతకంబును, నగు నీజన్మమును బడసితివి. ఈజన్మమునఁ గూడఁ బాపాచరణంబుఁ జేసిన నంధకారపరంపరయందుఁ గూలుదువు. కాన నిప్పటినుండియుఁ బ్రాణిహింసాదులఁ బరిత్యజింపుము" అనియెను.



ఈమాటలా దయ్యమునకు రుచించెను. పిమ్మట బోధిసత్త్వుఁడు నరకభీతిచే వానిని భయపెట్టి, పంచవిధాచరణయందు నియోగించెను. మరునాఁడు, జనులా దయ్యమునుగాంచి, బోధిసత్త్వుఁ డెట్లా దయ్యమును వశీకరించెనో దెలిసికొని నరపాలకునకడకుంజని "నరాధిపా, పురుషుండొక్కఁడు దయ్యమును లోఁగఁదీసి వార్తాహారునివలె విధేయునిగఁ జేసినాఁడు," అని విన్నవించిరి. ఇదివిని రాజు బోధిసత్త్వుని రావించి వాని సేనానాయకునిగ నియమించి తజ్జనకుని సన్మానించెను. పార్థివుండా దయ్యమును కరగ్రాహకునిగ నియమించి, బోధిసత్త్వుని యుపదేశములను ననుసరించి ప్రవర్తించునటులనొనర్చి, దానశీలుండై సత్కర్మల నాచరించుచుఁ గాలగతిఁజెంది వైకుంఠవాసుల సంఖ్య హెచ్చించుటకుఁజనెను.

---

## 220. ధమ్మద్ధజ జాతకము.

ఓకానొకప్పుడు వారాణసీపట్టణమున విఖ్యాతుండగు 'యశపాణి' యను రాజు పాలించుచుండెను. వాని ప్రధానసేనాని నల్లనివాఁడై కాలకనామమునఁ బరగుచుండెను. ఆకాలమున బోధిసత్త్వుఁడు రాజపురోహితుఁడై ధమ్మద్ధజుఁడను నామమునఁ బరగుచుండె. ఛత్త్రపాణియనువాఁడు రాజాభరణకారియై యుండెను. రాజత్తముఁడైనను సేనానిమాత్రము వివాదల దీర్పుచేయుటయందు లంచములఁ బుచ్చుకొనుచు, నిజస్వాముల వంచించుచుఁ గుట్రలఁ బన్నుచు, పిశునుఁడై యుండెను.

ఒకదినమున నొకఁడభియోగమునఁ గోల్పోయి చేతులుచాఁచి విలపించుచు న్యాయస్థానమునుండి పోవుచు, రాజదర్శనార్థము నరుగుచున్న బోధిసత్త్వునిఁ గలుసుకొనెను. వానిపాదములపైఁబడి విల

పించుచు నభియోగమున నెట్లపజయము కల్గెనో విన్నవించెను. అతఁడు "మీవంటివారు నరపాలునకైహికాముష్మిక విషయములం గూర్చి బోధలునల్పుచుండ, సేనానిలంచగొండియై ప్రభువున కపకీర్తి సంపాదించుచున్నాఁడు" అని యనెను.

బోధిసత్త్వుఁడు వానింజూచి జాలిపడి యిట్లుఁ జెప్పెను. "ఓయీ! నాతో రమ్ము; నీవ్యవహారమును నేను బరిష్కరించెద" అనుచు నాతని న్యాయస్థానమునకుం జనెను. అచట ఘనంబగు జనసమూహము కూడెను. బోధిసత్త్వుఁడు తీర్పునుద్రిప్పి న్యాయముండినవాని పక్షమున నిర్ణయపాదమును గావించెను. చూపరులామోదించి పెద్ద కేకలు వేసిరి. రాజదివిని "ఏమీ యాధ్వని" అని ప్రశ్నించెను. "ప్రభూ! న్యాయవిరుద్ధముగఁ దీర్పఁబడినతీర్పును విద్వాంసుఁడగు ధమ్మద్ధజుఁడు రద్దుపఱచి న్యాయనిరూపణముఁ గావించినాఁడు. అందులకానినాదము" అని యచటి పరిచారకులు బదులుచెప్పిరి.

రాజు సంతుష్టుఁడై బోధిసత్త్వుని రావించి "నీవు న్యాయనిరూపణముఁగావించితివని చెప్పుచున్నారు" అని వానితోఁజెప్పెను. అందులకాతఁడు "అగును, మహారాజా! కాలకుండ న్యాయమునఁజేసిన తీర్పు నేను సమపఱచితిని" అని యనెను. "నేఁడు మొదలు నీవే న్యాయాధికారిగనుండుము. అట్లైన నాకు శ్రవణోత్సవమును బ్రపంచమున కుపకారమును నగును," అని రాజనినందుల కాతఁడియ్యకొనకుండెను. అప్పుడు రాజు "ప్రాణులయందుఁ గృపఁజూపి న్యాయవిచారణఁ గావింపుము" అని ప్రార్థించి యాతనినందుల కియ్యకొల్పెను. ఆదినమునుండియుఁ గాలకుని లంచములుకట్టినవి. వీనినిగోల్పోయి కాలకుఁడు బోధిసత్త్వునిపై రాజుతోఁ గొండెములు చెప్పుచుండెను. "మహారాజా! బుద్ధిమంతుఁడగు ధమ్మద్ధజుఁడు నీరాజ్యము నపేక్షించుచున్నాఁడు" అనిన రాజుమాత్రము వానిని విశ్వసింపక కాలకునట్లు చెప్పవలదని యాజ్ఞాపించెను. "అతఁడు వచ్చుసమయమున వాతా



యనమునుండి యాతనిఁజూడుఁడు. అప్పుడు మీరు పట్టణమంతయు నతని పక్షమైనదని తెలిసికొనఁగలరు", అని కాలకుఁడు ప్రత్యుత్తర మిడెను.

న్యాయశాలయం దాతని చుట్టునున్న జనసమూహమును గాంచి, యిదియె వానిపరివారమనియెంచి, సేనానిమాటల విశ్వసించి, "సేనానీ! మన మేమి చేయవలసియున్నది?" అనిరాజు ప్రశ్నించెను.

సేనాని:- మహారాజా! అతఁడు నిహతుఁడు కావలయును.

రాజు:- అతనిపై నెద్దియైన నొకగొప్పనేరము మోపకుండ మనమాతని నెట్లుచంపఁగలము?

సేనాని:- అందులకొక మార్గమున్నది.

రాజు:- అది యేమి?

సేనాని:- అసంభవమగు దానియందాతని నియోగించి యాతఁడద్దానిం జేయలేకున్న నపుడాతని వధింపుఁడు.

రాజు:- అతని కశక్యంబెద్దియున్నది?

సేనాని:- రాజా! రెండువత్సరములుగాని, యంతకంటె నెక్కుడు కాలమునగాని సారవంతములగు క్షేత్రముల వృక్షములు సంరక్షితములై పండ్లను ఫలింపనేరవు. వాని రావించి "తేవుమేము విహరించుటకు వన మొకటి కావలయును. అట్టితోట మాకొఱకు నిర్మాణము సేయుము." అని నియోగింపుఁడు. అతఁ డట్టివనమును సంఘటింపఁజాలఁడు. అతిప్పిదమునకై యాతని వధింపుఁడు.

రాజు బోధిసత్త్వునితో "విబుధాగ్రగణ్యా! చిరకాలము ప్రాతతోటలలో విహరించితిమి. క్రొత్తదానియందు విహరించుటకెం

యుఁ గుతూహలముగానున్నది. మాకొకతోటను సృజియింపుఁడు. అట్లు చేయలేకున్న మీకు మరణదండనమును విధింతుము" అనిచెప్పెను. అప్పుడు బోధిసత్త్వుఁడు "లంచములు దొరకకుండుటచే నా కాలకుఁడు రాజునకు నాపైనసూయగల్గునట్లు చేసినాఁడు" అనితన మనమున విచారించి "ఓ మహారాజా! చేయఁగల్గిన నేఁజేసెద" అని రాజునకు నివేదించి యింటికిఁబోయెను. తృప్తిగ భోజనముఁజేసి యాలోచించుచు శయ్యపైఁ బరుండియుండెను. అపుడు సక్కుని ప్రాసాదంబు సంతప్తంబాయెను. సక్కుఁడును దత్కారణంబు విచారించి బోధిసత్త్వుని యాపత్తుఁదెలిసికొనెను. తరువాత సక్కుఁడు వానియొద్దకతిశీఘ్రంబుగఁ జని వానికొట్టంబుఁ బ్రవేశించి "ఆర్యా! యేవిషయమునుగూర్చి మీరు చింతించుచున్నారు?" అని యంతరాళమునుండియే ప్రశ్నించెను.

బోధిసత్త్వుఁడు:- మీరెవరు?

సక్కుఁడు:- నేను సక్కుఁడను.

బోధిసత్త్వుఁడు:- రాజు వనమును నిర్మింపుమని నన్నునాజ్ఞాపించెను. దానినిగూర్చి చింతించుచున్నాఁడను.

సక్కుఁడు:- ఆర్యా! చింతింపకుఁడు. నందనచిత్రలతా వనంబులపోల్కి నేను వనంబు సృజించెద. ఎచ్చట నిర్మింపవలయునో చెప్పుము.

బోధి:- (స్థలమునునిరూపించుచు) "ఈస్థలమునందు వనమునునిర్మించుము" అన నిమ్మాటసక్కుఁడొక వనమునునిర్మించి దేవలోకమునకుఁజనెను. మరునాడు బోధిసత్త్వుఁడా నిర్దిష్టప్రదేశమున వనముంగని రాజదర్శనముఁ గావించి "రాజా! వనముసిద్ధముగనున్నది. విహారమునకుంజనుము" అనినివేదించెను.



ఇమ్మాట రాజాప్రదేశమునకుంజని సిందూరరాగ రంజితంబును సద్వారవిరాజితంబును నగు, నష్టాదశహస్తోన్నతి ప్రాకారంబుచేఁ బరివేష్టింపంబడి, సరోవరయుక్తంబై, ఫలపుష్పభరితములగు వృక్షములు గలిగినవనముంగని కాలకునితో నిట్లనియెను. "ఈ తాపసుఁడు నాయాజ్ఞచొప్పునఁ గావించినాఁడు. ఇప్పుడు మనమేమి చేయవలయును?"

సేనాని:- రాజా! ఆతఁడొకరాత్రి యందిట్టివనమును సృజింపఁగలిగిన మీరాజ్యము నపహరింపఁజాలఁడా?

రాజు:- ఐనచో మనమేమి చేయవలయును?

కాలకుఁడు:- ఇంకొక యశక్యంబగుదానిని వానిచేఁ జేయింతము.

రాజు:- అదియేమి?

కాలకుఁడు:- "సప్తమణియుక్తంబగు సరస్సును నిర్మింపుమని యాతని నాజ్ఞాపింపుఁడు". రాజందులకొప్పుకొని బోధిసత్త్వునితో నిట్లనియెను "గురూ! మీరొకవనమును సృజించిరి. దానితో సమానమగు సప్తమణియుక్తంబగు నొక సరోవరమును నిర్మింపుఁడు. అట్లుచేయలేకున్న మీకు మరణదండనమును విధింతును." అందులకు బోధిసత్త్వుఁడు "చిత్తము, మహారాజా! అదినేను జేయఁగలగినచోఁ జేసెదను," అని చెప్పెను.

అంతసక్కుఁడు మరలవచ్చి నందనవనసరోవరంబుపోల్కి శతఘట్టయుక్తంబై, పంచవర్ణవిరాజమానకమలపరివృతంబై, నూఱువంకలుగలిగిన యొకసరస్సును సృజించెను. మరునాడు బోధిసత్త్వుఁడా సరస్సునుగాంచి "చూడుఁడు, సరస్సుగూడ సిద్ధముగనున్నది." అని రాజునకు నివేదించెను. రాజదిచూచి చేయునదికనేమియున్న కాలకునడిగెను.

కాలకుఁడు:-దీనితో సమానమగు గృహమును నిర్మింపుమని యాజ్ఞాపింపుఁడు.

పిమ్మట రాజు "గురూ! ఈ వనమునకును, సరోవరమునకును, తగిన గృహమునొకదానిని దంతముతో నిర్మింపుఁడు. అట్లు చేయలేకున్న మిమ్ము వధియింతుము" అనియనెను.

పిమ్మట సక్కుఁడువచ్చి యట్టిగృహమును నిర్మించెను. బోధిసత్త్వుఁడు దానింగని మరునాఁడు రాజునకు నివేదించెను. నరపాలుండును దానింజూచి కర్తవ్యంబేమియని కాలకునడిగెను. ఆదంతగృహమునకుఁ దగినమణిని సంపాదింపుమని బోధిసత్త్వున కాజ్ఞాపింపుఁడని కాలకుఁడు చెప్పెను. రాజు బోధిసత్త్వున కిట్లాజ్ఞాపించెను. "ఆర్యా! ఈదంతగృహమునకుఁ దగినమణిని సంపాదించిన నేనీగృహమును నామణికాంతితోఁ జూచుచుండెదను. మీరట్టిమణిని సంపాదింపలేకున్న వధ్యులగుదురు",

పిమ్మట సక్కుఁడొకమణిని సిద్ధపఱుప, బోధిసత్త్వుఁడు దానిని రాజునకుఁజూపెను. దానింజూచి కర్తవ్యమింకనేమియని రాజు కాలకునడిగెను.

కాలకుఁడు:-మహారాజా! ధమ్మద్ధజభూసురున కీప్సితములనొసఁగూర్చు భూతమొకటి యున్నదని తలంచుచున్నాఁడను. దైవప్రజ్ఞను నశక్యంబగు దానిసృజియింపుమని మరలఁ నాజ్ఞాపింపుఁడు. చతుర్గుణయుక్తుఁడగు మనుజుని దైవమయినను సృజింపనేరదు. కాన బోధిసత్త్వునట్టి మనుజునొకని వనప్రాసాదమణులరక్షణమునకై సృజియింపుమని యాజ్ఞాపింపుఁడు," అని చెప్పినపిమ్మట నానరపాలకుఁడు పురోహితునితో "ఆచార్యా! వనంబును, సరోవరంబును, ప్రాసాదంబును గాంతి నొసఁగుటకు మణిని సృజియించితిరి. ఇప్పుడు వానికి



రక్షకుఁడుగ నుండుటకుఁ జతుర్గుణసంపన్నుఁడగు వానినొకని సృజియింపుఁడు. అట్లు చేయలేకున్న మీరు మృతులగుదురు" అనియనెను. బోధిసత్త్వుఁడు "అటులనే కానిండు. అట్టిదినాకు శక్యమైన నేను దమయాజ్ఞ నెరవేర్చెదను" అనిచెప్పి గృహంబునకుంజని తృప్తిగ భోజనముఁజేసి పరుండెను. ఉదయముననే మేల్కాంచి సెజ్జపై కూర్చుండి "ఈవఱకు సక్కుఁడు తనమహాప్రజ్ఞచేఁ జేయఁగలవానిని సృజియించినాఁడు. చతుర్గుణోపేతుండగు వానిని వనరక్షణమునకై చేయనేరఁడు. కాన నేనేయొక్కనె యడవులఁబట్టి మృతిఁజెందుట పరహస్తంబులఁ జచ్చుటకంటె మేలు," అనియాలోచించుకొని, యెవ్వరితోడను జెప్పకయే గృహమునుండి బయలుదేరి ముఖ్యపురద్వారంబునఁ బట్టణమువిడిచి, యడవులకుంజని, యొకతరుమూలంబున సత్పురుషుల మతమునుగూర్చి ధ్యానించుచు కూరుచుండెను. సక్కుండదిచూచి వనచరవేషంబున బోధిసత్త్వునికడకుంజని యిట్లు చెప్పెను. "భూసురుఁడా! నీవు యువకుఁడవును, సుకుమారుండవును; ఎందులకిట్టివఱకెన్నఁడును దుఃఖములెఱుంగని వ్యానివలె నీయటవీప్రదేశమున నున్నాఁడవు"? అనియడిగెను. తదనుగుణంబుగ బోధిసత్త్వుఁడుత్తరమొసఁగెను.

సక్కుఁడు:-అట్లైన నోభూసురుఁడా! యెందులకిక్కడఁ గూర్చుండి యున్నాఁడవు?

బోధిసత్త్వుఁడు:—నృపాలుఁడు చతుర్గుణోపేతుండగు నరుని వనపాలనమునకై సృజింపుమని నన్ను నియమించెను. అట్టివాఁడు సులభసాధ్యుఁడు కాఁడు. పరహస్తంబులఁ జచ్చుటకంటె నడవులఁజొచ్చియే యొక్కనె మృతిఁజెందుట మేలని తలఁచి యిటకువచ్చి కూరుచుండియున్నాఁడను.

సక్కుఁడు:- ఓభూసురుఁడా! నేను దేవరాజగు సక్కుఁడను. నాపల
నే వనంబును, తదితరవస్తువులును, సృజింపఁబడినవి. చ
తుర్గుణోపేతుండగు వనరక్షకునిం గన్గొనుటయశక్యము. కాని
యీ దేశంబుననే శిరోలంకారికారుఁడగు చత్తపాణియను సు
వర్ణకారుఁడొకఁడు కలఁడు. వనరక్షకుఁడే కావలసియున్న
చోఁబోయి వానివనరక్షకునిగ నియమింపుము'' అని యిట్లు
తనికి ధైర్యవచనములఁ జెప్పి దేవపురమునకు సక్కుఁడు
పోయెను.

బోధిసత్త్వుఁడు గృహమ్మునఁ జేరి భోజనానంతరమునఁ బ్రాసాద
ద్వారమునకుంజని యచట చత్తపాణిం గన్గొనెను. వానిచెయ్యిపట్టు
కొని "ఓచత్తపాణీ! నీవుచతుర్గుణోపేతుండవనునది సత్యమా?" అని
యడిగెను.

చత్తపాణి:- నీకెవ్వరు చెప్పిరి?

బోధిసత్త్వుఁడు:—దేవరాజగు సక్కుఁడు.

అతనితో బోధిసత్త్వుఁడాయుదంతమంతయుఁ జెప్పి కారణము
నుగూడఁ జెప్పెను. పిమ్మట చత్తపాణి యిట్లనెను

చత్తపాణి:—అగును. నేనుఁ జతుర్గుణోపేతుండను.

బోధిసత్త్వుఁడు:- (ఆతనిచేయిఁబట్టి రాజుకడ కేగి) మహారాజా! చతుర్గు
ణోపేతుండగు చత్తపాణియితఁడుగో. మీకు వనరక్షకుఁడావశ్య
కమైన వీనిని వనరక్షణమున నియోగింపుఁడు.

రాజు:- (చత్తపాణింజూచి) నీవుచతుర్గుణోపేతుండవనునది సత్య
మగునా?

చత్తపాణి:- అగును, మహారాజా! సత్యమే.



రాజు:- ఆగుణము లెవ్వి?

చత్తపాణి:- నేనసూయాపరుండను గాను. మద్యపానంబు సేయను.
నాకుఁ బ్రబలకామంబులు లేవు కోపము లేదు. ఇవియే నాకు
న్న చతుర్గుణములు.

రాజు:- చత్తపాణీ! అసూయ లేదని నుడివితివా?

చత్తపాణి:- అగును. మహారాజా! నాకసూయ లేదు.

రాజు:- ఎవ్వనియందు నీకసూయ లేదు?

చత్తపాణి:- అవధరింపుము మహారాజా! ఒకానొకప్పుడొక స్త్రీయొ
క్క ప్రోత్సాహముచేఁ బురోహితునొకని నిర్బంధించితిని.
ఆయనయొక్క సుబోధచే నేనసూయావిరహితుఁడనైతిని.

రాజు:- చత్తపాణీ! మద్యము నేల పరిత్యజించితివి?

చత్తపాణి:- ఒకప్పుడు సురాపానోన్మత్తుఁడనై నాపుత్త్రుని మాంసము
భక్షించితిని. పిమ్మట నతిదుఃఖితుఁడనై యప్పటినుండియు
మద్యము త్రాగనని శపథముచేసుకొంటిని.

రాజు:- ప్రేమావిముఖుఁడ వెట్లైతివి?

చత్తపాణి:- కితవాస నృపాలుఁడను నామమున నేఁ బరగుచుండెడివాఁ
డను. అపుడు నేను రాజాధిరాజునై యుంటిని. నాపుత్త్రుండు
బుద్ధుని కలశంబు వ్రక్కలుచేయుటచేఁ గాలధర్మము నొందెను.

రాజు:- నిన్నెయ్యది కోపరహితునిగఁ గావించినది?

ఛత్రపాణి:-అరకుండను పేర నేడువర్షములు దానములసల్పితిని. ఏడుయుగములు బ్రహ్మలోకమున వాసముచేసితిని.

ఛత్రపాణి తన చతుర్గుణముల స్పష్టీకరింప రాజు కాలకుని దౌర్జన్యంబుఁ గుర్తెఱింగి పరిచారకులకు సైగఁజేసెను. ఒక క్షణములో బ్రాహ్మణులును, దడితరులును సరభసంబున లేచి కాలకునిపై పుచూచి, "ఛీ ఛీ, లంచగొండీ! దుష్టా! లంచములు దొరకకుండుటచే నీవీ సత్పురుషునియందు రాజునకు మత్సరముఁగల్గించితివి" అనియనిరి. దానిఁబట్టి యాకాలకునిఁ బ్రాసాదమునుండి బయటకుఁదీసికొనిపోయి, కానుపించిన శిలాకాష్టాదులతో వానిశిరము వ్రక్కలు చేసి వానిని వధియించిరి, పిమ్మట వానిపాదములఁబట్టి శకృద్రాశిపై వానిఁబార వేసిరి.

— 257. గామణీచండ జాతకము. —

జనసంధుఁడు తొల్లి వారాణాసిని బాలించుచుండ బోధిసత్త్వుఁడు పట్టమహిషి గర్భంబున జనించెను. అత్యంత ప్రతిభాయుక్తంబును, సుమంగళసౌందర్య రాజితంబునునగు వాని ముఖము తేజిత కనకాదర్శంబుభాతిఁ బ్రకాశించుచుండెను. నామకరణదివసమున 'నాదర్శముఖకుమారుండ'ను నామంబువానికుంచిరి.

ఆతఁడు సప్తవర్షీయుఁడగునప్పటికిఁ వేదత్రయంబు నభ్యసించి, సంసారవిధులయందు శిక్షఁబొందెను. కుమారుని యేడవయేట రాజు మరణించెను. రాజవల్లభులు మరణించిన రాజునకు నపరకర్మాది విధులనత్యంత వైభవంబునఁగావించి శ్రాద్ధవిధి నిర్వర్తించిరి. ఏడవనాడు ప్రాసాద సభాశాలయందు పౌరందఱుసభ



చేసి కర్తవ్యముఁగూర్చి మంతనంబు గావించిరి. కుమారుఁడు మిక్కిలి బాలుఁడగుటచే నభిషిక్తుఁడగుటకు వీలులేదని యోచించిరి.

వారాతని రాజ్యాభిషిక్తునిఁ జేయుటకుమునుపే వానిఁ బరీక్షింపవలయునని నిశ్చయించుకొనిరి. అందులకొక న్యాయశాలసిద్ధపఱచి, యందుఁ బ్రకోష్టమును నిర్మించిరి. పిమ్మటఁ గుమారునికడకుఁ జని "ప్రభూ! మీరు న్యాయస్థానమునకు రావలెను" అని చెప్పిరి. అందులకాకుమారుఁడియ్యకొని పరివారజనసమేతుఁడై యటకేగి ప్రకోష్టంబు నధిష్ఠించెను.

రాజు మంచారోహణముఁ గావించినపిమ్మట రాజవల్లభులు మర్కటంబునొకదానిని వేశ్మనిర్మాణయోగ్యస్థలపరీక్షాదక్షుని వేషము వేసి పాదద్వయంబుపైని నడిపించుచు న్యాయశాలను బ్రవేశపెట్టిరి. పిమ్మటవారు "అధిపా! మీతండ్రిగారికాలమున నీతఁడు గృహనిర్మాణ యోగ్యంబులగు నివేశస్థలంబులఁ దనమంత్రబలముచేఁ గన్గొనుచుండెడివాఁడు. ఆవిద్యయందీతఁడు దక్షుఁడు. భూమియందేడు మూళ్ళనడుమనుండు దోషములను గన్గొనుశక్తియీతనికిఁ గలదు. ఈతనిసాయముచే రాజప్రాసాదమునకు స్థలము నిరూపింపఁబడినది. కావునఁ దామీతనికి జీవనోపాధిఁగలుగఁజేసి, యుద్యోగమును బ్రసాదింపుఁడు" అని చెప్పిరి.

కుమారుఁడాతని నఖశిఖపర్యంతముఁ బరీక్షించెను. పిమ్మటఁ దనమనమున "ఇది మర్కటము గాని మనుష్యుఁడుకాఁడు. మర్కటములితరులచేఁ జేయఁబడినవానిని నాశమొనర్పను, కాని తమ యంతటఁ దామేమియుఁ జేయనేరవు" అనిచింతించుచు సభలో నీరీతిగఁ బల్కెను. "ఈతఁడు నిపుణుఁడగు శిల్పిగాఁడు; రేఖాంకిత ముఖుఁడగు వానరుండు, తనజాతిధర్మమునుబట్టి పరకృతంబగు దానిని నాశనమొనర్పఁగలఁడు" అని యనెను. "అట్లేకావలెనుస్వామీ!" అని

అనుచు రాజవల్లభులు మర్కటమును దీసికొనిపోయిరి. ఒకటి రెండు దినములు గడచిన పిమ్మట నాకోతికి విశిష్ట వస్త్రములఁ గట్టి న్యాయస్థానమునకుం గొంపోయిరి. "మీ జనకుని కాలమున, స్వామీ! యీతఁడు న్యాయ నిరూపణంబుఁ గావించెడి న్యాయాధికారి. ఈతని మీరు న్యాయనిరూపణకార్యంబున సహాయకారిగఁ గ్రహింపవలయును" అని వారు కుమారునికి నివేదించిరి. అంతఁ గుమారుఁడా మర్కటమును లెస్సగఁ బరికించి చూచి యిట్లు చింతించెను. "బుద్ధియును, విశాలశీలతయును, గలపురుషుఁడంత రోమముఁ గలిగియుండఁడు. విచారశూన్యంబగు నీమర్కటంబు న్యాయనిరూపణశక్తియుక్తంబు కాదు" అని యనుకొని వారితో "యీరోమశజంతువునందు మేధాశక్తి యుండదు. నాకు విశ్వాసంబు జనింపకున్నది. నా జనకుండు బోధించినదెద్దియు నీతనికిఁ దెలియదు. ఈమృగమునకేమియు బుద్ధిలేదు" అనియు నెను. "అట్లైయుండవలయును, స్వామీ!" అని యనుచు రాజవల్లభులా వానరునిఁ దీసికొనిపోయిరి. అపుడు రాజుతో "స్వామీ! మీ జనకుని కాలములో నీతఁడు మీ జననీజనకుల సేవఁ జేసి కుటుంబము నవృద్ధుల గౌరవించినాఁడు కాన నీతని మీయొద్దనుంచుకొనవలయును" అని చెప్పిరి. కుమారుండా మర్కటమును గాంచి "వానరములు చంచలచిత్తములు అట్టిపనినవి చేయనేరవు" అని చింతించి వారితో "దశరథుఁడు నాకొకబోధఁ గావించెను. జననీజనకులకును, భగినీసోదరమిత్రాదులకును, నట్టిప్ర గమెట్టి సాయమునుం జేయలేదు" అని యనిన "అట్లైయుండవలయును, ప్రభూ!" అని ప్రత్యుత్తరమిచ్చి వారు వానిం దోడ్కొనిపోయిరి. అటుపిమ్మట వారిలో నొకడు "ఈకుమారుండు ధీమంతుఁడు, పరిపాలనాదక్షుఁడు" అని యనుకొని బోధిసత్త్వునిఁ బట్టాభిషిక్తుని జేసి రాజ్యమునందంతటను "ఆదర్శముఖ నరపాలుని శాసనంబులు" అని చాటించిరి. అప్పటినుండియు బోధిసత్త్వుఁడు ధర్మముగ రాజ్యపరిపాలనఁ జేయుచుండెను. భరతవర్షమునందంతటను నతని మేధా



శక్తి ప్రశస్తిఁ గాంచెను. వాని బుద్ధిచాతుర్యమును గనుపఱచుట కీవదునాల్గు ప్రశ్నల నాతనికిచ్చిరి. అకథాక్రమం బిట్లు జరిగెను.

బోధిసత్త్వుఁడు పట్టాభిషిక్తుఁడైనతోడనే గామణీచండుఁడను జనసంధనరపాలకుని సేవకుఁడు "తనతో సమవయస్కులగు వారిసాయమున నీరాజ్యమును రాజు పరిపాలించిన విఖ్యాతిఁ గాంచును. కాన జనపదంబునకేగి కృషీవలుండనై జీవనముఁ గావించెద" అని చింతించి యాపురమునకు మూడుక్రోసుల దూరమునందున్న యొకపల్లెకుం జని యందు వసించుచుండెను. అప్పుడీతనికిఁ గృషిచేయుటకు వృషభములు లేకుండుటచే వర్షము పడిన మీదప నొకమిత్రుని యొద్ద రెండెద్దుల నెరవుపుచ్చుకొని దినమంతయు దున్ని, పిమ్మట వానికి ఘాసంబు వేసి మేపి, వానిని మరల నిచ్చివేయుటకుఁ దనమిత్రుని యింటికిం జనెను. ఆసమయమున యజమాని భార్యతోఁ గూడి భోజనమునకుఁ గూరుచుండెను. ఆవృషభములును దమకుఁ బరిచితస్థలంబగుటచే నెమ్మదిగ గృహమును బ్రవేశించెను. అయ్యవి ప్రవేశించునప్పటికి యజమాని కంచము నెత్తుచుండెను. గృహిణి కంచము దించెను. అప్పుడు వారలాతనిని భోజనమునకుఁ బిలువకుండుటచే గామణీచండుఁడు ప్రత్యక్షముగ నావృషభముల యజమానునకొప్పచెప్పకుండఁగనే యింటికిఁ దిరిగిపోయెను. ఆరాత్రియందుఁ జోరులు గోష్ఠంబుఁ బ్రవేశించి యెద్దులను దొంగిలించుకొనిపోయిరి.

మఱునాటి యుదయమున వృషభస్వామి గోష్ఠముం బ్రవేశించి చూచెను. కాని తనవృషభము లచట లేకుండెను. అవి దొంగలింపఁబడినవని యతఁడు గ్రహించెను. "గామణి నాకచ్చుకొనునట్లు చేసెదను" అని చింతించి గామణి యింటియొద్దకుఁ బోయెను.

వృషభస్వామి:—ఓయీ! నావృషభముల నిచ్చివేయుము.

గామణి:- అవి నీగోష్ఠమున లేవా?

వృషభస్వామి:- నీవు వానిని నాకప్పగించితివా?

గామణి:- నేను నీకప్పగింప లేదు.

వృషభస్వామి:- ఇదుగో రాజభటుఁడు. నీవు నాతో రమ్ము.

ఈజనపదములలో నొకయాచారమున్నది. వారొకశిలనైనను, ఘ
టశకలంబునైనను గనుపఱచుచు "ఇదుగో రాజభటుఁడు. నాతో
రమ్ము," అనిన నామనుజుఁడెట్టివాఁడైనను నట్లు కావింపనియెడల దం
డింపఁబడును. కాన భట శబ్దమును వినినతోడనే గామణీచండుఁడు
వానితో బయలుదేరెను.

వారిరువురు నట్లు న్యాయస్థానమునకుం బోవుచుండిరి. మార్గం
బున గామణిమిత్రుఁడు వాసము చేయుచున్నయొక గ్రామము జేరిరి. అ
ప్పుడు గామణి యా రెండవవానితో నిట్లు చెప్పెను: "ఓయీ! నాకెంత
యు నాకలి వేయుచున్నది. నేను లోనికింబోయి తినుటకేమైనం దె
చ్చుకొనువఱకిచ్చోట నుండుము" అనుచు మిత్రగృహంబుఁ జొచ్చెను.

అప్పుడతని మిత్రుఁడింట లేడు. అతనిభార్య "అయ్యా,
వండినదేదియు సిద్ధముగ లేదు. అచిరకాలముననే వండి తమకు వడ్డిం
చెదను" అని చెప్పెను. పిమ్మట నామె నిచ్చెన నెక్కి ధాన్యకోష్ఠంబు
లోనికిం జనుచుఁ దొందరలోఁ గాలుజారి క్రిందఁబడెను. ఆమె
యపుడు సప్తమమాసగర్భిణియగుటచే నామెకు గర్భస్రావము
గలిగెను.

ఆసమయమున గృహస్థింటికివచ్చి, జరిగినదంతయుఁ దెలిసికొని
"నీవు నాభార్యనుగొట్టి, యకాలప్రసవంబుఁ గావించితివి. ఇదుగో
రాజభటుఁడు, రమ్ము" అని తొల్లిటివానితోఁ గలిసి గామణిని మధ్య
నుంచుకొని వారు పోవుచుండిరి.



వారట్లు పోవుచుండ గ్రామద్వారమునొద్ద నొక గుఱ్ఱము సవా
రునకు లొంగక యీడ్చుకొని పోవుచుండెను. అప్పుడు గామణి
నాయశ్వరక్షకుఁడు చూచి "మామా చందగామణీ! యీయశ్వము
నేదేనితోనైనం గొట్టి మళ్లింపుము" అని వేడిన గామణి యొక రా
తినెత్తి దానిపై విసరెను. అది యశ్వపాదంబులలో నొకదాని
నేరండకాండంబుభాతిఁ బగులంగొట్టెను. "ఓయీ! నీవు నాయశ్వ
పాదంబును విరుగఁగొట్టితివి. ఇదుగో రాజభటుఁడు" అనుచు వానిం
బట్టుకొనెను. గామణి యట్లు మువ్వురు మనుజులచే నిరుద్ధుఁడై వారల
తోఁబోవుచు "వీరు నన్ను రాజునొద్ద నిందించెదరు. వృషభముల
మూల్యమునే నీయఁజాలను. అకాలప్రసవముఁ గావించినందులకు
రాజు విధించు ధనదండన నసలే యీయలేను. అశ్వమూల్యం బెట
నుండి యిఁక దెచ్చువాఁడను? ఇప్పుడు నేను జచ్చిన బాగుగనుండును"
అని తనమనమునఁ జింతించుకొనుచుండెను. వారట్లు పోవుచు బాట
ప్రక్క నొకవనమును నందొకవైపునఁ బాతుకంబగు నగమును జూ
చిరి. ఆకొండనీడయందు నైణులగు తండ్రికొడుకు లిరువురు చాప
నొకదానిని నేయుచుండిరి. గామణి తననిర్బంధకులతో "అయ్యలా
రా! యీయదనుననే నొకసారి మఱుఁగునకుఁ బోవలెను. నేను మ
ఱుగునకుఁ బోవునపుడు మీరలిచ్చోటనే యుండుఁడు" అని చెప్పుచు
నాతఁడానగంబు నెక్కి ప్రపాతంబు మీఁదినుండి క్రిందికుఱికెను.
గామణి నైణులలోఁ బెద్దవానిపైఁ బడెను. వాఁడు తత్క్షణమే మరణిం
చెను. గామణి నిలువఁబడియుండెను. అప్పుడు "ఓరీ ఖలుఁడా! నీవు
నాతండ్రిని జంపితివి. ఇదుగో రాజభటుఁడు" అనుచు నా నైణపు
త్రుఁడు కేకలిడుచు గామణిహస్తములఁ బట్టుకొని వనమునుండి బ
యలునకుఁ దీసికొనివచ్చెను. అచటివారలు "ఇది యేమి?" అని యడి
గిరి. "ఈధూర్తుఁడు నాజనకునిఁ జంపెను" అని యానైణపుత్రుఁ
డుత్తరమిచ్చెను. పిమ్మట వారు నలువురును గామణీచండుని మధ్యనిడు
కొని పోవుచుండిరి. అట్లు పోవుచు వారొక గ్రామద్వారమును జే
రిరి. అచటనున్న గ్రామయజమాని గామణీచందునిట్లు పలుకరించెను.

యజమాని:—మామా! చందా! యెచటకేగుచున్నావు?

చందుఁడు:-రాజదర్శనార్థము పోవుచున్నాను.

యజమాని:-రాజదర్శనార్థమా? నేనొకసందేశమును రాజునకుఁ బంపుచున్నాఁడను; నీవాసందేశమును దీసుకొనిపోయెదవా?

చందుఁడు:-నిశ్చయముగ నేను గొంపోయెదను.

యజమాని:-నేను సహజముగ స్ఫురద్రూపిని, ధనికుండను, గౌరవార్హుఁడను, నిరామయుండను. కాని యిపుడు విపన్నుండనైతిని. పాండురోగార్తుండనైతిని. నేనెందులకిట్లైతినో నరవాలునడుగుము. రాజు మంచిబుద్ధిమంతుఁడని లోకశ్రుతి కలదు. అతఁడు కారణమేదైనఁజెప్పిన నీవునాకాతని నుడువుల వినిపింపుము

గామణీచందుఁడందుల కియ్యకొనెను. పిమ్మట నింకొకగ్రామమునగణికయొకర్తుక "మామా! చందా! యెటకేగుచున్నాఁడవు?" అని ప్రశ్నించెను.

చందుఁడు:—రాజదర్శనార్థము.

గణిక:—రాజుమేధావి యని జనులుచెప్పుచున్నారు. నాసందేశము నాతనికడకుఁ గొంపొమ్ము. ఇంతకుమున్ను నేనెంతయో ధనమార్జించుచుండెడిదానను. ఇప్పుడు తాంబూలపువిలువైనను సంపాదింపలేకున్నదానను; నన్నెవరును వరించుటలేదు. దీనికిఁ గారణమును రాజునడిగి నాతోఁజెప్పుము.

మూఁడవగ్రామమునఁ దరుణవయస్కురాలగు నొకయువతి గామణితో "నేను నాభర్తయొద్దఁగాని, పుట్టినింటఁగాని, యుంతి



లేకున్నదానను. రాజును దీనికిఁ గారణంబడిగి నాతోఁ జెప్పుము." అనిచెప్పెను.

ఆమార్గంబున కనతిదూరంబున సర్పమొకటి వల్మీకసామీప్యమున నివసించుచు గామణింజూచి "ఎక్కడికేగుచున్నావు, చందా?" అనిప్రశ్నించెను.



చందుఁడు:-రాజదర్శనార్థము.

పాము:—రాజు ప్రజ్ఞావంతుఁడు. నాసందేశమును రాజుకడకుఁగొనిపొమ్ము. ఈవల్మీకమునుండి, గ్లానుండను, క్షుత్పీడితుండనునై యాహారార్థము వెలువడునపుడు దేహము బిలద్వారమునఁ బట్టక యతికష్టముతో దేహమునంతను నీడ్చికొని పోవుచుంటిని. పిమ్మట సాకలితీర్చికొని తృప్తిఁజెంది బిలపార్శ్వముల నంటకయే లోనికిఁబోవుచున్నాను. ఇదియేలనో రాజునడిగి నాకు జవాబునుఁదెమ్ము.

అచటినుండి పోవుచుండ మఱికొంతదవ్వున మృగంబొకటి వానింగని యిట్లుచెప్పెను. "నేనీవృక్షముక్రిందఁ దప్ప మఱియెచ్చటను గడ్డిఁదినలేకున్నాను. రాజుందానికిఁ గారణంబడిగిరమ్ము" అని నపిమ్మటఁ జకోరంబొకటి "నేనీవల్మీకమహాలమునుండి గానమును శ్రావ్యముగ సల్పఁగలను. వేఱుచోటునఁ జేయఁజాలను. రాజునిందులకుఁ గారణంబడుగుము," అనిచెప్పెను. పిమ్మటఁ దరుదేవతయొకటి వానింగని "ఎచటికి బోవుచున్నావు, చందా?" అనిప్రశ్నించెను.

చందుఁడు:—రాజదర్శనార్థము.

దేవత:—రాజుప్రజ్ఞావంతుఁడని చెప్పుదురు. పూర్వమునన్ను జనులుమి

క్కలిగఁ బూజించుచుండెడివారు; ఇప్పుడు పల్లవముష్టినైన నొకియ్యకున్నారు. కారణము రాజునడుగుము.

మఱికొంతదూరమున సర్పరాజాతనింగని "రాజు ప్రజ్ఞావంతుఁడని లోకప్రతీతికలదు. వానినీప్రశ్న నడుగుము. ఈజలాశయంబున నీవఱకు జలంబులు స్ఫటికంబుభాతి నిర్మలములై యుండెడివి. ఫేనయుక్తములు కలుషములునై యిప్పుడున్నవి. కారణము నడుగుము," అనిచెప్పెను.

మఱియుం గొంతదూరమునఁ బట్టణంబున కనతిదూరంబున వనవాసులగు కొందఱు సన్న్యాసులాతనింగని యిట్లుచెప్పిరి: "రాజు మతిమంతుఁడనిచెప్పుదురు. పూర్వమీవనమందు స్వాదుఫలంబులు సమృద్ధిగనుండెడివి. ఇప్పటిఫలంబులు రుచిహీనంబులును, రసహీనంబులునునైయున్నవి. దీనికిఁ గారణంబాతని నడుగుము" అని యనిరి. అట్లు మఱికొంత దూరముపోయి వారుపురద్వారమును జేరిరి. తత్సమీపస్థంబగు శాలయందున్న బ్రాహ్మణధాత్రులు గామణిచందునితో నిట్లుసంభాషించిరి.

ధాత్రులు:—చందా! యెచటకేగుచున్నాఁడవు?

చందుఁడు:—రాజదర్శనార్థము.

ధాత్రులు:—అట్లైన మాసందేశముం గొనిపొమ్ము. ఇప్పటివఱకును మేము పఠియించిన ప్రతివచనమును, విశదంబై కన్పట్టుచుండెడిది. ఇప్పుడది పగిలినకుండలోని నీటివలె జారిపోయుండెనన్నది, బోధపడకున్నది. అర్థము దురవగాహంబై యున్నది. దీనికిఁ గారణము రాజునడుగుము. ఈపదునాల్గు ప్రశ్నలతోనతఁడు రాజదర్శనముఁగావించెను. రాజాతనిఁజూచి పోల్చుకొనెను. "నన్ను వనకంబులలోనిడికొని లాలనము



గావించుచుండెడి సజ్జనకుని సేవకుఁడే యీతఁడు. ఇంతకాలము దనుక నెచటనున్నవాఁడో!" అనిచింతించి వానితో నిట్లు సంభాషించెను.

రాజు:—చందా! యింతకాలమువఱకు నెచ్చటనుంటివి? చాలకాలము నుండియుఁగన్పడుటలేదే? ఏదులకిచ్చటికివచ్చితివి?

చందుఁడు:—ఓస్వామీ! నాసరపాలుఁడు స్వర్గస్థుఁడైన పిమ్మట, జనపదంబుఁజేరి కృషీవలుఁడనై జీవించుచుంటిని. ఈతఁడు నాపై పశువులకై యభియోగంబుఁదెచ్చి నన్నుఁ బిలిచి యిచటకు తీసికొనివచ్చెను.

రాజు:—నిన్నీతఁడు రావింపకుండిన నీవు రాగయే యుందువు. ఏదో విధమున నీవిచ్చటకు వచ్చినందులకు సంతోషించుచున్నాఁడను. నీయంశము విచారించెద. ఆమనుజుఁడేడీ?

మొదటివాఁడు:—స్వామీ! హాజరు.

రాజు:—మన్మిత్రుండగు చందునిఁ బిలుచుకొనివచ్చిన వాఁడవునీవా

వాది:—మహాప్రభూ! అగును.

రాజు:—ఎందులకు?

వాది:—నావృషభయుగలంబు నాకిప్పింపుఁడు.

రాజు:—అది నిజమగునా, చందా?

చందుఁడు:—"నాకథనుగూడ వినుండు, స్వామీ!" అనుచు రాజునకు నిజవృత్తాంతంబంతయు నివేదించెను. పిమ్మట రాజు వాదినిట్లు ప్రశ్నించెను.

రాజు:—నీవు వృషభములు శాలను బ్రవేశించుచుండఁగఁ జూచితివా?

వాది:—నే వానిం జూడలేదు స్వామీ.

రాజు:—ఏమీ? నీవు నా నామమును వినియుండలేదా? నన్నాదర్శముఖ మహారాజని పిలిచెదరు. నిజము చెప్పుము.

వాది:—నేను వానిం జూచితిని, అధిపా!

రాజు:—చందుఁడా? నీవు వాని వృషభముల నీయలేకుండుటచే నాతనికిఁ దద్విషయమై ఋణ్యపడితివి. కాని యీ పురుషుఁడు పశువులఁ జూడలేదనుటలో నసత్యముఁ బల్కినాఁడు. కాన నీ హస్తములతో వాని గ్రుడ్లను బీకి, వానికి వృషభమూల్యముగ చతుర్వింశతి సువర్ణముల నీయవలెను.

అప్పుడా వృషభస్వామిని బయటికిం దీసికొనిపోయిరి. పిమ్మట వాఁడు "నా కండ్లను గోల్పోయినపిమ్మట నాకెందులకీ ధనము" అని గామణి పాదంబులపైఁబడి "ఓ చందా! ఆయిరువదినాల్గు సువర్ణములను నీవే యుంచుకొనుము. వీనినిగూడ స్వీకరింపుము" అనుచు వానికి మఱికొంత ధనమిచ్చి పారిపోయెను.

తరువాత రెండవ పురుషుఁడిట్లు రాజునకు నివేదించెను!

వాది:—స్వామీ! వీఁడు నా భార్యను గొట్టి గర్భస్రావముఁ గావించినాఁడు.

రాజు:—చందా! ఇది నిజమగునా?

పిమ్మట చందుఁడు తనకథను వినుమని ప్రార్థించి జరిగిన వృత్తాంతంబంతయు నివేదించెను.



రాజు:-చందా! నీవు సత్యముగ నామెం గొట్టి గర్భస్రావంబొనర్చితివా?

చందుఁడు:-లేదు ప్రభూ! నేనట్టిపని చేయలేను.

రాజు:-(వాదిం జూచి) ఈతఁడు కలుగఁజేసిన గర్భస్రావమును గుదుర్పఁగలవా?

వాది:-నేనట్లు చేయలేను, మహారాజా!

రాజు:-ఇప్పుడేమి చేయనిచ్ఛగించుచున్నాఁడవు?

వాది:-నాకొక పుత్రుండు కలిగియుండవలయును, రాజా?

రాజు:-"ఓయీ, చందుఁడా! యీతని భార్యను నీ గృహంబునకుఁ గొంపోయి, యామెయందు నీకొక పుత్రుండు పుట్టిన నా బాలుని నామె భర్తకిచ్చివేయుము" అని చెప్పెను. పిమ్మట నీతఁడుఁగూడ చందుని పాదములపైఁబడి "నా సంసారవిచ్ఛేదమును గావింపకుము" అని వేడికొని కొంత సొమ్మాతనికిచ్చి, తన దారిం బోయెను.

పిమ్మట మూడవవాఁడు తన గుఱ్ఱమును గుంటిదానిఁగ నొనర్చెనని రాజునొద్ద హానిపై నభియోగముం దెచ్చెను. చందుఁడు జరిగినదంతయు రాజునకుఁ జెప్పెను. రాజు వాదినిట్లడిగెను.

రాజు:-నీవు నిజముగ గుఱ్ఱముం గొట్టి త్రిప్పివేయుమని చందునిఁ బ్రార్థించితివా?

వాది:-"స్వామీ! నేనాతని నడుగలేదు" అని చెప్పియు, రాజు నిర్బంధింపఁగ నది నిజమేయని యొప్పుకొనెను.

రాజు:-వీఁడు తన గుఱ్ఱమును వెనుకకుఁ దరిమివేయుమని నిన్నడుగ

లేదని యనృతమాడినాఁడు. కానవాని నాలుకను బీకివేయుము. నేను నీకొసంగు వేయిసువర్ణముల నీతనికశ్వమూల్యముగ నిచ్చివేయుము" అనిన వాఁడు భయపడి చందునిఁ బ్రార్థించి కొంతధనమాతనికిచ్చి వెడలిపోయెను.

పిమ్మట వైణుని పుత్రుండు రాజునకిట్లు నివేదించెను;

వైణునిపుత్రుఁడు:- వీఁడాతతాయి. నాజనకునిఁజంపినాఁడు.

రాజు:- అటులనా! చందా!

చందుఁడుజరిగినదంతయు రాజునకు నివేదించెను.

రాజు:- (వానింజూచి) నీకేమి కావలయును!

వాఁడు:- నాకు జనకుఁడు కావలయును.

రాజు:- చందా! వీనికిఁ దండ్రికావలయునఁట. మరణించిన వానితండ్రిని రావింపనేరవు. కావున వానిజననిని నీనివాసంబునకుం దోడ్కొనిపోయి, వానికినీవు జనకుండవగుము.

పిమ్మట వాఁడిట్లు చందునిఁ బ్రార్థించెను. "ఓస్వామీ! మృతుండగు నాజనకుని కుటుంబమును విచ్ఛేదముఁ గావింపకుము" అనుచుఁ జందునకుఁ గొంతధనమిచ్చి యతిశీఘ్రముగఁ బోయెను.

ఈతీరున గామణి యన్నిటియందు జయంబుఁగాంచి సంతోషాతిశయమున రాజునకిట్లు నివేదించెను. "ప్రభూ! మార్గమున నన్ననేకులుచూచి మిమ్ముఁగొన్నిప్రశ్నలనడుగుమని చెప్పినారు. నేను దమకువానినిపుడు మనవిఁజేయవచ్చునా?" అనెను.

రాజు:- అవి యేవియో చెప్పుము.



పిమ్మట గామణి బ్రాహ్మణయువకుని ప్రశ్ననారంభించుకొని ప్రశ్నలనన్నిటినిఁ గ్రమముగఁజెప్పెను. రాజుక్రమముగ నీతీరునవాని కన్నిఁటికి నుత్తరమిచ్చెను.

మొదటిప్రశ్న:- వారునివసించుప్రదేశమునఁ గాలవేదియగునొక కోడియుండెడిది. వారికోడికూత వినినంతనే మేల్కాంచి సూర్యోదయమగు వఱకుఁ బఠించుచుండుటచేఁ జదివినదిమఱువకుండెడివారు. ఇప్పుడయ్యెడ నకాలమునఁ గూయుకోడియున్నది. అది యర్ధరాత్రిమునఁగాని, దినమధ్యంబునఁగాని, కూయుచున్నది. నడిరేయియందని కూయఁగనే వారు మేల్కాంచి చదువనారంభింతురు. కాని పఠనసమయంబున నిద్రావేశపరవశులై యుందురు. కుక్కుటము ప్రభాతసమయంబునఁ గూయునపుడు వారు చదువుటకు సమయముండదు. అందువలన వారుచదివినదంతయుఁ ద్వరలో మరచుచున్నారు.

రెండవప్రశ్న:- తొల్లి వీరు సన్న్యసాశ్రమవిధులఁ జక్కఁగ నెరవేర్చి గాఢసమాధియందుండెడివారు. వారిప్పుడు సన్న్యాసవిధులఁబరిత్యజించి, చేయరాని పనులను జేయుచున్నారు. కొందఱు భిక్షాటనముఁ జేసి తెచ్చిన దానిని వారందఱింటికడనుండి భుజించుచున్నారు. వనమున ఫలించు ఫలంబులనుపచారకుల కొసంగుచుఁ బాపమార్గమున జీవించుచున్నారు. అందువలన ఫలంబులు రుచ్యములుకాకయున్నవి. వారెప్పటిపలెసన్న్యసాశ్రమవిధుల నిర్వర్తించిన, ఫలములెప్పటివలె మధురంబులగును. ఈసన్న్యాసులు రాజులవివేకము నెఱుంగరు. వారితోఁ బాపసవృత్తిమండుమని చెప్పుము.

మూఁడవప్రశ్న:- ఆసర్పరాజులు పరస్పరము విరోధించుటచే నదకం

బు కలుషంబగుచున్నది. తొల్లిఁటివలెవారు స్నానంబున నుండిన నుదకంబు నిర్మలంబగును.

నాల్గవప్రశ్న:-తరుభూతంబు మునువు తనమార్గంబునఁ బోవుపథికుల సంరక్షించుటచే ననేకోపహారంబులఁ బొందుచుండెడిది. ఇప్పుడట్టి రక్షణము నొసంగకుండుటచే నుపహారంబులఁ బొందకున్నది. తొల్లిఁటివలె నామె పథికుల రక్షించిన మరల నామె యుపహారంబులఁ బొందఁగలదు. ప్రపంచమున నృపులున్నారని యామెకుఁ దెలియదా యేమి? అటవీమార్గమునఁ బోవుపథికుల సంరక్షింపుమని యామెతోఁ జెప్పుము.

ఐదవప్రశ్న:-ఏవామలూరు మూలంబునఁ జకోరంబు సునినాదంబుఁ గావింపఁ గల్గుచున్నదో, యాప్రదేశమున ధనభాండంబున్నయది. దాని నుత్ఖాతంబుఁ గావించి పరిగ్రహింపుము.

ఆఱవప్రశ్న:-ఏతరుమూల ప్రదేశమందలి ఘాసంబును మృగము భక్షింపఁగలుగుచున్నదో, యావృక్షమున ఘనకరండంబున్నయది, మధునిష్యంద గ్రాసంబు నభిలషించుటచే నితరగ్రాసంబు రుచింపకున్నయది. నీవా మధుకోశముఁ దీసియందుఁ బ్రశస్తమగు భాగమును నాకిచ్చి, మిగిలినదానిని భక్షింపుము.

ఏడవప్రశ్న:-సర్పవల్మీకాధోభాగంబున నొకధనకలశంబున్నయది. దానిని రక్షించుచు నాసర్పంబున్నది. కాన నాసర్పంబు వెలువడునపుడు ధనకాంక్షచేఁ దన దేహంబు సంలగ్నంబగుచున్నది, భోజనాంతరమున ధనమోహంబాతని దేహంబును సంసక్తీభూయంబుగ నొనర్పకుండుటచే నతిత్వరితముగ బిలప్రవేశముఁ జేయఁగల్గుచున్నది. నీవాధనమును ద్రవ్వి పరిగ్రహింపుము.



ఎనిమిదవప్రశ్న:-భర్త నివసించు గ్రామమునకును తనజనకుఁడున్న గ్రామమునకును, మధ్యనున్న యొక గృహంబున నామె ప్రియుఁడు నివసించుచుండెను. వానియందుండు మోహముచే నామె మనంబటుపోవుచున్నది. కాన భర్తృగృహంబున నుండనొల్లక జననీజనకులఁ జూడఁ బోయెదనని చెప్పుచు మార్గంబునఁ బ్రియునిగృహమునందుఁ గొన్నినాళ్లుండును. జనకగృహంబునఁ గొన్నినాళ్లుండి మరలఁ బ్రియుండు జ్ఞాపకమునకు వచ్చునపుడు భర్తృగృహంబునకుఁ బోవుదునని చెప్పి ప్రియునికడనుండును. నీవుపోయి యామెతో నీదేశమున రాజులున్నారని చెప్పుము. మఱియు 'నీభర్తతో నీవు కాపురము చేయుము. లేకున్న రాజు నిన్ను వధించును' అని చెప్పుము

తొమ్మిదవప్రశ్న:-ఆగణిక మున్నొకనియొద్ద ధనముఁ గైకొని యాతని సంతోషపెట్టకుండ నింకొకనిధనము స్వీకరింపకుండెడిది. అక్కాలంబున బహుధనం బార్జించెను. ఇప్పుడామె తనవిధానమును మార్చి ప్రథమమున ధనమిచ్చినవాని యనుజ్ఞరాకుండఁగనే వేఱొకనిఁ గూడుచున్నది. కాన నామె నెవ్వరును గోరలేరు. ధనముసైతము దొరకలేదు. ఆమె పూర్వాచారమునననుసరించిన నామె తొల్లిటివిధమున నుండఁగలదు. అట్లు చేయవలయునని యామెతోఁ జెప్పుము.

పదియవప్రశ్న:-ఆగ్రామముఖ్యుఁడు తొల్లిపక్షపాతము లేక న్యాయంబిచ్చుచుండెడివాఁడు. కావున మనుజులాతనిఁ బ్రేమించుచుండెడివారు. పారితోషికంబుల సైతమిచ్చుచుండెడివారు. ఇదియేవానిని సుందరునిగను, ధనికునిగను, గౌరవార్హునిగను, జేయుచుండెడిది. ఇప్పుడాతఁడు లంచములఁ గోరుచు తీరణంబులన్యాయంబులుగ నొనర్చుచున్నాఁడు కావున వాఁడిపుడు, దీనుండును, దుఃఖితుండును, బాండురో

గపీడితుండునై యున్నాఁడు. ఎప్పటివలె నిర్ధారణముల యథాన్యాయముగఁ జేసిన మనుబటివలె నుండఁగలఁడు. దేశమున రాజున్నాఁడని గుర్తెఱుంగఁడా యేమి? నిర్దేశంబున న్యాయంబు గనుపఱుపవలయునని చెప్పుము.

రాజీతీరున సర్వజ్ఞుండగు బుద్ధునివలె నన్నిప్రశ్నలకు సదుత్తరములనిచ్చి, గామణీచందునకు విలువైన పారితోషికములనిచ్చి, బ్రాహ్మణుల కగ్రహారదానంబుఁ జేసినట్లు వాని నివాసగ్రామమును వానికిచ్చి పంపివేసెను. పిమ్మట గామణీచందుఁడు యథాశ్రుతంబుగ వారివారిప్రశ్నముల కుత్తరములఁ జెప్పెను.

---

## 260 దూత జాతకము.

పూర్వము న్ను బ్రహ్మదత్తుఁడు వారాణశిని బరిపాలించుచుండ బోధిసత్త్వుఁడు వానికిఁ బుత్త్రుఁడై పుట్టెను. బోధిసత్త్వుఁడు యుక్తవయస్కుండై తక్కశిలానగరమున విద్యలఁబూర్తిగా నభ్యసించెను. తండ్రిమరణానంతరమున నాతఁడు ప్రాప్తరాజ్యుండై స్వాదుభక్ష్యములయందు మిక్కిలి లోలతఁగలిగియుండెను. కాన నతఁడు కోమలన్పాలుండని పేరుఁబొందెను. ఆతఁడు తనభక్ష్యములవిషయమై మిక్కిలి వ్యయముఁ జేయుచు, నొక్కయాహారవిశేషమునకె లక్షలకొలఁదిగ ధనమును వ్యయముగావించుచుండెను. ఆతఁడు గృహాంబున భోజనముఁగావింపఁడు. భోజనసమయమున జనులకు విలువైన తనపదార్థసంచయములఁ జూపి వారిని కృతకృత్యులఁ జేయఁదలఁచి, యలంకరింపఁబడిన మణిమయమంటపమున ధవళాతపత్త్రముక్రిందఁ గనకమయసింహాసనముపైఁ గూర్చుండి, సా



మంతరాజపరివృతుఁడై రుచ్యములగు రసములతోఁగూడిన భోజనపదార్థము నమూల్యంబైన పాత్త్రియందుఁ దినుచుండును.

ఒకనాఁడొక కుక్షింభరుఁడు రాజు భుజించు విధమునుగాంచి తద్భక్ష్యముల రుచిఁజూడ నభిలషించెను. జిహ్వను జయింపనేరక, నడుముఁగట్టుకొని, రాజునొద్దకుఁ త్వరితంబున "రాజదూత, రాజదూత ఓరాజా!" అని కేకలువేయుచు నుద్బాహుండై పరుగులిడుచుఁబోయెను. ఆకాలమునందా దేశమున "దూత" అనియెవ్వఁడైన ననిన వాని నెవ్వరు నడ్డుచుండెడివారుకారు. కావున జనసమూహ మాతనికి దారినొసంగెను. మిక్కిలిత్వరితముగ నాతఁడు పరుగులిడిపోయి రాజపాత్త్రమునుండి యన్నకబళమును బరిగ్రహించి నోటఁబడవేసికొనెను. ఖడ్గపాణియగు రక్షకభటుం డాతని శిరచ్ఛేదముఁ గావించుటకుఁ గరవాలమును గోశమునుండి యాకర్షించెను. గాని రాజాతని నడ్డెను. "వానిఁగొట్టకుము" అనుచు నాతనితో "భీతిఁజెందకుము. కడుపారభుజింపుము", అని హస్తప్రక్షాళనముఁ జేసి కూరుచుండెను. భోజనానంతరమున రాజాతనికి నిజపానీయ తాంబూలములనిప్పించి యిట్లుచెప్పెను.

రాజు:—"ఓయీ! యుదంతములున్నవని చెప్పితివి. నీవందేశమెద్ది?"

మనుజుఁడు:-రాజా! నేను కుక్షిలోభత్వముయొక్కదూతను. లోభత్వము నన్ను "పోపొమ్మ"ని యిచ్చోటకు దూతఁగఁబంపినది ఓరాజా!"

"ఓరాజా! కుక్షిదూత నీయెదుటనున్నాఁడు. ఓరథ్యా! యాగ్రహింపకుము. శత్రువునైన నుదరార్థము సాహాయ్యముకోరుటకై నరులు బహుదూరముఁ బోవుదురు.

"ఓరాజా! కుక్షిదూతను గనుచున్నాఁడవు. ఓరథ్యా! యాగ్రహింపకుము. కుక్షి రేయింబవలు భూతలంబున నరులఁ బాల్పించుచున్నది".

"కుక్షి,ప్రపంచమున రేయింబవలు మనుజులఁ బ్రబలాధికారముతోఁ బాలించుచున్నది."

రాజదివిని "అదినిజము. వీరు కుక్షిదూతలు. లోభత్వముచే బ్రోత్సహింపఁబడి యిటునటువారుపోవుదురు. ఈతఁడెంతచక్కఁగఁ జెప్పినాఁడు!" అనిసంతసించి మరల "ఓయీ! బ్రాహ్మణుఁడా! పింగళవర్ణముఁగల వేయిగోవులను నీకుఁబారితోషికముగ నిచ్చుచున్నాఁడను. వానితో గోవృషంబునుగూడ నిచ్చుచున్నాఁడను. సజీవులందఱును గుక్షిదూతలే కావున నొకదూత నింకొకరికీయవచ్చును" అనిమరల "నేనీవఱకెన్నఁడును విననట్టియు, నూహింపనట్టియు, విషయముల నీప్రాజ్ఞుఁడు చెప్పఁగవింటిని" అనిమిక్కిలి సంతసించి వానిని మిగుల నాదరించెను

---

## 220. కురుధమ్మ జాతకము.

తొల్లి ధనంజయుఁడు కురుదేశము నందలి యింద్రప్రస్థపురమును బాలించుచున్న సమయమున బోధిసత్త్వుఁడు పట్టమహిషిగర్భంబున జనించెను. బోధిసత్త్వుఁడు యుక్తవయస్కుండై తక్షశిలానగరమున విద్యలనభ్యసించెను. పిమ్మట నతనిజనకుండతని నుపరాజుగఁ జేసెను. జనకునిమరణానంతరమున బోధిసత్త్వుఁడు రాజై కురుధర్మంబున దశగుణరాజవిధులఁగావించుచుఁ బరిపాలనముఁజేయుచుండెను. కురుధర్మంబునఁ బంచధర్మంబుల నాదరించుచున్నట్లే, రాజమాతయు. పట్టమహిషియు, ననుంగుసోదరుఁడును, ఉపరాజయు, కులశ్రీమాగతపురోహితుఁడును, బ్రాహ్మణుఁడును, సూతుఁడును, రాజవల్లభుఁడును, రజ్జుగ్రాహకుఁ-



డును, గణకాధికారియు, ధాన్యాగారాధ్యక్షుండును, సామంతప్రభువును, భారవహుఁడును, వేశ్యయు, దాసియు, ననువీరందఱునుగూడ నట్లే యాచరించుచుండిరి. అందఱును నిష్కళంకముగ ధర్మవిధ్యాచరణముఁ గావించుచుండిరి. పురద్వారముల నాల్గిటియొద్దను, బురమధ్యంబునను, బ్రాసాదద్వారంబుకడను, నొక్కొకటిచొప్పున నాఱు భిక్షాగృహంబుల రాజుగట్టించెను. ప్రతిదినమునను నాఱులక్షలవరహాల దానమిచ్చుటచే భరతఖండంబునంతటను నాతనికీర్తి వ్యాపించెను అతనికి దానమునందుండు ప్రేమాసక్తులు దేశమంతటను వ్యాపించెను.

అక్కాలంబునఁ గళింగరాజ్యమందలి దంతపురంబునఁ గళింగరాజను వాఁడుండెను. వానిరాజ్యమునం దనావృష్టివలన దుర్భిక్షము సంభవించెను. ఆహారాభావంబున మహామారి జాడ్యము సంభవించునని జనులు తల్లడిల్లుచుండిరి. అనావృష్టిభీతియు, మారీజాడ్యంబువల్లనైన భీతియు వారిమనంబుల విడువకుండెను. నిరాధారులై జనులు తమబాలుర హస్తములఁ జేతులతోఁ బట్టుకొని యిచ్చటకు నచ్చటకుం దిరుగుచుండిరి. అప్పుడు జనులందఱుఁ గుమిఁగూడి దంతపురంబునకు బోయి రాజద్వారముకడ సంక్షోభముఁ గావించుచుండిరి. వాతాయనోపకంఠంబుననుండి వారిధ్వని విని పరిజను[illegible] రాజిట్లనెను.

రాజు:—జనులెందుల కిట్టిసంక్షోభముఁ గావించుచున్నారు.

రాజవల్లభులు:—ప్రభూ! మూఁడు భయములు సర్వజనుల హృదయంబులఁ బరితపింపఁ జేయుచున్నవి. దేశమున వర్షము లేదు. పంటలు పోయినవి; దుర్భిక్షము సంభవించినది. అక్కతంబున జనులు నిరాహారులును, నిరాధారులును, రోగపీడితులునై, బాలుర చేతులంబట్టుకొని యిటునటుఁ దిరుగుచున్నారు.

ప్రజలు:—ఓరాజా! మాకు వర్షములఁగురిపింపుము.

రాజు:—పూర్వపు రాజులనావృష్టి సమయము లందేమిచేయుచుండెడివారు.

ప్రజలు:—పూర్వపురాజులు, ఓరాజా! వర్షములు కురియకుండిన భిక్షాదానంబులఁజేసి, పుణ్యదినంబుఁ బాలించుచుఁ బుణ్యాచరణదీక్షలఁబూని యేడుదినములు వారికోష్ఠమున ఘాసనిర్మితంబైన లఘుతల్పంబులపైఁ బండుకొనుచుండెడివారు. అప్పుడు వర్షములు కురియుచుండెడివి.

"సరియే; అట్లే కావించెదను" అని చెప్పుచు రాజట్లొనరించెను. కాని వర్షముమాత్రము పడలేదు. అంతనాతఁడు రాజకులంబుతో నిట్లనియెను.

రాజు:—మీరు చెప్పినచొప్పుననే చేసితిని- కాని వర్షముమాత్రము పడదాయెను. నేనేమి చేయువలయును.

రాజకులమువారు:—ఓరాజా! ఇందపత్త్రపురంబున సంజన వృషభంబను రాజగజంబున్నది. ఆనాగము కురురాజగు ధనంజయునిది. దానిం దోడ్తెచ్చిన వర్షము కురియును.

రాజు:—మనము దానినెట్లు తేఁగలము. రాజును, దద్బలంబును, జయించుట యంతసులభముకాదు.

రాజకులము:—ఓరాజా! వానితో యుద్ధముఁ గావింప నవసరము లేదు. రాజునకు దానమందత్యధికమగుప్రీతి. అడిగిన మాత్రమున నత్యంత ప్రభాయుక్తంబగు తన శిరంబునైన ఖండించి యిచ్చును; సుందరతరంబగు నేత్రంబునైనఁ బెకలించి యిచ్చును; రాజ్యమునైనను, ధారవోయును. గజముమాట



కటకై ప్రార్థింపనవసరమే యుండదు. నిశ్చయముగ మనకాతఁడాగజమును బ్రసాదించును.

రాజు:—అతని నర్థింప నెవఁడు శక్తుఁడు.

రాజకులము:—ఓమహారాజా! బ్రాహ్మణులాతని యాచింపశక్తులు.

అంతనారాజొక బ్రాహ్మణాగ్రహారమునుండి యెనమండుగురు బ్రాహ్మణుల రావించి సగౌరవంబుగ వారలధనంజయుని సంజన వృషభంబు వేడుటకై యంపెను. పిమ్మట బ్రాహ్మణులు ప్రయాణమునకుఁ గావలసిన ధనముం జేకొని పాంథవేషంబుల ధరియించి, యొకమజిలీయందొక రాత్రికంటె నెక్కుడుకాలవిళంబనసేయక, త్వరితగతిఁబ్రయాణము సాగించి, కొలదిదినములలోనే పురద్వారంబుననున్న భిక్షాదాన గృహంబుంజేరి యటభోజనముఁ గావించిరి. దేహోపచారంబులఁ గావించుకొనినపిదప, "నరపాలుఁ డెప్పుడీగృహంబునకు విచ్చేయును." అని యచటనున్న వారినడిగిరి. "ప్రతిపక్షంబునను చతుర్దశీదివసంబునను, బక్షాంతదినమునను, నష్టమినాడును,రాజియ్యెడకు విచ్చేయును. రేపటిదినము పూర్ణిమయగుటచే నతఁడియ్యెడకు వచ్చును" అని వారుత్తరమిచ్చిరి.

మరునాడు ప్రాతఃకాలముననే బ్రాహ్మణులుత్తరద్వారంబునఁబురమును బ్రవేశించిరి. బోధిసత్త్వుఁడును మజ్జనాభ్యంజనములఁ గావించుకొని, యమూల్యాభరణాంబరాదుల ధరించి, యలంకృతంబైన మహాగజంబునధిష్ఠించి యుత్తరద్వారస్థితభిక్షాదాన గృహంబున కనల్పపరివారసమేతుండై పోయెను. అట నేనుఁగునుండి దిగి, యేడెనమండుగురకు స్వహస్తములతోడనే యాహారంబొసంగి "ఇట్లే భిక్షాదానముఁ జేయుఁడు" అనిచెప్పి నాగము నధిరోహించి దక్షిణద్వారంబునకుం జనెను. ఉత్తరద్వారంబునొద్ద రాజ రక్షకభట నిరోధమువలన రాజును యాచించుట కాబ్రాహ్మణులకు వీలులేకపోయెను.

అంత నాబ్రాహ్మణులు దక్షిణద్వారంబుకడకుం జని రాజురాకకై నిరీక్షించుచుండిరి. రాజు పురద్వారంబునకనతిదూరంబుననున్న యున్నత ప్రదేశంబుఁ జేరునప్పటికిఁ జేతులెత్తి బ్రాహ్మణులు "జయతు జయతు దేవః" అని యాశీర్వదించిరి. రాజు తననాగము నంకుశముతోఁ బొడిచి వారున్నయెడకు మళ్లించెను పిమ్మట రాజు "బ్రాహ్మణులారా! మీయాప్సితమెద్ది?" అని వారలఁ బ్రశ్నించెను. అప్పుడా బ్రాహ్మణులు బోధిసత్త్వుని సుగుణంబుల నీతీరున స్తుతించిరి. "రాజా! నీఋజుమార్గాను వర్తనంబును, సదాచారంబును, విని వచ్చినారము. ఈనాగమునకై యున్నదంతయు వెచ్చించితిమి" అనిరి. అందులకు బోధిసత్త్వుఁడు "ఓబ్రాహ్మణులారా! మీకున్నదంతయు మీరీ గజార్జనమునకై వెచ్చించిన మీకీ యలంకృతంబగు గజంబు నిచ్చుచున్నాఁడను" అని చెప్పుచు వారిని సంతుష్టిఁ బొందించుటకై "మీరు సేవకులైననుసరియే, చిరకాలముక్రిందట నాగురువు లుపదేశించునట్లుగ నాయెడకువచ్చుపట్టి ప్రతిజీవికిని స్వాగతంబు నొసంగుదును. ఈయేనుఁగును మీకుఁ బారితోషికంబుగ నిచ్చుచున్నాఁడను. ఇది యొక నరపాలకున కీయఁదగినది. ఈగజమును భూషణంబుల తోడను, మావటివానితోడను, గొనిపొండు" అని వారితోఁ జెప్పెను.

పిమ్మట మహాత్ముఁడిట్లు గజముపైనుండి "గజమేభాగంబుననైన నలంకరింపఁబడకుండిన నాలోపంబుఁదీర్చి మీకొసంగెదను" అని చెప్పి, యేనుఁగు చుట్టునుం దిరిగి, తుదకుఁ గుడిప్రక్కకుం జని పరీక్షచేసెను. ఏనుఁగు దేహమంతయు నలంకరింపఁబడియే యుండెను. అప్పుడు బ్రాహ్మణుల హస్తంబులయందు గజకరంబు నిడి, రమ్యంబగు బంగారుపాత్రనుండి పరిమళోదకంబును గజంబుపైఁ జల్లి వారికాగజంబు నొసఁగెను. బ్రాహ్మణులా రాజదత్తంబగు గజమును భూషణములతోఁ బరిగ్రహించి, దానిపైఁ గూరుచుండి దంతపురంబునకేగి, తమప్రభువునకు సమర్పించిరి. నాగము వచ్చినను



వర్షములు పడలేదు. వర్షము లేలఁ బడలేదని రాజు ప్రశ్నించెను. "కురురాజగు ధనంజయుఁడు కురుధర్మమున వర్తించుచున్నవాఁడు. కాన నాతనిరాష్ట్రమందుఁ బదిపదునైదు దినములకొకసారి వర్షము కురియుచుండును. అదియే రాజపుణ్యఫలంబు. ఈగజమున నేము యనఁ బుణ్యమున్న నదిమిక్కిలికొంచెముగ నుండవలయును" అని చెప్పిరి. అంతనారాజు "ఈగజమును భూషణములతోఁ గూడ ధనంజయునకిచ్చివేయుఁడు. పిమ్మట సువర్ణఫలకంబుపై ధనంజయుపాలిత కురుధర్మంబు లిఖియించి యిటకుఁగొనిరండు" అని యిట్లాజ్ఞాపించి, బ్రాహ్మణులను, రాజవల్లభులను గురురాజు కడకుఁబంపెను.

వారుపోయి ధనంజయుని దర్శించి గజంబును సమర్పించి "ప్రభూ! త్వత్ప్రసాదాసాదితంబైన గజము వచ్చినపిమ్మటఁ గూడ మాదేశంబున వర్షము కురియలేదు. తాము కురుధర్మంబుల నాచరించుచున్నారని జనశ్రుతికలదు. మాప్రభువుఁగూడఁ దద్ధర్మాచరణఁ గావింప నిచ్చగించుచున్నాఁడు. మీరా ధర్మములఁగనకఫలకంబుపై లిఖియించి తెమ్మని మమ్ములఁ బంపినాఁడు" అని ప్రార్థించిరి. అది విని ధనంజయుఁడు "మిత్రులారా! ఈధర్మంబును నేనివఱకాచరించుచుంటిని. కాన వానివిషయమై నాకిప్పుడొక సందేహము వొడమినది. ఈధర్మంబు నన్ను సంతుష్టాంతరంగునిఁగఁ జేయకున్నది. కాన దానిని నేను మీకియ్యఁజాలను" అని చెప్పెను.

ఎందులకా ధర్మంబు రాజహృదయంబునకు సంతోషముం గూర్పలేదని మీరడుగవచ్చును. అట్లైన నేనుచెప్పునది వినుండు.

ప్రతిమూఁడవయేటను గార్తికమాసంబునఁ గార్తికోత్సవముం జేయుచుండెడివారు. ఉత్సవసమయంబున దేవతలవలె సమూల్య వస్త్రాలంకారభూషితులై వివిధరాగరాజితమైన చిత్రరాజను దేవతసముఖమునఁ జతుర్దిగ్భాగములకును, వివిధరాగరంజితంబులై ప్రగ్రథితంబులైన బాణముల వేయుదురు. ఈరాజొకయుత్సవమున సరోవరత

టంబుపై నిలువంబడి చిత్తరాజ సమక్షమున నాల్గుదిక్కులకు బాణ
ములవేసెను. వానిలో మూఁడు బాణములే యేభాగములయందుఁ
బడినవో తెలిసినవి. కాని నాల్గవది కాన్పింపఁదాయెను. అదిచూచి
రాజు "బహుశః మద్విమోచితశరంబు జలచరంబులపైఁ బడినదే
మో" అని వితర్కించుకొనెను. ఈశంక యుద్భవించినతోడనే వాని
ధర్మమునకుఁ గళంకముగల్గెను. అందుచే నాతనికీ ధర్మము తొల్లిటి
వలె సంతుష్టిఁ గలుగఁజేయకుండెను. దీనినంతటిని రాజువారలకుఁ
జెప్పి "మిత్రులారా! నేను గురుధర్మంబు నాచరించుచున్నాఁడనా
యని శంకవొడముచున్నది. నాజననిమాత్రము దానిని సమముగఁ
బాలించుచున్నది. ఆమెవలన మీరు తెలుసుకొనవచ్చును" అని
చెప్పెను.

బ్రాహ్మణులు:—ఓరాజా! నీవు జీవహింసచేయ నిచ్ఛగింపవు. ఇ
ప్పటనేమియు జీవహింస లేదు. నీవాచరించిన కులధర్మంబు
నకు బ్రసాదింపుము.

రాజు:—"అట్లైన వ్రాయుఁడు" అనివారిచే సువర్ణఫలకంబు
పై నిట్లు వ్రాయించెను.

"ప్రాణుల వధయింపకుఁడు.
అదత్తంబైన దాని స్వీకరింపకుఁడు.
విషయమోహితులై ప్రవర్తింపకుఁడు.
అనృతంబు వల్కకుఁడు.
మద్యపానంబు సేయకుఁడు"

రాజు:—ఇవియన్నియు నను ధన్యునిఁగఁ జేయుచున్నవి. మీరు నా
జననినడిగి తెలిసికొనిన బాగుగనుండును.



పిమ్మట వారు రాజునకు నమస్కరించి యతనియొద్ద సెలవుఁ
గైకొని రాజమాతకడకుంజని "తల్లీ! మీరు కురుధర్మంబును బాలిం
చుచున్నారని వింటిమి. మాకాజ్ఞానముం బ్రసాదింపుఁడు" అని
ప్రార్థించిరి. రాజమాత: "పుత్రకులారా! ఒకప్పుడు నేను కురుధర్మం
బాచరించుచుండెడిదానను. కాని యిప్పుడు నామనస్సు తదాచరణ
విషయమై శంకితంబగుచున్నది. ఈధర్మపాలనంబు నాకానందము
నొసఁగకున్నది. కాన నేను మీకాజ్ఞాన ముపదేశింపఁజాలను" అని
చెప్పెను.

ఆరాజమాత కిరువురు పుత్రులుకలరు. అందు జ్యేష్ఠుఁడు
రాజగు ధనంజయుండు. రెండవకుమారుఁడు ఉపరాజుగనుండెను.
ఒకరాజు ధనంజయునకు లక్షవరహాల విలువగల బంగారుహారంబు
ను సమర్పించెను. రాజును సగౌరవంబుగ నిజజననికి నద్దాని సమ
ర్పించెను. ఆమెయు "నేను జందనలేపనంబుల నుపయోగింపను.
బంగారుహారంబుల వేసికొనెను. కానవానిని నాకోడండ్రికిచ్చెదను"
అని తలంచి "నా జ్యేష్ఠపుత్రుని భార్య పట్టమహిషి! ఆమెకీహారంబు
నిచ్చెదను. రెండవవానిభార్య బీదది. ఆమెకీచందన సుగంధంబుల
నిచ్చెదను;" అని యాలోచించి యట్లే హారంబును రాజ్ఞికిని జంద
నసుగంధంబుల నుపరాజ భార్యకును నిచ్చెను పిమ్మట "నేను
కురుధర్మంబు నాచరించుచున్నదానను. వారు ధనికులైనను బీదలై
నను నాకేమియుఁబనిలేదు. నేను పెద్దకోడలి నారాధించుట యను
చితము. అట్లు చేయకుండుటచే నానదాచరణమునకుఁ గళంకముసం
భవించినది" అని యిట్లామె శంకించుచుండెను. కాన నామె వా
రితో నీయంశముచెప్పెను. "మీహస్తగతంబగు దానిని మీయిచ్ఛ
వచ్చినట్లొసంగుదురు. అట్టి యల్పవిషయములంగూర్చి మీకుసందే
హముండిన మీరింకేమి పాపముఁ జేయఁగల్గుదురు? బుద్ధత్వవినాశము
ట్టి స్వల్పవిషయంబులచేఁ గానేరదు. మాకుఁగురుధర్మంబొసంగుము"

అని వారామెయొద్దఁగూడ సువర్ణ ఫలకంబుపైఁ గురుధర్మంబు లిఖించుకొనిరి.

“ఏమయినను నాకీధర్మాచరణయందు సంతుష్టిలేదు. నాకోడలు దానిని లెస్సఁగ నాచరించుచున్నది. ఆమెవలన మీరు తెలిసికొనుఁడు” అని యామె వారితోఁ జెప్పెను. ఆమెయొద్ద సవినయంబుగ సెలవుఁగైకొని వారు రాజ్ఞినీరీతినే యడిగిరి. ఆమెయు “నేను మీకోరిక నీయఁజాలను. నేను దానిని సమముగఁ బాలించుటలేదు” అని చెప్పెను.

ఒకదినమున వాతాయనమునొద్ద నామెకూరుచుండి క్రిందికిఁ జూడ రాజు పరాజుతోఁగూడ గజంబు నధిరోహించి యూరేగుచుండెను. తద్వీక్షణమాత్రంబుననే యాతని మోహించి “నేనాతనితో స్నేహముఁగావింప వాని భ్రాతమృతిజెంది యాతఁడు రాజై నన్ను బరిగ్రహించిన నేమి?” అని చింతించెను. అప్పుడే యామెకీయాలోచన తట్టెను. “ఋజుమార్గానువర్తినినై సభర్తృకనై పరపురుషుని మోహించితిని; నా సదాచారమునఁ శుద్ధలోపమున్నది,” అని సంతప్తచిత్తయై యామె దూతలకు దీనిం జెప్పెను. వారలిట్లు ప్రత్యుత్తరమిచ్చిరి. “ఆలోచనోత్పత్తియే పాపంబుకాదు. ఇట్టిస్వల్పవిషయమునకే మీరు సంతాపముఁజెందిన మీరేమి పాపముఁజేయఁగలరు. అట్టి స్వల్పవిషయంబు సదాచరణంబున కెగ్గు సేయనేరదు, కావున మీ యాప్పితంబు ప్రవాదింపుఁడు” అనుచుండ నామె కురుధర్మంబుఁ జెప్పెను. వారు కనకఫలకంబుపై వ్రాసికొనిరి. పిమ్మట రాజమహిషి “ఓదూతలారా! నా సదాచరణ సిద్ధంబైనది కాదు. ఉపరాజు ధర్మమును సమముగఁ బాలించుచున్నాఁడు. కాన నాతని నడిగి తెలిసికొనుఁడు” అని చెప్పెను.

ఆదూతలు ఉపరాజుకడకుంజని కురుధర్మముంగూర్చి యడిగిరి. అందులకాతఁడు తానాధర్మమును సరిగఁ బరిపాలించి యుండలేదని చెప్పెను.



ఉపరాజు ప్రతిదినమును సాయంకాలమున రాజునకుఁ బూజఁగావించుచుండెను. రథము ప్రాసాదప్రాంగణముఁ జేరునప్పటికి రాజుతో భోజనముచేసి యారాత్రి యచటనే పరుండవలెనని యిచ్చవొడమిన, పగ్గములను, సృణియు, యుగంబుపై విడిచివేయుచుండెను. ఇదియే వానిపరిజనంబునకు సెలవొసంగిపంపివేయుట. మరునాఁటి యుదయముననే పరిజనులు ప్రాసాదప్రాంగణమున వాని యాగమనమునకు వేచియుందురు. సారధి రథంబుఁగొనిపోయి మరునాఁటి యుదయముననే రాజప్రాసాదద్వారంబునొద్ద రథముతో వానిరాకకు వేచియుండును. ఉపరాజు యానాఁటిరాత్రి ప్రాసాదంబుననుండ నిచ్చగింపనిచో పగ్గంబులను, సృణిని రథమందేయుంచి రాజపూజార్థము ప్రాసాదంబులోనికిఁ బోవుచుండెడివాఁడు. ఒకనాడాతఁడట్లే కావించి రాజదర్శనార్థము లోనికిం జనెను. ఆతఁడు లోనికిఁబోవుటయే తడవుగ వర్షమారంభమాయెను. రాజది కాంచి యాతనినింటికిఁ బోనీయకుండుటచే నచ్చటనే భోజనముఁగావించి నిదురించెను. వానిరాకకు నిరీక్షించుచుఁ బెద్దజనసమూహమారాత్రి యంతయు నాతడిలో వేచియుండెను. మరునాఁటియుదయముననుపరాజు ప్రాసాదమునుండి బయటికివచ్చి యార్ద్రవస్త్రధారులై యున్న వారందఱినిఁగని యిట్లు విచారించెను. “కురుధర్మానువర్తినైన నేను వీరలకందఱకుఁ గష్టముఁగావించితిని. నిశ్చయముగ నా ఋజుత్వము సకళంకమైనది” అని యిట్లు వితర్కించుచుఁ బరితప్తమనస్కుఁడాయెను. పిమ్మట నాతఁడా దూతలకీవైనమంతయుఁ దెలియఁజేసెను. పిమ్మట నా బ్రాహ్మణాదులు “తామెన్నఁడు నాజనుల హింసింపఁదలంపలేదు. అట్టిహింసఁగావించు తలంపుమీకు లేకున్న నా పాపము మిమ్ములఁజెందదు. అట్టి యల్పవిషయమునకే యింతగా సంతాపపడుచున్న మీరెట్టి పాపమునైన నాచరించియుందురా”? అనిచెప్పిరి. పిమ్మట వారు వారివలనఁగూడ జ్ఞానమును వడసి తమ సువర్ణఫలకముపైని వ్రాసికొనిరి.

తరువాత నా రాజసోదరుఁ డిట్లనెను. "నేనీధర్మాచరణ యందు నిష్ణాతుఁడనుగాను. మాపురోహితుఁడు ధర్మమును చక్కఁగఁ బాలించుచున్నాఁడు. అతనినడిగి తెలిసికొనుఁడు" అనిచెప్పినవారు పురోహితునికడకుం బోయిరి.

పురోహితుఁడొకనాడు రాజదర్శనార్థము పోవుచు మార్గమధ్యమున బాలార్కరాగ విరాజమానంబగు నన్యరాజ సమర్పిత రథంబు నొకదానినిగాంచెను. "ఎవ్వారిదీరథము" అని పురోహితుఁడటనున్న వారినిఁ బ్రశ్నించెను, వారు రాజుగారికొఱకుఁ బంపఁబడినదని చెప్పిరి. అప్పుడతఁడిట్లు చింతించెను. "నేను ముదుసలిని. రాజునాకొక రథంబునిచ్చిన నేనద్దాని నధిష్ఠించి విహరించుచుండిన నెంతబాగుగ నుండును" అనియనుకొనుచుఁబోయి రాజదర్శనముఁ గావించి యాతని నాశీర్వదించి పార్శ్వమున నిలువఁబడియుండెను. అంత వారారథముంగొనివచ్చి రాజునకుంజూపిరి. అప్పుడు రాజు "ఇది బహురమ్యంబగు రథంబు. దీనిని నాగురువున కొసంగుఁడు" అనిచెప్పెను. పురోహితుఁడు మాత్రమారథమును వారెంతగఁ బ్రార్థించినను బరిగ్రహింపఁడయ్యెను. పిమ్మట నాతఁడిట్లు తలంచెను. "కురుధర్మాచరణ పరాయణుండనగు నేనితరుల ధనంబున కాసపడరాదు. అట్టియాస నామనమునఁ బొడముటచే నిశ్చయముగ నది నాసచ్చరితమునకుఁ గళంకమగును" అని యాదూతలకీ వైన మంతయుఁజెప్పి "పుత్రికులారా! కురుధర్మంబునుగూర్చి నాకు శంక పుట్టినది. నాకది యానందము నొసంగకున్నది. కాన నేను మీకద్దాని బోధింపఁజాలను" అనియుఁజెప్పెను.

పిమ్మటనాదూతలాతనితోనిట్లనిరి: "ఆశాజనసమాత్రంబు ననే సద్వృత్తి నశింపనేరదు. ఇట్టియల్పవిషయమునకే యింతగావిచారించుచున్న మీ రెట్టి పాపకార్యమునైన నాచరింతురా?" అనిచెప్పి నప్పుడాతఁడు వారలకుఁ గురుధర్మంబును బోధఁగావించెను. వా



రదానిని సువర్ణఫలకముపై వ్రాసుకొనిరి. తరువాత పురోహితుఁడు "నాధర్మాచరణ నాకంత సంతుష్టికరముగ లేదు. రజ్జుగ్రాహకుఁడు మాత్రము శ్రద్ధతో దీని నాచరించుచున్నాఁడు. పోయి వాని నడుగుఁడు" అని చెప్పిన వారయ్యెడకుంజని రజ్జుగ్రాహకునిం దర్శించిరి.

ఒకదినము రజ్జుగ్రాహకుఁడు క్షేత్రంబు నొకదానిం గొల్చుచుండెను. ఒకకాష్ఠంబునకుఁ గట్టిన త్రాటిని దానెగ్రహించి త్రాటిని లాగుకొనిపోవ నదియొకకర్కటరంధ్రము వఱకువచ్చెను. అప్పుడతఁడిట్లు వితర్కించుకొనెను. "ఈరంధ్రమునందుఁ గాష్ఠమునుంచిన రంధ్రస్థకులీరము హింసఁబొందును. నేనీకాష్ఠము నటువైపుంచినరాజు నష్టపోవును. ఇటువైపుంచిన క్షేత్రస్వామి నష్టపోవును. ఇపుడుచేయవలసినదేమి?" అనియనుకొని "కులీరంబు నిజరంధ్రమున నుండవలయును. అదియచ్చటనుండినఁ గనుపించియే యుండును" అనుచుఁగాష్ఠమునురంధ్రమునందుంచెను. అంతఁ గర్కటమును డెక్కలనవరించి ధ్వనిచేసెను. ఆధ్వనివిని యాతఁడు "ఈదండము కులీరముపైఁబడి దాని నీపాటికి వధించియేయుండును. నేనాచరించుచున్న కురుధర్మంబునకిప్పుడు లోపము కల్గినది" అని దీనినంతటిని వారికిఁజెప్పి "నాకు ధర్మమునుగూర్చి శంక జనించుటచే మీకు నేదానినుపదేశింపఁజాలను" అని చెప్పెను.

పిమ్మట వారు "కులీరమునుజంప నీవిచ్ఛగింపలేదు. నీకట్టియుద్దేశము లేనపుడు పాపముకూడలేదు. ఇట్టియల్పవిషయంబునకే యింతగాఁ బరితపించుచున్న నీవేమిపాపము నాచరించియుందువు!" అని చెప్పి వానినుండియు ధర్మంబుఁబరిగ్రహించి కనకఫలకంబుపై వ్రాసికొనిరి. అంత నారజ్జుగ్రాహకుఁడు "నాకీధర్మాచరణయందు సంతుష్టిలేదు. సారథి శ్రద్ధతో దీనిఁబాలించుచున్నాఁడు వానియొద్ద మీరుపదేశమును బొందుఁడు" అని చెప్పెను.

వానియొద్ద సెలవుఁగొని వారుసారథియొద్దకుఁజనిరి. సారథి
యొకదినమున రాజాధిష్ఠితంబగు రథము నారామమునకుఁదోలుకొని
పోయెను. రాజయ్యెడఁ బగలంతయు విహరించి సాయంసమయమున
రథము నెక్కెను. వారు పట్టణమును జేరకమునుపే సూర్యాస్తమయ
సమయమున వర్షాపాతసూచకంబగు జలదమాకాశమును గప్పెను.
అప్పుడు సారథి రాజుతడియునేమోయని భయపడి యశ్వములఁగశ
తోఁగొట్టెను. పిమ్మట నశ్వము లతిశీఘ్రగమనంబునఁ బ్రాసాదముఁ
జేరెను. అప్పటినుండియు నారామమునకుఁ బోవునపుడు కాని యా
రామమునుండి తిరిగివచ్చునపుడు కాని యాస్థలమునుండి యతిత్వరి
తముగ నాయశ్వములు పోవుచుండును. ఏందులకిది? కూరాయశ్వము
లాస్థలమున హానియుండునని సారథితాడనంబువలన గ్రహించియుం
డును. అప్పుడు సారథియు "రాజుతడిసినను తడియకున్నను నాకేమి
యు దోషముండకుండును. అందులకై సుశిక్షితములగు నీయశ్వ
ములఁగొట్టితిగాన నలయికవచ్చువఱకు నవిపర్విడుచున్నవి. ఇది
యంతయు నానేరమే. నేను కురుధర్మంబాచరించుచున్నాఁడను.
నిశ్చయముగ నిప్పుడందులోపము కల్గినది" అని యదియంతయు
వారికిఁజెప్పి యాతఁడు "ఈకారణమువలన నాధర్మమునందు నాకుశం
కపుట్టుచున్నది. కాన నేను మీకుదీనినుపదేశింపఁజాలను" అనియుఁ
జెప్పెను. అప్పుడు వారు "గుఱ్ఱముల నలయింపవలయునని నీవెన్న
డును దలంపలేదు. అట్టియుద్దేశము లేనపుడు నాపాపమునునీకులేదు.
ఇట్టిస్వల్పవిషయమునకై యింతగాఁ బరితపించుచున్న నీవు పాపా
చరణమేల కావింతువు" అని చెప్పి వానివలన ధర్మోపదేశంబుఁబొం
ది యద్దానికనకఫలకముపై లిఖియించుకొనిరి.

పిమ్మట నాసూతుఁడు వీరికొక ధనికునియొద్దకుఁ బంపుచు
"ఈధర్మమున నన్ను సంతుష్టాంతరంగునిగఁ జేయలేదు. ఆధనికుఁడు
దీనిని శ్రద్ధతోఁ బాలించుచున్నాఁడు" అని చెప్పెను.



ఆధనియొద్దకు వారేగి ప్రశ్నించిరి. ఒకదినమున నాతఁడు
సస్యయుక్తంబగు క్షేత్రంబునకుఁజని, యందు బియ్యపుగింజపై చ
క్రములు దోసికొని వచ్చుటంగని యాతఁడు "రాజభాగఁబీ క్షే
త్రమునుండి యీయవలసి యున్నను కరమువిధింపంబడకుండఁగనే
నేనీసస్యమునుండి దోసెఁడు ధాన్యమును దీసితిని. నేను గురుధర్మం
బాచరించుచున్నాఁడను. ఇపుడా ధర్మమునకు లోపము వాటిల్లెను"
అని వారలతోఁ జెప్పుచు నతఁడు "నాకీవిషయముఁగూర్చి శంక
జనించినది. కాన నేను మీకుదాని నుపదేశింపఁజాలను" అనియుఁ
జెప్పెను. అప్పుడు వారు "నీవుతస్కరింప నుద్దేశింపలేదు. అట్టియు
ద్దేశము లేనప్పుడు నీవు తస్కరుఁడుగఁ బరిగణింపఁబడనేరవు. నీకిట్టి
యల్పవిషయమునకే యింతసంతాపముండిన నీకనీవెన్నఁడైనను బర
ధనంబపహరించెదవా!" అని చెప్పి వానినుండి ధర్మోపబోధనంబుఁబొంది
బంగారు రేకుపై వ్రాసికొనిరి. పిమ్మట నాధనికుఁడు "ఈవిషయ
మున నాకుసంతుష్టిలేదు. రాజధాన్యాగారాధ్యక్షుఁడీ ధర్మం
బును బాలించుచున్నాఁడు. వానినడిగి కన్గొనుఁడు" అని చెప్పెను.
అట్లే వారాతనియొద్దకుఁ బోయి యడిగిరి.

ఒకదినమున నాతఁడు ధాన్యాగారద్వారంబుననుండి రాజ
కరంబుఁ గొలిపించుకొనుచుండి యొకగింజను గొలిచిపోసిన ధాన్య
రాశినుండితీసి కొల్తఁదెలియఁ జేయుటకొకచోటఁ బెట్టెను. ఆసమ
యమున వర్షము ప్రారంభించెను, పిమ్మట నతఁడాగింజలన్నిటిని
లెక్కపెట్టి యాకొలిచిపోసిన ధాన్యరాశిపైఁ బోసితినా లేక కొలువఁ
బడని ధాన్యరాసులపైఁ బోసితినా, అనిశంకించి "కొలువఁబడిన వా
నిపైఁ బడవేసిన రాజరిక్థం బధికమై ధాన్యస్వాములు నష్టపోయియుం
దురు. నేను కురుధర్మాచరణపరాయణుఁడను. ఇందుమూలమున
నాకు ధర్మహాని సంభవించినది" అనిదీనినంతను నాదూతలకుఁజెప్పి
తనకందు శంక యుండుటచే వారలకుఁ దాను ధర్మోపదేశంబును గా
వింపనేరనని చెప్పెను. కాని దూతలు "మీకు దొంగిలింపవలయు

నను నుద్దేశము లేకుండుటచే, నిమ్ము నాన్యజాపత్రివర్తకునిగఁ జెప్పఁ
జాలము. ఇట్టి చిన్నవిషయమునకే సంతప్తమనస్కులైన మీ రెన్న
డైనఁ బరవిత్తంబపహరింతురా!" అని చెప్పి వానియొద్ద ధర్మోపదే
శమును బొంది సువర్ణ ఫలకంబుపై వ్రాసుకొనిరి. పిమ్మట నాధా
న్యాగారాధ్యక్షుఁడు "నాయందు ధర్మసంపన్నత లేకుండినను, ద్వార
పాలకుండు శ్రద్ధతో వానిని బాలించుచున్నాఁడు. వానియొద్దకుంజని
నేర్చుకొనుఁడు" అని చెప్పిన వారు ద్వారపాలకుని యొద్దకుంజని ప్ర
శ్నించిరి.

ఒక దినమున ద్వారము బంధింపఁబడు సమయంబున ద్వార
పాలకుఁడు మూఁడుసారులు కేకలు పెట్టెను. బీదవాఁడొకఁడు తన
కనిష్ఠసోదరితోఁగూడఁ బర్ణేంధనాదుల కొఱకు డవికిం జని వాని కేకవిని
యామెతోఁగూడఁ బర్విడివచ్చెను. అపుడు ద్వారపాలకుఁడు "ఏ
మీ! పాలకుఁడు పురమునను న్నాఁడని యెఱుంగవా? యుత్థానసమయం
బున ద్వారంబు మూయఁబడునని నీకుఁ దెలియదా? అనఁగ కర
కొఱకా నీవరణ్యమున కేగవలయును" అని కసరెను. అప్పుడు బీద
వాఁడు "అయ్యా! యీమె నాభార్య కాదు. నాసోదరి" అని చె
ప్పెను. ద్వారపాలకుఁడు వారింగని "అయ్యో! ఇందువలన నిశ్చయ
ముగ నేను గురుధర్మంబుఁ బాలించుచున్నాఁడనా యని యనుమా
నము తట్టుచున్నది. కాన మీకు నేనుదాని నుపదేశింపఁజాలను."
అనిన వారు "నీవట్లు భావించుకొనుటచే వారినట్లంటివి. నీధర్మాచ
రణకించిత్మాత్రమున హానిసంభవింపదు. ఇట్టి స్వల్పకారణమునకే
యింత పరితపించినఁ బ్రయత్నపూర్వకముగ నీ వెట్లు బద్ధముఁ జెప్పఁగల
వు" అని చెప్పి వానివలన ధర్మోపదేశమును బొంది తమ బంగారుపల
కపై వ్రాసికొనిరి. పిమ్మట నాతఁడు "ఈసదాచరణ నన్ను నంతు
ష్టాంతరంగునిగఁ జేయలేదు. ఒక వేశ్యాంగన కురుధర్మంబును శ్రద్ధ
తోఁ బాలించుచున్నది. పోయి యామెనడుగుఁడు" అని వారితోఁ
జెప్పిన వారట్లు గావించిరి.



ఆమె యొకకారణమున నుపదేశముఁ గావించుట కొప్పుకొన
లేదు. ఒకనాఁడు శక్రుఁడను దేవరాజు ఆమె సదాచరణముఁ బరీ
క్షింపఁబోయి యువకుఁడై సహస్రనాణెముల నామెకొసంగి "నేను
మున్ముందు రాఁగలను" అని చెప్పిపోయెను. ఆమెయు మూఁడువత్స
రములవఱకును బరపురుషునివలన నొకతమలపాకు [illegible] సైనఁ బు
చ్చుకొనలేదు. నానాటికి నావేశ్య బీదదయ్యెను. పిమ్మట నిట్లువిత
ర్కించెను. "నాకీ సహస్రసువర్ణములనిచ్చిన యువకుఁడీ మూఁడువ
త్సరములనుండియు నన్నుజూడలేదు. నేనిప్పుడు బీదనైతిని, నానిక
దేహమునందుఁ బ్రాణముల నిల్పుకొనఁజాలను. నేనిప్పుడు పోయి
ముఖ్యన్యాయాధికారితో మనవిఁజేసికొని తొల్లిటివలె నాజీవనము
ను సంపాదించుకొనవలయును" అని న్యాయస్థానమునకుంజని
"మూఁడుసంవత్సరములకుఁ బూర్వమొక పురుషుఁడు నాకు వెయ్యి
బంగారునాణెముల నొసంగినాఁడు. పిమ్మట నాతఁడెన్నఁడును నా క
న్నురాలేదు. ఆతఁడు మృతిఁజెందెనేమో నాకుఁ దెలియదు. అన్న
లోపంబుచే నాదేహమునఁ బ్రాణములు నిలువకున్నవి. ఆర్యా! నే
నేమి చేయువలయును" అనియడిగిన నాన్యాయాధికారి "ఆతఁడు
మూఁడు సంవత్సరములనుండియు రాకుండిన నీ వేమిచేయఁగలవు?
మున్నుయట్ల నీవుజీవనోపాధిని సంపాదించుకొనుము" అని చెప్పెను.
ఇట్టి న్యాయానంతర మామె న్యాయస్థానమునుండి బయటికి వచ్చిన
తోడనే యామెకు వెయ్యివరహాలు నామెకిచ్చుటకు సంసిద్ధుఁడై యొకమనుజుఁడ
చ్చటఁ దటస్థించెను. ధనమును బరిగ్రహింపఁ జేయిసాచునప్పటికి
శక్రుఁడు ప్రత్యక్షమాయెను. ఆమె యిట్లు నుడివెను: "ఇదిగో
వచ్చినయాతఁడే నాకుమూఁడువత్సరములకుఁ బూర్వము వెయ్యి
వరహాల నిచ్చినయాతఁడు. నీధనమును బరిగ్రహింపఁ గూడదు"
అనుచు హస్తంబును వెనుకకుఁ దీసికొనెను. అపుడు శక్రుఁడు తన
నిజరూపంబు నగుపఱచి, యంతరిక్షంబునఁగొంతవఱకునుండి నవోత్థి
తసూర్యబింబంబుభాతిఁ బ్రకాశించుచుఁ బురజనుల నందఱ రావించి

సమూహాముమధ్యమున నిల్పబెట్టెను. "ఈగణికయొక్క బు
స్వభావమును దెలిసికొనఁగోరి మూఁడువత్సరములకుఁ బూర్వము
మెకు వెయ్యివరహాలనిచ్చితిని. ఆమెవలెఁ బ్రవర్తింపుఁడు. మీ
ర్యాదనామెవలె నిల్పుకొనుఁడు" అనియిట్లుబోధించి, యామెగృహ
మును సప్తవిధమాణిక్యంబులతో నింపి, "జాగరూకతతోఁ బ్రవర్తిం
పుము" అని చెప్పుచు స్వర్గమునకుఁ బోయెను. దీని నంతటిని వారిఁ
తోఁ జెప్పి, ధర్మాచరణముఁగూర్చి ముచ్చటించుట కియ్యకొనక
ట్లు చెప్పెను. "ఒకవేతనంబు నార్జింపక మునుపింకొకనికియ్యకొ
ని, కావున నాకుధర్మాచరణ సంపన్నతలేదు, అక్కాలంబున నేను మీ
కాధర్మంబుపదేశింపఁజాలను" అని చెప్పెను. అదివిని దూత
"హస్తపరిసారమాత్రమున సదాచరణకువినాశంబుగలుగలేదు. స
త్సదాచరణము సంపన్నమైనదియే" అని చెప్పినఁదొల్లిటివారి
నామెయు వారలకు ధర్మోపదేశముఁగావింప వారాధర్మములఁ
సువర్ణఫలకంబున లిఖియించుకొని దంతిపురమునకుఁ జని తమ
గారికిజరిగిన యుదంతమంతయు నివేదించిరి.

ఆనరపాలుఁడును గురుధర్మములఁ బాలించుచుఁ బంచశీ
లాచరించెను. అప్పుడుకళింగరాజ్యమున నెల్లెడల వర్షము
మూఁడు భయంబులు నుపశమించెను, దేశంబు ఫలవంతంబై
సమృద్ధితోఁ బఱగుచుండెను. బోధిసత్త్వుఁడు యావజ్జీవమును
శీలుండై, సత్కర్మల నాచరించుచుఁ దనజనులతోఁగూడ బ
లోకంబులకుఁజనెను.



